అపరాధ పరిశోధన అనుబంధం—152

# మూడు నవలలు

(మీ కోసం "అపరాధ పరిశోధన" అందజేస్తున్న
మీరు మెచ్చే క్రైమ్ నవలలు)

## మరబొమ్మ మనుషులు

రచన: సుంకరి రాంప్రసాద్

## గజేంద్రమోక్షం

రచన: వసుంధర

## ఆడపిరాజు

రచన: బొమ్మిడి అచ్చారావు

అపరాధ పరిశోధన సప్లిమెంట్—152
ఆగష్టు, 1986
వెల: రు. 7-00
ఏడాది చందా: 84 రూపాయలు

మేనేజింగ్ ఎడిటర్:
శ్యామ దామోదర్ రెడ్డి

సంపాదక వర్గం:
శ్యాంబాబు
ఏ. పీ. మోహన్రావ్
బొమ్మిడి అచ్చారావు
విద్వాన్ షీలాదేవి

కార్యాలయం:
అపరాధ పరిశోధన కార్యాలయం
నారాయణగూడ, హైదరాబాదు-29
ఫోన్-64843

ముద్రణ:
క్రాంతి ప్రెస్,
2, ఫ్రాన్సిస్ జోసెఫ్ స్ట్రీట్, మద్రాసు-1.

# మరబొమ్మ మనుషులు

## సుంకరి రాంప్రసాద్

రాత్రి పదకొండు గంటల సమయం.

న్యూఢిల్లీ చౌరంగీ లేన్‌లోని ఆ ప్రాంతమంతా నిర్మానుష్యంగా వుంది. ఆఫీస్ ఆఫ్ ది డిఫెన్స్ మినిస్ట్రి కాంపౌండ్ ముందు ఆగిందో తెల్లని అంబాసిడర్ కారు. డ్రయివింగ్ సీటులో వున్న వ్యక్తిని చూసి వినయంగా సెల్యూట్ చేసి, గేటు తెరిచాడు గూర్ఖా.

పార్కింగ్ ప్లేసులో కారును ఆపి, హుందాగా దిగాడు అతడు. డిఫెన్స్ మినిస్ట్రిలో అండర్ సెక్రటరీగా పనిచేస్తున్నాడతడు. గూర్ఖాను దగ్గరకు పిలిచి, ఆఫీసును తెరవమని చెప్పాడు.

ఆఫీసు లోపలకు అడుగుపెట్టాక, తలుపులు దగ్గరగా వేస్తూ, గూర్ఖాను వెళ్ళిపొమ్మన్నట్లు సైగ చేసా డతడు. గూర్ఖా అతడి వంక ఆశ్చర్యంగా చూశాడు.

అప్పుడప్పుడు రాత్రి పన్నెండింటివరకూ ఆఫీసులో పనిచేసుకుంటూ వుండిపోవడం అతడికి అలవాటే. కాని,

ఆఫీసును క్లోజ్ చేశాక, ఇంత రాత్రి సమయంలో ఇలా ఒంటరిగా రావటం మాత్రం అతడికి ఇదే మొదటసారి.

అతని చేతిలో పాకెట్ సైజుకన్నా కాస్త పెద్దదిగా వుండే చిన్న లెదర్ బాగ్ వుంది. అలాంటి హాండ్ బాగ్‌ను అతడి చేతిలో యెన్నడూ చూడలేదు ఆ గూర్ఖా.

ఆ గూర్ఖా మనసులో యెందుకో చిన్న అనుమానం ప్రవేశించింది.

అతడు.... శ్రావణ్ కుమార్. పదేళ్ళుగా డిఫెన్స్ మినిస్ట్రీలోనే పని చేస్తున్నాడు. ది మోస్టు సిన్సియర్ అండ్ హానెస్టు ఆఫీసరుగా మన్ననలు పొందాడు. అలాంటి శ్రావణ్ కుమార్‌ను అనుమానించడం తప్పని ఆ గూర్ఖాకు తెలుసు. కాని, ఎంతగా సరిపెట్టుకున్నా అతడు అక్కడి నుండి కదలలేకపోయాడు.

'పోనీ .... ఒక్కసారి శ్రావణ్ కుమార్ ఏం చేస్తున్నాడో చూస్తే' అనుకున్నాడతడు.

మెల్లగా తలుపుల దగ్గరకు నడిచాడతడు. తలుపుల సందులోనుండి చూశాడు. నిర్మానుష్యంగా వున్న ఆఫీసు సాక్షాత్కరించింది. శ్రావణ్ కుమార్ అందులో లేడు. "మరి యెక్కడకు వెళ్ళినట్లు?" సాలోచనగా నొసలు చిట్లించాడతడు.

ఆఫీసును ఆనుకొని మూడు గదులున్నాయి. ఒకటి రికార్డ్ రూమ్, రెండవది శ్రావణ్ కుమార్ గది, మూడవది డైరెక్టర్ ఆఫ్ ది డిఫెన్స్ మినిస్ట్రీ గది.

'ఆ మూడు గదుల్లో యేదో ఒకదానిలోకి వెళ్ళి వుంటాడా శ్రావణ్ కుమార్ ....? ఎందుకు?'

ఆ గూర్ఖా కెందుకో ఆ రోజు పేపరులో చదివిన

'రామ్‌స్వరూప్' కేసు గుర్తుకు వచ్చింది. కేవలం డబ్బు కోసం కక్కుర్తిపడి దేశరక్షణ రహస్యాలను విదేశీయులకు అమ్మజూపిన అలాంటి బద్మాష్‌లను కత్తితో కండగా నరికేయాలన్నంత కోపం వచ్చిందతనికి.

'అంటే.... శ్రావణ్ కుమార్ కూడా....' అతని మనసులో ప్రవేశించిన అనుమానపు పురుగు మెదడును దొలచటం ప్రారంభించింది. ఆ టెన్షన్ భరించలేకపోయాడతడు.

అతడు తన బూట్లను విప్పాడు. మెల్లగా అడుగుల చప్పుడు కాకుండా నీటిగొట్టాన్ని సమీపించాడు. పిల్లిలా పైకి ఎగబ్రాకాడు. వెంటిలేటర్‌ను సమీపించాడు. రెండు చేతులతో వెంటిలేటర్ అంచును పట్టుకుని మెల్లగా తలెత్తి వెంటిలేటర్ గుండా ఆ గదిలోకి చూశాడు.

అది డైరెక్టర్ గది. అందులోని ఐరన్ సేఫ్ తెరచి వుంది దానిముందు నిలబడివున్నాడు శ్రావణ్ కుమార్. అతడు తన హాండ్ బ్యాగ్ తెరిచాడు. అందులో నుండి ఒక మినీ ఫ్లాష్ కెమేరాను తీశాడు.

అత్యంత రహస్యమైన దేశరక్షణ వ్యవహారాలకు సంబంధించిన ఫైల్లు ఆ సేఫ్‌లో ఉంచబడతాయి.

శ్రావణ్ కుమార్ ఒక్కొక్క ఫైలును తీసి అందులోని పేపర్లను చకచకా ఫోటోలు తీస్తున్నాడు. ఆ దృశ్యం చూసేసరికి ఆ గూర్ఖాకు మతిపోయింది. తను చూస్తున్నది కలో, నిజమో కూడా అర్థం కాలేదతడికి.

శ్రావణ్ కుమార్ లాంటి నిజాయితీ గల ఆఫీసరును దేశద్రోహిగా ఊహించుకోలేకపోతున్నాడు. కాని కర్తవ్యం అతడి వెన్ను తట్టింది.

మెల్లగా పైపు పట్టుకుని క్రిందకు దిగాడతడు. మెయిన్

గేటు దగ్గరున్న తన ఉరెన్ కాబిన్‌లోనికి ప్రవేశిం చాడు. టెలిఫోనును తీసి ఒక నెంబర్‌ను డయల్ చేశాడు.

అతడు ఫోన్ చేస్తూంది.... సి.బి.ఐ. ఆఫీసుకు. ఇలాంటి పరిస్థితులే వస్తే.... ఆ విషయాన్ని తక్షణం సి.బి.ఐ.కి తెలియజేయడానికి ఒక ప్రత్యేకమైన నెంబర్ యివ్వ బడింది అతడికి. నిజానికతడు మామూలు గూర్ఖా కాడు. ఒక జూనియర్ సి.బి.ఐ. ఇన్‌స్పెక్టర్.

దేశరక్షణ రహస్యాలను కాపాడటం కోసం సి.బి.ఐ. తీసుకున్న జాగ్రత్తలలో సి.బి.ఐ. మనిషినే వాచ్ మన్‌గా నియమించడం ఒకటి. అయితే ఆ విషయం డిఫెన్స్ మినిస్ట్రి డైరెక్టర్ కూడా తెలియదు.

స్వదేశంలోని ముఖ్యమైన సంస్థలలోనే గాక, విదే శాలలోని ప్రభుత్వ కార్యాలయాలలో సైతం యెంతో తెలివిగా తమ ఏజంట్లను ఉద్యోగులుగా ప్రవేశపెడుతుంది సి.బి.ఐ.

విదేశాలలో అయితే కొన్నిచోట్ల ఆ దేశస్థులనే డబ్బుతో ప్రలోభపెట్టో లేక అతని బలహీనతలను క్యాష్ చేసి—అతడిని బ్లాక్‌మెయిల్ చేసో, వారిని లొంగదీసుకుంటారు. కేవలం తమ దేశ రహస్యాలను అందజేయడమే వారి పని. దానికి ప్రతిఫలంగా వారికి పెద్ద మొత్తంలో డబ్బు ముడుతూంటుంది. అలాంటి వారిని గూఢచారుల భాషలో 'ఇన్‌ఫార్మర్స్' అంటారు.

'శ్రావణ్‌కుమార్ కూడా అలాంటి ఇన్‌ఫార్మరే నేమో అన్న అనుమానం పీడించసాగింది అతడిని. శ్రావణ్‌కుమార్ చేస్తున్న పనిని గురించి వివరంగా తన

ఆఫీసుకు రిపోర్టు చేయసాగాడు ఆ సి.బి.ఐ. ఇన్స్పెక్టర్ కమ్ గూర్ఖా. అదే సమయంలో తలుపులు తెరుచుకుంటూ వస్తున్న శ్రావణ్ కుమార్ కనిపించాడతడికి.

తమ మనుషులు వచ్చేసరికి ఆలస్యం అవుతుంది. అంత లోగా శ్రావణ్ కుమార్ తప్పించుకుపోకుండా ఆపాలి. ఆ ఫోటోలు తీయబడ్డ రక్షణ రహస్యాలు విదేశీయుల చేతుల్లో పడితే యెంత ప్రమాదమో అతడికి బాగా తెలుసు.

రిసీవర్‌ను క్రెడిల్ మీద వుంచి శ్రావణ్ కుమార్‌కు అడ్డంగా నడిచాడతడు. అవసరమయితే తన ఐడెంటిటీని బయట పెట్టయినా సరే శ్రావణ్ కుమార్‌ని ఆపటమే అతడి ఉద్దేశం.

కారుకు, తనకు మధ్య అడ్డంగా నిలుచున్న గూర్ఖా వంక విసుగ్గా చూశాడు శ్రావణ్ కుమార్.

"సారీ...ఫర్ ద ఇన్‌కన్వీనియన్స్ సర్! మీరు ఒక పది నిముషాలపాటు వెయిట్ చేయాల్సి వుంటుంది."

అసహనంగా చూశాడు శ్రావణ్ కుమార్. "నో" అంటూ అడ్డంగా నిలుచున్న గూర్ఖాను విసురుగా ప్రక్కకు తోశాడు.

"గో అండ్ ఓపెన్ ద డోర్స్. నేను అర్జంటుగా వెళ్ళాలి" కటువుగా అన్నాడతడు.

"మీరు బయటకు వెళ్ళాలంటే మీ చేతిలోని కెమేరాను నాకు అప్పగించాల్సి వుంటుంది సర్...."

గూర్ఖా మాటలకు నల్లగా మాడిపోయింది అతడి ముఖం. కోపంతో అతడి దవడ కండరాలు బిగుసుకున్నాయి.

"యూ....బ్లడీ ఫూల్....!" అంటూ పిడికిలి బిగించి గూర్ఖా ముఖంమీదకు బలంగా విసిరాడతడు.

ఛటుక్కున ప్రక్కకు వంగి ఆ పిడికిలి పోటు నుండి తప్పించుకున్నాడా గూర్ఖా. ఆ విసురుకు ముందుకు తూలిపడ్డాడు శ్రావణ్ కుమార్. అతడి చేతిని వెనక్కు విరిచిపట్టుకొని, కెమేరా వున్న లెదర్ బ్యాగ్ ను లాక్కోటానికి ప్రయత్నించాడా గూర్ఖా.

లెదర్ బ్యాగ్ ను వదలిపెట్టకుండా దెస్పరేట్ గా గింజుకున్నాడు శ్రావణ్ కుమార్. కుడిచేతిని మెల్లగా పైకెత్తాడు. గూర్ఖా మెడను దొరకబుచ్చుకుని, తన వీపు మీద గుండా అతడి శరీరాన్ని బస్తాలా పైకెత్తి క్రిందకు విసిరేశాడు. మల్లయుద్ధంలో ప్రవేశం వున్నవారు మాత్రమే ప్రయోగించే టెక్నిక్ అది.

అయితే ఆ విసురులో శ్రావణ్ కుమార్ చేతిలోని లెదర్ బ్యాగ్ గూర్ఖా చేతిలోకి వచ్చేసింది. క్రిందపడ్డ గూర్ఖా నడుం పట్టుకొని గిర్రున తిప్పి పొదలలోకి విసిరేశాడు శ్రావణ్ కుమార్.

రెండోసారి శ్రావణ్ కుమార్ చేతి లాఘవాన్ని రుచి చూశాక, బొంబాయిలో జరిగిన జాతీయ క్రీడలలో, ఢిల్లీ తరపున పాల్గొన్న మల్లయుద్ధ యోధులలో శ్రావణ్ కుమార్ కూడా ఒకడన్న విషయం....అప్పుడు గుర్తుకు వచ్చింది ఆ గూర్ఖాకు.

మరోసారి శ్రావణ్ కుమార్ చేతికి చిక్కితే యేం జరుగుతుందో అతడికి బాగా తెలుసు. లెదర్ బ్యాగ్ జిప్ తీసి అందులోని కెమేరాను పైకితీశాడతడు. కెమేరాను ఓపెన్ చేసి రీల్ ను చేతిలో పట్టుకున్నాడు. అదే సమ

యంలో భల్లూకంలా అతడిమీదకు చూశాడు శ్రావణ్ కుమార్.

కంఠం క్రిందుగా మోచేతిని బిగించి, గూర్ఖా శరీరాన్ని పాములా చుట్టేసాడతడు. ఆ పట్టులోని బలానికి తన కంఠనరాలు తెగిపోతాయేమో అనిపించిందా గూర్ఖాకు.

క్షణ, క్షణానికి బిగుసుకుంటున్న ఆ పట్టువలన ఊపిరి తీయడం సైతం యెంతో కష్టంగా వుంది అతడికి.

అది సామాన్యమైన పట్టుకాదు. ఇండియన్ రుస్తుంగా శ్లాఘించపడ్డ దారాసింగ్ ఫేవరెట్ టెక్నిక్ గా పేరు పొందిన 'ఇండియన్ డెడ్ లాక్' అది. తన అంతిమ క్షణాలు దగ్గరపడ్డాయనిపించిం దతనికి.

'తన ప్రాణంపోయినా ఆ రీలు మాత్రం అతడికి చిక్కకూడదు' అదే అతడి అంతిమ లక్ష్యం. చేతిలోని రీలును పూర్తిగా విప్పేసాడు.

ఆరుబయలులో విప్పబడిన ఆ నెగిటివ్ వెంటనే ఎక్స్పోజ్ అయిపోయింది. మరి దానిని డెవలప్ చేసినా ప్రయోజనంలేదు. తృప్తిగా ఆ నెగిటివ్ వంక చూస్తూ కళ్ళు మూశాడు గూర్ఖా.

నిర్జీవంగా నేలమీదకు వ్రాలిపోయిన ఆ గూర్ఖాను విడచి లేచి నిలబడ్డాడు శ్రావణ్ కుమార్. పాడైపోయిన ఆ నెగిటివ్ను కాలితో తన్నాడు. గిరుక్కున వెనక్కు తిరిగి కోపంగా అడుగులు వేసుకుంటూ మెయిన్ గేటువంక నడిచాడు.

గేటును బార్లా తెరిచాడు. తరువాత కారును స్టార్టు చేసి ముందుకు పోనిచ్చాడు.

ఆ కాంపౌండ్ను వీడి అతడి కారు వెళ్ళిపోయిన అయిదునిముషాల తరువాత ముగ్గురు సి.బి.ఐ. ఆఫీసర్లున్న

ఒక నీలిరంగు అంబాసిడర్ కారు ఆ కాంపౌండ్‌లోకి ప్రవేశించింది.

విచిత్రం యేమిటంటే శ్రావణ్‌కుమార్ ఆ క్షణం నుండీ ఎవరికీ మరి కనిపించలేదు. మంత్రం వేసినట్లు మాయమయ్యాడతను.

## 2

"ఫోర్ ఏక్ ఛా ..."

రాంకుమార్ వంక విచిత్రంగా చూశాడా సర్వర్. అప్పటికి తొమ్మిది కప్పుల 'టీ'ని సర్వ్ చేశాడతడు.

రాత్రి ఒంటిగంట ప్రాంతంలో ఆ హోటల్‌లో అడుగు పెట్టాడా పెద్దమనిషి. అప్పటినుండి అరగంట కో కప్పు చొప్పున టీలు త్రాగుతూ అలా.... ఆ సీటులోనే కూర్చున్నాడు.

అర్ధరాత్రివరకూ పేకాడి, జేబులు ఖాళీ అయ్యాక, భార్య నోటికి జడిసి ఇంటికి వెళ్ళలేక తెల్లవార్లూ టీ బంకుల్లోనే కాలం గడిపేసే మధ్యతరగతి మనిషిలా కనిపించడం లేదతడు.

'మరి.... ఎందుకోసం అతడు ఊరికినే అలా కూర్చున్నట్లు?' అదే ఎంతగా ఆలోచించినా ఆ సర్వర్‌కు అంతుబట్టని విషయం.

సర్వర్ అనుకున్నట్లుగా ఆ పెద్దమనిషి అక్కడ ఊరికినే కూర్చోలేదు. ఆ టీ బంక్ యెదురుగా వున్న శ్రావణ్‌కుమార్ యింటిని వేయికళ్ళతో వాచ్ చేస్తున్నాడతడు.

డిఫెన్స్ మినిస్ట్రి ఆఫీసుకు గూర్ఖాగా నియమింపబడ్డ తమ జూనియర్ యేజెంట్ హత్య కావింపబడ్డాడన్న విషయం వెంటనే సి.బి.ఐ. చీఫ్ కరుణాకర్‌కు తెలియ

చేయబడింది. అతడా కేసును రాంకుమార్‌కు అప్ప
జెప్పాడు.

'యోగాశ్రమం', 'మరణభీతి' కేసులను రాంకుమార్
హాండిల్ చేసిన విధానం అతడికి యెంతో నచ్చింది.
అందుకే దేశరక్షణకు సంబంధించిన ఈ అతిముఖ్యమైన
కేసుకూడా రాంకుమార్‌కే అప్పజెప్పాడతడు.

రాంకుమార్ కాలాన్ని వృధాపరిచే మనిషి కాడు.
స్కాట్‌లాండ్ యార్డ్‌లో ప్రత్యేక శిక్షణ పొందిన
వ్యక్తి అతడు.

"నీవు వృథాపరిచే ప్రతి నిమిషమూ, హంతకుడికి నీ
నుండి దూరంగా తప్పించుకోవడానికే ఉపయోగపడు
తుంది" అన్న పాఠాన్ని అతడెప్పుడూ మరచిపోలేదు.

ఆ రోజు రాత్రే అతడు శ్రావణ్‌కుమార్ ఇంటిని
ఒక్క అంగుళంకూడా వదలకుండా క్షుణ్ణంగా పరిశో
ధించాడు కాని....ఆ ఇంటిలో అతడికి అనుమానించ దగ్గ
వివరాలేమీ లభించలేదు.

శ్రావణ్‌కుమార్ విదేశీయుల ఇన్‌ఫార్మర్ అయి
వుండినట్లయితే....అతడు విలాసవంతమైన జీవితం గడు
పుతూ ఉండాలి. కాని అతడి యిల్లు, ఫర్నిచర్, మిగిలిన
వస్తువులు అన్నీ అతడు సామాన్యమైన జీవితాన్ని గడుపు
తున్నట్లు ఋజువు చేస్తున్నాయి.

అతని పర్సనల్ ఫైల్....అతడు చాలా నిజాయితీగల
వ్యక్తిగా చూపెడుతూంది. అతని బాహ్య జీవితం
గురించి చేయబడ్డ ఎంక్వయిరీలోకూడా అతడు మంచి
వ్యక్తి అనే తేలింది.

'మరి....అంత హానెస్టు ఆఫీసరు ఒక దేశద్రోహిగా
యెలా మారాడు?' అదే అంతుపట్టడం లేదు

రాంకుమార్ కు.

తనకు ఆ ఎసైన్ మెంట్ ను అప్పగిస్తూ తమ చీఫ్ కరుణాకర్ తనతో అన్న మాటలు గుర్తుకు వచ్చాయి అతడికి.

“రాంకుమార్ మన రక్షణ రహస్యాలను సంపాదించడానికి యెవరో పెద్ద పథకమే వేసారు. వారికి యెవరో విదేశీయుల అండదండలు ఉండివుంటాయన్నది నేకెడ్ ఫాక్ట్. శ్రావణ్ కుమార్ కేవలం ఆ సాలె గూడులో చిక్కుకున్న పురుగులాంటివాడు.

“ఎనీ వే.... శ్రావణ్ కుమార్ నోరువిప్పి.... అతనికి తెలిసిన రహస్యాలను వారికి అందచేయకముందే మనం అతడిని ట్రేస్ చేయాలి.

“ఐ వాంట్ హిమ్ అలైవ్ ఆర్ డెడ్.”

రాత్రి ఒంటిగంటనుండీ శ్రావణ్ కుమార్ కోసం అతని ఇంటి ఎదురుగా వున్న టీ బంక్ లో మాటువేసి వున్నాడు రాంకుమార్. కాని అతడు ఊహించినట్లుగా శ్రావణ్ కుమార్ ఆ రాత్రి యింటికి రాలేదు.

ఉదయం ఆరుగంటల ప్రాంతంలో ఆ టీ బంక్ ముందు ప్రత్యక్షమయ్యాడు ఒక రాజస్తానీ బేహారీ. పెద్ద గోనె పట్టాను పరచి దానిమీద నాణేలను వంతుల వారీగా కుప్పలు పోసాడు. మారకానికి చిల్లరనిచ్చే దళారీ వ్యాపారి అతడు.

అయితే అతడు వ్యాపారి కాదని, తనను రిలీవ్ చేయడానికి వచ్చిన మరో సి.ఐ.బి. ఇన్ స్పెక్టర్ సిన్హా అని రాంకుమార్ కు తెలుసు. బద్ధకంగా వళ్ళు విరుచుకుంటూ హోటల్ బయటకు నడిచాడతడు,

# 3

"పని అంటే ప్రాణం పెట్టే మనిషి శ్రావణ్ కుమార్. కాని బొంబాయి వెళ్ళి వచ్చినప్పటినుండి ఎందుకో కాస్త డల్ గా ఉన్నట్లు అనిపించాడు. రెండు, మూడుసార్లు తలనొప్పి వస్తూందని శలవుకూడా తీసుకొని యింటికి వెళ్ళిపోయాడు.

"బట్ జస్టు ఐ కాంట్ బిలీవ్ ఇట్. అతడే ఈ పని చేసాడంటే ముఖ్యంగా ఓ వాళ్ళ.... నో...."

బాధగా తల విదిలించాడు డిఫెన్స్ మినిస్ట్రి డైరెక్టర్. అతని యెదురుగానున్న కుర్చీలో కూర్చుని, అతడు ఆఫర్ చేసిన గ్రేప్ జ్యూస్‌ను చప్పరిస్తూ, ఆయన చెబుతున్నదంతా శ్రద్ధగా ఆలకిస్తున్నాడు రాంకుమార్.

"అతడు బొంబాయి వెళ్ళింది జాతీయ క్రీడలలో పాల్గొనటానికి కదూ!"

అవునన్నట్లు తలాడించాడు డైరెక్టర్.

"ఎనీ స్పెషల్ ఇన్‌వాల్వ్‌మెంట్ ఇన్ హిజ్ ట్రిప్?"

"అంటే."

"బొంబాయి వెళ్ళి వచ్చినప్పటినుండి అతనిలో ఏదో మార్పు కన్పించిందని అన్నారు మీరు. అఫ్‌కోర్స్ ఇట్ మే బి ఎ నెగ్లిజబుల్ చేంజ్. కాని, ఈ పరిస్థితులలో యే చిన్న ఆధారాన్నికూడా మనం వదులుకో లేము కదా. సో.... శ్రావణ్ కుమార్ బొంబాయి ట్రిప్‌లోనే ఏదో విశేషం ఉండివుండాలి. దట్ వుయ్ హావ్ టు ఫైండ్."

"నాకు తెలిసినంతవరకూ ఆ ట్రిప్‌లో అనుమానించ దగ్గ విశేషమేమీ లేదనుకుంటాను. కాకుంటే అతడి కాలికి యేక్సిడెంట్ జరగడంచేత, మిగిలిన క్రీడాకారు

అతో వెంటనే తిరిగి రాలేకపోయాడు."

"శ్రావణ్ కుమార్ కు యాక్సిడెంట్ జరిగిందా?" ఆత్రంగా అడిగాడు రాంకుమార్.

అతడా విషయంపట్ల యెందుకంత ఆసక్తి చూపిస్తున్నాడో అర్థంకాలేదు ఆ డైరెక్టర్ కు.

"జాతీయ క్రీడలు పూర్తి అయినాక, తోటి క్రీడాకారులతో కలిసి బొంబాయి నగరాన్ని చూడటానికి వెళ్లాడు శ్రావణ్ కుమార్. విక్టోరియా టెర్మినస్ దగ్గర షాపింగ్ పూర్తిచేసుకొని రోడ్డును క్రాస్ చేయబోతున్న శ్రావణ్ కుమార్ ను ఒక కారు ఢీకొంది.

పార్కింగ్ చేయబడ్డ కారును రివర్స్ చేస్తూ వెనుకనున్న శ్రావణ్ కుమార్ ను గ్రుద్దేసాడు డ్రయివర్. అతడి మోకాలికి కారు బంపర్ బలంగా తగిలింది. ఆ కారులోని వారే పాపం శ్రావణ్ కుమార్ ను దగ్గరలో వున్న నర్సింగ్ హోమ్ లో జాయిన్ చేయించారు. వారంరోజులపాటు అందులోనే ఉన్నాడతడు.

ఆఫ్ కోర్స్....తరువాత ఆ నర్సింగ్ హోమ్ బిల్స్ ను మేమే పే చేసామనుకోండి."

"ఆ నర్సింగ్ హోమ్ ఎడ్రస్ చెబుతారా?" అన్నాడు రాంకుమార్.

"ఒక్క నిమిషం" అంటూ ఇంటర్ కమ్ లో తన పి.ఎ.ను పిలిచాడతడు. పి.ఎ. ఆ గదిలోనికి వచ్చాడు.

"ఈయనకు....బొంబాయిలో శ్రావణ్ కుమార్ .... ట్రీట్ మెంట్ పొందిన నర్సింగ్ హోమ్ అడ్రస్ ఇవ్వండి. మిస్టర్ రాంకుమార్ హి డూజ్ యువర్ ఫేవర్."

చిరునవ్వుతో రాంకుమార్ కు వీడ్కోలునిస్తూ అన్నాడతడు. పి.ఎ. వెనుకగా ఆ రూమ్ బయటకు నడిచాడు

రాంకుమార్.

పి.ఎ. అందించిన మెడికల్ రిపోర్టును చదివాడు. మోకాలికి దెబ్బతగలటంవలన వారంరోజులపాటు ఇన్ పేషంటుగా ఆ నర్సింగ్ హోమ్‌లో అడ్మిట్ చేయబడినట్లు వుంది ఆరిపోర్ట్. ఆ నర్సింగ్ హోమ్ పేరు.... అడ్రస్ డైరీలో వ్రాసుకున్నాడు. డైరీని క్లోజ్ చేయబోతూ మరోసారి ఆ పేర్లను చదివాడతడు.

డాక్టర్ ....జీవన్
గ్రీన్ ఫ్లవర్ నర్సింగ్ హోమ్,
విక్టోరియా టెర్మినస్,
బొంబాయి.

## 4

గ్రీన్ ఫ్లవర్ నర్సింగ్ హోమ్....

రాత్రి పదిగంటలు దాటకముందే ఆ నర్సింగ్ హోమ్‌ను నిశ్శబ్దం ఆవహించింది. వార్డులలోని పేషెంట్లందరూ ప్రశాంతంగా నిద్రపోతున్నారు.

బెడ్ నెంబరు టెన్ మీద పడుకున్న గులాబ్ సింగ్ అసహనంగా కదిలాడు. మెల్లగా కనులు విప్పాడు. కనురెప్పల మాటునుండి ఆ వార్డులోని పేషెంట్స్‌ను ఒక్కసారి పరికించి చూసాడు.

తను ఒక్కడుతప్ప మిగిలినవారంతా గాఢనిద్రలో మునిగిపోయి ఉన్నారు. వారిది సహజ నిద్రలాలేదు. ఏదో మత్తుమందు ఇచ్చినవారిలా మొద్దుల్లా పడి వున్నారు వారు.

ఆ రోజు రాత్రి ఎనిమిదీ, తొమ్మిది మధ్య పాలతో పాటు ఒక ఎర్రరంగు కాప్సూల్ యిచ్చింది నర్స్. పేషెంట్లందరూ ఆ కాప్సూల్‌ను వేసుకున్నారు. ఒక్క

గులాబ్‌సింగ్ మాత్రం దానిని జేబులో వేసుకొని కట్టి పాలు త్రాగాడు.

రోగులకు సాధారణంగా నిద్రపట్టదు. అలాంటిది రాత్రి పదిగంటలు దాటకముందే పేషెంట్స్ అందరూ మత్తుగా నిద్రపోతున్నారంటే, అది తప్పక ఆ కాప్స్యూల్ ప్రభావమే అయివుంటుంది అనుకున్నాడతడు.

గులాబ్‌సింగ్ ఇండియన్ ఎయిర్‌లైన్స్‌లో కస్టమ్స్ విభాగంలో పనిచేస్తున్నాడు. స్పైనల్ కార్డులో అప్పుడప్పుడు నొప్పి వస్తూందని .. ఇన్ పేషెంటుగా ఆ గ్రీన్ ఫ్లవర్ నర్సింగ్ హోమ్‌లో ఎడ్మిట్ అయ్యాడతడు.

నర్సింగ్ హోం అంతా కలియతిరుగుతూ, సరదాగా నవ్వుతూ కబుర్లు చెప్పే గులాబ్‌సింగ్, ఎడ్మిట్ అయి ఇరవై నాలుగు గంటలు కాకముందే అందరికీ పరిచయస్తుడై పోయాడు.

వార్డులలోని ప్రతి పేషెంట్ వివరాలు యెంతో శ్రద్ధగా అడిగి తెలుసుకుంటాడు. ఆ నర్సింగ్ హోమ్‌లోని ప్రతి విభాగానికి వెళ్ళి, ఆ వివరాలను ఎంతో శ్రద్ధగా ఆలకిస్తాడు అతడు.

క్రొత్త విషయాలను నేర్చుకోవడంపట్ల కొద్దిమంది అలాంటి ప్రత్యేకమైన శ్రద్ధను చూపిస్తుంటారు. బహుశా గులాబ్‌సింగ్ కూడా ఆ కోవ వ్యక్తి అయివుంటాడని భావించారు ఆ నర్సింగ్ హోమ్ సిబ్బంది.

• • •

గులాబ్‌సింగ్ ఆ నర్సింగ్ హోమ్‌లో ఎడ్మిట్ అయి అది నాల్గవ రోజు. ప్రతి రోజూ ఉదయం, సాయంత్రం డాక్టర్ జీవన్ వార్డులకు రౌండ్స్‌కు వచ్చి, ఒక్కొక్క పేషెంట్‌ను పరీక్షించి వెళ్తుంటారు.

ఈ వార్డు రోజుల్లో గులాబ్ సింగ్‌ను ఆకర్షించిన ఒక ప్రత్యేక విషయం వుంది అది:

జీవం కోల్పోయినట్లు గాజుగోళీల్లా మారుతున్న పేషెంట్స్ కళ్ళు. వారు శారీరకంగా బాగానే ఉంటున్నారు. వారి శారీరక రుగ్మతలుకూడా నూటికి నూరు పాళ్ళు తగ్గుతున్నట్టే కన్పిస్తుంది. కాని వారి కళ్ళు మాత్రం మానసిక స్థైర్యం కోల్పోయిన వారిలా నిర్జీవంగా వున్నాయి.

అయితే ఆ విషయాన్ని యెంతో ప్రత్యేకంగా గమనిస్తే తప్ప యెవరూ పోల్చలేరు.

ఏదో తెలియని అనుమానం గులాబ్ సింగ్ మనసును పట్టి పీడించసాగింది.

ఆ రోజు ఉదయం నుండీ అతడికి ఆహారం యేమీ యివ్వబడలేదు. ఉదయం, మధ్యాహ్నం, రాత్రి.... ఒక్కొక్కటి చొప్పున ఆ రెడ్ కాప్స్యూల్స్ మాత్రం... కాస్త గ్లూకోజ్ నీళ్ళతో అతడికి యివ్వడ్డాయి. అయితే అతడా కాప్స్యూల్స్‌ను వేసుకోలేదు. కేవలం గ్లూకోజ్ మాత్రం త్రాగాడు.

ఆ రోజు రాత్రి తన స్పెషల్ వార్డుకు ప్రత్యేకమైన షాక్ ట్రీట్‌మెంట్‌ను యివ్వబోతున్నట్లు డాక్టర్ జీవన్ చెప్పారతనితో.

ఏదైనా ఆపరేషన్ ముందు పేషెంట్స్‌కు ఆహారం యివ్వకపోవడం అన్నది సర్వసాధారణమైన విషయం. కాని మత్తుతో నిద్రింపజేసే ఆ కాప్స్యూల్స్‌ను తనకెందుకిచ్చారో అర్థంకాలేదతడికి. అదీ ఒక్క రోజులో అలాంటివి మూడు కాప్స్యూల్స

ఆహారంలేని నిస్త్రాణతలో తను ఆ కాప్స్యూల్స్‌ను వేసుకొని వుంటే ఆ మత్తుకు తను పూర్తిగా తెలివి తప్పి పడివుండేవాడు. తనకు తెలివి తప్పించడమే వారి ఉద్దేశమయితే హాయిగా యే పెథిడిన్ లాంటి మత్తు ఇంజక్షనో యివ్వచ్చుకదా.... ఈ కాప్స్యూల్స్ నే ఎందుకు వాడినట్లు?

అప్పుడు జీవంలేని కళ్ళతో ఉన్న మిగిలిన పేషెంట్ల ముఖలు అతడి కన్నులముందు మెదిలాయి. సో....! మనసును బలహీనపరిచి, మనిషిని ఒక విధమైన 'కోమా'లాంటి స్థితికి తీసుకు వెళ్ళగలిగే యేదో రసాయనం ఆ కాప్స్యూల్స్‌లో కలపబడి ఉండాలి.

అదే నిజమయితే పేషెంట్స్‌ను 'కోమా' స్థితిలోనికి తీసుకొని వెళ్ళి డాక్టర్ జీవన్ వారిని యేవిధంగా ట్రీట్ చేద్దామనుకుంటున్నాడు?

ఆ రహస్యం తేలాలంటే తను మత్తులో వున్నట్లు నటించక తప్పదు—అనుకున్నాడు గులాబ్ సింగ్. ఆ నిశ్చయానికి వచ్చాక అతడు కళ్ళు మూసుకొని, శరీర అవయవాలను రిలాక్స్‌గా వుంచి వెల్లకిలా పడుకున్నాడు.

రాత్రి పదిన్నర ప్రాంతంలో అతడి బెడ్ దగ్గరకు వచ్చారు ముగ్గురు వార్డు బోయ్స్. గులాబ్ సింగ్ శరీరాన్ని ఎత్తుకొని స్ట్రెచర్స్‌మీద మోసుకుంటూ వార్డు బయటకు నడిచారు.

ఆ నర్సింగ్ హోమ్ కాంపౌండ్‌లో ఆపబడి వుంది ఒక తెల్లని అంబులెన్స్ వాన్. గులాబ్ సింగ్‌ను ఆ వాన్‌లో చేర్చాక వాన్ తలుపులు వేసేశారు.

ఆ వాన్‌లో రాక్స్‌లా అమర్చబడి ఉన్న స్టాండ్స్ పైన పడుకో పెట్టబడి వున్నారు మరో ముగ్గురు పేషెంట్స్. గులాబ్ సింగ్ తో సహా ఆ నలుగురి శరీరాలు వాన్ కదు

పులకు సైతం కదలకుండా ఆ రాక్స్‌కు గట్టిగా బంధింప బడి వున్నాయి.

ఆ వార్డు బోయ్స్‌లో ఒక్కరు మాత్రం వాన్ ముందు సీటులో ఎక్కి కూర్చున్నాడు. మరుక్షణం ఆ వేన్ నర్సింగ్ హోమ్ గేటుగుండా బయటకు దూసుకుపోయింది.

'ఇదేదో తాను ఊహించిన దానికన్నా ప్రమాదకర మైన విషయంగా' తోచింది గులాబ్ సింగ్ కు.

కోటిలో తల దూర్చాక రోకలి పోటుకు భయపడే మన స్తత్వం కాదు అతడిది. కానున్నది కాకమానదని అతడు హాయిగా గుండెలమీద చేయి వేసుకొని నిద్ర పోయాడు.

బొంబాయినుండి పూనాకు వెళ్ళే మార్గంలో దక్షిణ దిక్కుగా వున్న రోడ్డుగుండా ప్రయాణించసాగింది ఆ వాన్. ఆ దిక్కులో వున్నది అలిబాగ్ అనే చిన్న టౌన్. అయితే ఆ వాన్ వెళుతున్నది ఆ పట్టణంవైపు కాదు. సముద్ర తీరంలో ఆ టౌన్‌కు నలభై మైళ్ళ దూరంలో వ్యాపించి వున్న చిట్టడివివైపు.

## 5

అలిబాగ్ ఎస్టేట్స్‌గా పిలవబడే అటవీ ప్రాంతమది. యేపుగా, ఎత్తుగా, వత్తుగా పెరిగిన వృక్షాల మధ్య కట్టబడి వుందొక అధునాతన భవనం. సముద్రపు ఒడ్డున వున్న ఆ భవంతి డాక్టర్ జీవన్‌ది.

రాత్రి పన్నెండు గంటల ప్రాంతంలో ఆ ఆంబులెన్స్ వాన్ ఆ భవంతి ముందు ఆగింది. తెల్లని యూనిఫారంలు ధరించిన ఎనిమిదిమంది వ్యక్తులు ఆ భవనంనుండి బయటకు వచ్చారు. స్ట్రెచర్స్‌మీద పడుకుని ఉన్న పేషెంట్స్‌ను మోసుకుంటూ ఆ భవనంలోనికి తీసుకొని వెళ్ళారు.

విశాలమైన హాలులో ప్రవేశించారు వారు. ఆ హాలులోనుండి బయటకు వెళ్ళడానికి ఒకే ఒక మార్గం వుంది. ఆ ద్వారానికి ఇరువైపులా రైఫిల్స్ పట్టుకొని ఉన్న ఇద్దరు గార్డ్సు కావలికాస్తున్నారు. ఆ పేషెంట్లకు సంబంధించిన డాక్యుమెంట్స్‌ను చూసి, సాటిస్‌ఫై అయ్యాక మాత్రమే వారిని హాలులోకి వదిలారు వారు.

హాలుకు ఒక మూలనున్న లిఫ్ట్ దగ్గరకు వెళ్లాయివారు. అది ఒక పెద్ద గది అంత వుంది. ఆ లిఫ్ట్‌లోకూడా స్ట్రెచర్స్ మీదనున్న పేషెంట్స్‌ను వుంచడానికి రాక్స్ వున్నాయి.

పేషెంట్స్‌ను స్ట్రెచర్స్‌తోసహా ఆ రాక్స్‌లో ఇన్‌సర్టు చేశాక ఆ లిఫ్ట్ బటన్ నొక్కాడొక వ్యక్తి. లిఫ్ట్ మెల్లగా పైకి కదలసాగింది.

ఆ ఏర్పాట్లన్నింటినీ ఓ.రకంటితో గమనిస్తున్నాడు గులాబ్‌సింగ్. ఇదేదో పెద్ద విషవలయంలా వుంది— అనుకున్నాడతడు.

లిఫ్ట్ మూడవ అంతస్తులో ఆగింది. పేషెంట్స్‌ను మోసుకుంటూ వెళ్ళి ఒక విశాలమైన వార్డులో పరుండబెట్టారా వ్యక్తులు. అప్పటికే ఆ వార్డులోని బెడ్‌లమీద కొందరు పేషెంట్స్ పడుకొని వున్నారు.

సరిగ్గా పది నిమిషాల తరువాత ఆ వార్డులోనికి ప్రవేశించాడు డాక్టర్ జీవన్. అతని వెనుకే చేతిలో ఒక రెడ్ ఫైలును పట్టుకుని వచ్చాడు మరో యువకుడు. అతడు సతీష్ అగర్వాల్. డాక్టరుకు పర్సనల్ అసిస్టెంట్ అతడు.

క్రొత్తగా అడ్మిట్ కాబడిన ఆ నలుగురు పేషెంట్స్‌నూ తన ఫైలులోని వివరాలతో సరిపోల్చి చూసుకున్నా

డతడు.

"రేపు ఉదయం ఆరుగంటల తిరువాత వీరికి తెలివి వస్తుంది అగర్వాల్. రేపు కూడా పూట కొక్క కాపూల్స్ చొప్పున వీరికి ఈ రోజు యిచ్చిన డోసే కంటిన్యూ చేయండి. రేపు రాత్రి వీళ్ళ ఆపరేషన్ టేకప్ చేద్దాం."

చకచకా ఆ వార్డులో నుండి బయటకు నడుస్తూ అన్నాడు డాక్టర్ జీవన్. సతీష్ అగర్వాల్ అతడిని అనుసరించాడు.

వారు వెళ్ళిన పదినిమిషాల వరకూ అలా మంచంమీద కదలకుండా పడుకుని నిద్ర నటించాడు గులాబ్‌సింగ్. తరువాత మెల్లగా కళ్ళు తెరిచాడు. మొద్దులా నిద్ర పోతున్న పేషెంట్స్ తప్ప ఆ వార్డులో మరెవరూ కని పించలేదతడికి. మెల్లగా మంచం దిగాడతడు.

చుట్టూ ఒకసారి చూసి, కారిడర్‌లోనికి నడిచా డతడు.

ఆ భవనంలో అది చివరి అంతస్థు. కారిడర్ చివర నున్న మెట్లగుండా క్రిందకు దిగాడు అతడు.

అది రెండవ అంతస్థు.

మూమ్మూరులా మూడవ అంతస్థులాగానే వుంది అది. కాకుంటే పేషెంట్స్ వుంచబడ్డ ఈ వార్డు కాస్త చిన్నది.

పేషెంట్స్‌కూడా యెక్కువమంది లేరు. వారి బెడ్స్ ప్రక్కన ఐరన్ స్టాండ్స్‌కు గ్లూకోజ్ బాటిల్స్ తగిలింప బడి వున్నాయి. పేషెంట్స్ శరీరాలకు తగిలింపబడివున్న రబ్బరు ట్యూబులగుండా బొట్లు బొట్లుగా ఆ గ్లూకోజ్ ద్రవం వారి శరీరాలలోనికి ప్రవహిస్తూంది.

ఆ వార్డుకు ఆనుకొని వుంది చిన్న రూమ్. మల్లెపూవు లాంటి తెల్లని దుస్తులు ధరించిన ఒక నర్స్ ఆ గదిలో కూర్చుని యేదో ఇంగ్లీషు నవల చదువుకుంటోంది. అడుగుల చప్పుడు కాకుండా ఆ వార్డును దాటి ముందుకు నడిచాడు.

వార్డును ఆనుకొని వుంది ఒక హాలులాంటి విశాలమైన పెద్ద గది. విచిత్రమేమిటంటే దానికి కిటికీలు గాని, వెంటిలేటర్స్ గాని లేవు. కారిడర్ చివరి భాగంలో మాత్రం ఆ గదికి ఒకే ఒక తలుపు వుంది.

ఆ తలుపు ప్రక్కనున్న స్టూల్ పై కూర్చుని కునికిపాట్లు పడుతున్నాడొక వార్డుబోయ్.

వార్డుల దగ్గర కనిపించని వార్డుబోయ్ ఆ గది ముందు ఎందుకున్నట్లు? అతడు ఆ గదికి కావలి కాస్తున్నాడా? కాపాలా వుంచాల్సిన విశేషం ఆ గదిలో యేముంది?

ఒక్కసారిగా ఎన్నో అనుమానాలు ఉద్భవించాయి గులాబ్ సింగ్ మనసులో.

అతడు పిల్లిలా అడుగులు వేస్తూ ఆ గార్డు వెనుకకు చేరుకున్నాడు. అరచేతిని కత్తిలా బిగించి బలంగా ఆ గార్డు మెడపై కొట్టాడు. జూడోలో ఎంతో ప్రావీణ్యం వున్నవారు వుపయోగించే టెక్నిక్ అది.

కంఠనాళాలపై కొట్టబడిన ఆ దెబ్బవలన మెదడుకు జరిగే రక్తప్రసరణం ఆగిపోవడంతో ఆ వార్డుబోయ్ స్పృహతప్పి పడిపోయాడు. అతడికి తెలివి వచ్చేసరికి మరో అయిదారు గంటలు పడుతుంది.

నెమ్మదిగా తలుపు త్రోశాడతడు. అర నిమిషం పాటు అక్కడే నిలుచుండిపోయాడు. ఒక్కొక్క సెకను భారంగా దొర్లుతున్నట్లనిపిస్తోంది అతడికి.

ఆ గదిలో యెవరైనా వుండినట్లయితే, తలుపు త్రోసి కూడా యెవరూ గదిలోకి రాకపోవడంతో వాకి అను మానం వచ్చితీరుతుంది. ఏం జరిగిందో చూడటానికి ఎవరో ఒకరు బయటకు వస్తారు.

ఆ ఆలోచనతోనే అతడు మరో నిముషం పాటు వెయిట్ చేశాడు. కాని అతని అంచనా తప్పయింది. ఆ గదిలో నుండి ఎవరూ బయటకు రాలేదు.

'అంటే ఆ గదిలో ఎవరూ లేరా?'

ఆశ్చర్యంతో అతని నొసలు ముడిపడింది. ఇంక తాత్సారం చేయలేక మొండిధైర్యంతో ఆ గదిలోనికి అడుగు పెట్టాడతడు.

అంతే!

ఆ గదిలోని దృశ్యం అతడిని నిశ్చేష్టుణ్ని చేసింది.

## 6

సరిగ్గా పన్నెండు గంటల క్రితం....

న్యూఢిల్లీ ...కన్నాట్ ప్లేస్‌లో....

అంతర్జాతీయ వాణిజ్య ప్రదర్శన ప్రారంభోత్సవ సందర్భంగా ఆ ప్రాంతమంతా యెంతో హడావుడిగా వుంది. భారతదేశంతో తమ వాణిజ్య సంబంధాలను పెంపొందించుకోవాలని తహ తహ లాడుతున్న యెన్నో మిత్ర దేశాలు తమ వాణిజ్య బృందాలను ఆ ప్రదర్శనలో పాల్గొనడం కోసం పంపాయి.

ఎంతో ప్రతిష్ఠాకరమైన ఆ ప్రదర్శనను భారత రాష్ట్రపతి ప్రారంభిస్తున్నారు. నిలువెత్తు పూలదండలు, పెద్ద పెద్ద బొకేలను పట్టుకొని నిర్వాహకులు రాష్ట్రపతి రాక కోసం ఎదురుచూస్తున్నారు.

అంగరక్షకుల వాహనాలు చుట్టూ కవర్ చేస్తుంటే

పెద్ద పడవలాంటి కారులో రాష్ట్రపతి హుందాగా దిగారు. రాష్ట్రపతి రిబ్బన్ కత్తిరించారు. చప్పట్లు, హర్ష ధ్వానాలతో ఆ ప్రదేశమంతా మార్మోగిపోయింది.

రాష్ట్రపతిని వేదికమీదకు ఆహ్వానించాడు ఆ ఉత్సవ కన్వీనర్. రాష్ట్రపతి వెనుక అతడి అంగరక్షకు లిద్దరూ నిలబడి వున్నారు. వేదికకు ఒక మూల ఢిల్లీ అడిషనల్ డి.ఎస్.పి. నిలబడి వున్నాడు. ఆ ఉత్సవ నిర్వాహణలో భద్రతా యేర్పాట్లను పర్యవేక్షిస్తున్నాడతడు.

మామూలు ఫార్మాలిటీస్ తరువాత, రాష్ట్రపతి ఉపన్యసించడానికి లేచారు. ఒక్కసారిగా కొన్ని వందల కెమేరాలు క్లిక్కు మన్నాయి. ఆహుతులు నిశ్శబ్దంగా రాష్ట్రపతి యేం చెబుతారా అని చూస్తున్నారు.

రాష్ట్రపతి అంగరక్షకులు మాత్రం నలుదిక్కులా చాలా జాగ్రత్తగా చూస్తున్నారు వారి కుడి చేతులు వారి నడుములకున్న రివాల్వర్స్ పైనే వున్నాయి.

అంతవరకూ ప్రశాంతంగావున్న అడిషనల్ డి.ఎస్.పి. ముఖం వికృతంగా మారసాగింది. అతడి కళ్ళు నిస్తేజంగా వున్నాయి. అతని అవయవాలు యాంత్రికంగా కదలసాగాయి.

నడుముకున్న హోల్ స్టర్ లో నుండి రివాల్వర్ పైకి తీశాడతడు. మూడడుగులు ముందుకు వేశాడు. ఇప్పుడు సరిగ్గా రాష్ట్రపతికి ఎదురుగా వున్నాడతడు. సూటిగా రివాల్వర్ ను రాష్ట్రపతి గుండెలకు గురిపెట్టాడతడు.

సరిగ్గా అదే క్షణంలో గమనించాడు రాష్ట్రపతి అంగరక్షకుల్లో ఒకడు.

అంతే! మెరుపుకన్నా వేగంతో రియాక్ట్ అయ్యాడతడు. క్షణంలో వెయ్యోవంతులో అతడి చేతిలో రివా

ల్వర్ ప్రత్యక్షమయింది. అది రిలీజ్ చేసిన గుండు డి.ఎస్.పి. చేతిలో నుండి దూసుకుపోయింది. అతడి చేతి లోని రివాల్వర్ క్రింద పడిపోయింది.

మరుక్షణం రాష్ట్రపతి స్పెషల్ ఫోర్స్ అతడిని బంధిం చారు. అంగరక్షకులు రక్షణకవచంలా చుట్టుముట్టి రాష్ట్ర పతిని వేదిక నుండి బయటకు తీసుకువెళ్ళిపోయారు.

అపసవ్యంగా అంతమయిన ఆ ప్రారంభోత్సవాన్ని గురించి ఆలోచించటం లేదెవరూ. భద్రతా యేర్పాట్లు చూస్తున్న ఒక పోలీసు ఉన్నతాధికారే రాష్ట్రపతిని హత్య చేయడానికి ప్రయత్నించాడంటే వారికి నమ్మ బుద్ధి వేయటం లేదు. కాని వారు ఆ సంఘటనను తమ కళ్ళారా చూశారు.

సామాన్య ప్రజలలోనే యింత కలవరాన్ని సృష్టిం చిన యీ సంఘటన మొత్తం ప్రభుత్వ యంత్రాంగాన్నే కుదిపేసింది.

సి.ఐ.బి. డైరెక్టర్ కరుణాకర్ హుటా హుటిన అక్కడికి పరిగెత్తుకొచ్చాడు.

ఈ హత్యాప్రయత్నం వెనుకనున్న కుట్రకు మూల కారకులెవరో కనుగొనడానికి ఇండియన్ సైఫరింగ్ అంతా రంగంలోకి దింపబడింది. కేవలం ఎనిమిది గంట లలో వివిధ ఏజెంట్లు తమ పరిశోధనా వివరాలను సి.ఓ. ఐ. డైరెక్టర్‌కు సబ్‌మిట్ చేశారు.

ఆ రిపోర్ట్స్ సారాంశమంతా పూర్తిగా చదివేసరికి తన ఒంటిమీద చీమలూ, జెర్రులూ ప్రాకుతున్నట్లని పించింది కరుణాకర్‌కు.

ఏదో తెలియని భయంతో అతని నుదుట చెమట పట్టింది.

# 7

పెద్ద పెద్ద పరిశ్రమలలో, ముడిసరుకులను ఒక ప్రదేశం నుండి మరో ప్రదేశానికి చేర వేయడానికి వినియోగించే కన్వేయర్ బెల్టులాగుంది ఆ గదిలోని వెడల్పాటి బెల్టు.

అయితే, ముట్టుకుంటే మాసిపోతుందా అన్నంత తెల్లగా, పరిశుభ్రంగా వుంది ఆ బెల్టు. చిన్న శబ్దం కూడా రాకుండా మెల్లగా కదులుతోంది అది.

దానిమీద శవాల్లా పడుకొని వున్నారు కొద్దిమంది వ్యక్తులు. వారి శరీరాలపై నూలుపోగైనా లేదు. విద్యుద్దీపకాంతిలో వారి నగ్న దేహాలు నిగనిగా మెరుస్తున్నాయి.

ఆ కన్వేయర్ బెల్టు నెమ్మదిగా కదులుతోంది. ఆ బెల్టు అంచుని ఆనుకుని ఉన్నట్లుగా ఎన్నో విచిత్రమైన యంత్రాలు బిగింపబడి వున్నాయి.

మొదటి యంత్రాన్ని సమీపించిన వెంటనే వరుసగా పడుకున్న వారిలోని మొదటి వ్యక్తి లేచి కూర్చున్నాడు.

అతని వీపుకు, తలకు స్టీల్ క్లాంప్స్ ఎటాచ్ చేయబడి ఉన్నాయి. కోమా స్థితిలో నున్న అతని శరీరం ఆ క్లాంప్స్ పుష్ చేయడంతో ఆటోమేటిక్‌గా లేచి కూర్చుంది. తల, మెడ, వెన్నుపామును చుట్టి వున్న ఆ స్టీల్ క్లాంప్స్ అతడి శరీరాన్ని కదలకుండా ఉంచుతున్నాయి. కన్వేయర్ బెల్టు కూడా కదలడం ఆగిపోయింది.

సరిగ్గా ఆ వ్యక్తి తలమీద నున్న యంత్రంలో నుండి బ్లేడు లాంటి పరికరం ఒకటి పైకి వచ్చింది. అతడి తల

వెనుక భాగంలో చతురస్రాకారంలో నాలుగంగుళాల మేర నున్నగా షేవ్ చేసింది అది. బ్రష్ లాంటి మరో పరికరం షేవ్ చేయబడిన ఆ తల వెంట్రుకలను అతని తల నుండి తొలగించింది.

కన్వేయర్ బెల్టు మెల్లగా కదలడం ప్రారంభించింది. ఆ వ్యక్తి యింకా అలా కూర్చునే ఉన్నాడు.

అతడు రెండవ యంత్రాన్ని సమీపించేసరికి ఆ బెల్టు మళ్ళీ ఆగింది. ఆ యంత్రం నుండి యేదో ద్రవం పిచికారీ కొట్టినట్టు చిమ్ముతూ, అతని తలలో షేవ్ చేయబడ్డ భాగాన్ని శుభ్రం చేసింది. అదే సమయంలో ఆ వరుస లోని రెండవ వ్యక్తి తలవెంట్రుకలను మొదటి యంత్రం నున్నగా షేవ్ చేస్తోంది.

ఆ గదిలోని ఆధునిక ఎలక్ట్రానిక్ యంత్రాలను ఆటోమేటిక్ గా అవి నిర్వర్తిస్తున్న పనులను చూసేసరికి గులాబ్ సింగుకు మతిపోయింది. అతడు కళ్ళప్పగించి వింతగా చూడసాగాడు.

బెల్టుమీది మొదటి వ్యక్తి. మూడవ యంత్రాన్ని సమీపించాడు. ఆ యంత్రానికున్న గొట్టంలో నుండి ఊదారంగులో నున్న యేదో పొగ బుస బుస మంటూ వస్తోంది.

రెండవ యంత్రంలోనుండి వస్తున్న ద్రవం, హైడ్రోజన్ పెరాక్సైడ్ అయివుంటుందని ఊహించాడు గులాబ్ సింగ్. కాని ఆ పొగ యేమిటో అర్ధంకాలేదతడికి.

హైడ్రోజన్ పెరాక్సైడ్ వలన అతని తలమీద యేర్పడ్డ తడిని కొన్ని సెకన్లలో ఆ పొగ ఆర్పేసింది.

మూడవ యంత్రాన్ని దాటిన వెంటనే, అతన్నంత

వరకూ పట్టివుంచిన స్టీల్ క్లాంప్స్ రిలాక్స్ అయ్యాయి. ఎవరో పట్టుకొని పడుకోబెట్టినట్లు అతడు ఆ బెల్టుపై వెనక్కి వాలిపోయాడు.

ఆ యంత్రం తరువాత ఒక గ్లాస్ చాంబర్ వుంది. దానికున్న ఒక గాజుపలక మెల్లగా ప్రక్కకు తప్పుకుంది. బెల్టు ముందు జరగటంతో ఆ వ్యక్తి గ్లాస్ చాంబర్ లోనికి ప్రవేశించాడు. వెంటనే ఆ గాజుపలక మూసుకుంది.

ఒక్కనిమిషంపాటు యేం చేయాలో తోచక అలాగే వుండిపోయాడు గులాబ్ సింగ్.

గ్లాస్ చాంబర్ లో యేం జరుగుతుందో తెలుసుకోవాలంటే తను ఆ చాంబర్ దగ్గరకు వెళ్ళాలి. ఇంతవరకూ తలుపుదగ్గరే నిలబడ్డాడు కాబట్టి, ఆ చాంబర్ లోనివారికి తను కనిపించలేదు. కాని తను దానిదగ్గరకు వెళ్ళిన మరుక్షణం ఆ చాంబర్ లోని వారికి తను స్పష్టంగా అగుపిస్తాడు.

'ఏం .... చేయాలి ....?'

ఆలోచించడానికి కూడా అతడికి యెక్కువ వ్యవధి లేదు. 'బయట స్పృహతప్పి వున్న వార్డ్ బోయ్ ని ఎవరైనా గమనించక ముందే ఈ రహస్యమేమిటో తెల్సుకుని తను బయటపడాలి' అసహనంగా పెదవులు కొరుక్కున్నాడతడు.

తను అంతవరకూ ఎక్కడ తప్పుగా ఆలోచిస్తున్నాడో సరిగ్గా అప్పుడు తట్టింది అతడికి.

'అది గ్లాస్ చాంబర్ కాబట్టి. తను యిక్కడ నిలబడ్డా, అందులో యేముందో తనకు కనిపించాలి. కాని, ఊదారంగు పొగను రిలీజ్ చేస్తున్న యంత్రం, ఆ పొగ

తనకు అడ్డుగా ఉండటంచేత ఆ గ్లాస్ చాంబర్‌లో యేముందో తనకు కనిపించటంలేదు.

అయితే అందులోని వ్యక్తులకు కూడా తను కనిపించ కుండా ఆ యంత్రం, పొగ తనను కవర్ చేస్తున్నా యన్నమాట.

ఆ ఆలోచన స్ఫురించిన తరువాత అతడు మరి ఆలస్యం చేయలేదు. ఆ యంత్రం దగ్గరకు నడిచి, దాని వెనుక దాక్కున్నాడు. ఇప్పుడతనికి ఆ గ్లాస్ చాంబర్ లోపలి భాగం స్పష్టంగా కనిపిస్తోంది.

నిజానికది గ్లాస్ చాంబర్ కాదు. ఆపరేషన్ థియేటర్. ఆపరేషన్ టేబిల్ దగ్గర డాక్టర్ జీవన్, అతడి అసిస్టెంట్ సతీష్ అగర్వాల్ నిలబడి వున్నారు.

రోగియొక్క తలమీద షేవ్ చేయబడ్డ భాగంలో యేదో ఆపరేషన్ చేస్తున్నాడు డాక్టర్ జీవన్. అతనికి కావలసిన పరికరాల నందిస్తూ సహాయపడుతున్నాడు అగర్వాల్.

వారు చేస్తున్న ఆపరేషన్ యేమిటో అర్థమయ్యేసరికి భయంతో అతడి వెన్నెముక జలదరించింది. అప్రయత్నంగా అతడి పెదవులు వీడి వచ్చిందొక మాట...

"సైకో.... సర్జరీ....."

# 8

ఢిల్లీ అడిషనల్ డి.ఎస్.పి. శ్రీవాత్సవ యొక్క వివరాలున్న రిపోర్ట్స్‌ను మరోమారు చదివాడు కరుణాకర్, ది గ్రేట్ ఇండియన్ సి.బి.ఐ. డైరెక్టర్.

పెన్ తీసుకొని ఆ రిపోర్ట్సులోని విషయాలను పాయింట్స్‌లా వ్రాయసాగాడు.

1. డి.ఎస్.పి. శ్రీవాత్సవ నిజాయితీ గల ఆఫీసరు.

2. డబ్బు కోసం దేశానికి ద్రోహం తలపెట్టే మనిషి కాడు.

3. హత్యాప్రయత్నం విఫలమయ్యాక, తనను చుట్టుముట్టిన రాష్ట్రపతి స్పెషల్ ఫోర్స్ మధ్య నుండి తప్పించుకోడానికి పెనుగులాడుతూ స్పృహతప్పి పోయాడు.

4. స్పృహవచ్చాక .... ఏమీ యెరుగనివాడిలా 'తనేమిటి రాష్ట్రపతిని హత్య చేయబోవడమేమిటి?' అంటూ అమాయకంగా ప్రశ్నిస్తున్నాడు.

5. ఎన్ని రకాలుగా ప్రశ్నించినా అతను చెబుతున్న సమాధానం ఒక్కటే 'నా కేమీ తెలియదు.'

6. పోలీస్ ఇంటారాగేషన్ రూమ్‌లో రెండవసారి స్పృహతప్పి పడిపోయాడతడు.

7. ముఖం ఎర్రగా, వికృతంగా మారడం, కళ్ళు జీవం లేనట్లు గాజుగోళీల్లా అవటం, పిచ్చిచూపులు తప్పించుకోవడానికి పెనుగులాడటం స్పృహ తప్పిపోయే ముందు అతడిలో కనిపించిన లక్షణాలు యివి.

8. మిలటరీ హాస్పిటల్‌లో ఎడ్మిట్ చేయబడ్డాడతడు. అతని తలకు తీయబడ్డ ఎక్స్‌రే రిజల్ట్సు చూసేసరికి అతడి ప్రవర్తనలోని రహస్యం తెలిసిపోయింది.

9. అతడికి బ్రైన్ సర్జరీ చేయబడింది.

10. అతని తలకు ఆపరేట్ చేసి, ఎవరో అతడి మెదడులో కంట్రోలింగ్ ఎలక్ట్రోడ్స్ ఇన్‌సర్ట్ చేశారు.

11. మెంటల్ కంట్రోల్ డివైస్‌ను ఏక్టివేట్

చేయటం ద్వారా అతని మెదడులోని ఎలక్ట్రోడ్స్ ఉత్తేజితమై వారు చెప్పినట్లుగా మరబొమ్మలాగా చేస్తున్నాడతడు.

12. కంప్యూటర్ల సాయంతో రాబట్స్‌ను కంట్రోలు చేస్తూ తనకు కావాల్సిన పనులు చేయించుకుంటున్న మనిషి మేధాశక్తికి ఇది మరో మెట్టు. ఎక్కడో కంప్యూటర్ ముందు కూర్చుని ఈ ఎలక్ట్రోడ్స్ మెదడులో అమర్చబడ్డ వ్యక్తికి, ఇన్‌స్ట్రక్షన్స్ పాస్ చేస్తే చాలు తూ.చా. తప్పకుండా అమలు జరుపుతాడతడు.

13. అయితే ఈ ఎలక్ట్రోడ్స్ అతని మెదడులో ఎవరు, ఎప్పుడు ఇన్‌సర్టు చేసినట్లు?

14. రెండు వారాల క్రితం తన బంధువుల పెళ్ళికి బొంబాయి వెళ్ళాడతడు. బాత్‌రూమ్‌లో కాలు జారి పడటంతో నడుం దగ్గర దెబ్బ తగిలింది. ట్రీట్‌మెంట్ కోసం గ్రీన్ ఫ్లవర్ నర్సింగ్ హోమ్‌లో పదిరోజులపాటు ఉన్నాడతడు.

15. శ్రావణ్ కుమార్ కూడా గ్రీన్ ఫ్లవర్ నర్సింగ్ హోమ్‌లో ట్రీట్‌మెంట్ చేయించుకున్నాకే.... ఆ హత్య చేశాడు అంటే ..అతడి మెదడులో కూడా ఎలక్ట్రోడ్స్ ఇన్‌సర్టు చేయబడ్డాయా?

16. అదే నిజమైతే....మనుషులను మరబొమ్మలుగా మార్చి, మారణహోమం సృష్టించాలనుకున్న ఆ రాక్షసుల స్థావరం 'గ్రీన్ ఫ్లవర్ నర్సింగ్ హోమ్' అయి ఉంటుంది.

అంతవరకూ వ్రాసిన వివరాల వంక చూస్తూ తృప్తిగా తలాడించాడు కరుణాకర్.

కొన్ని గంటల తరువాత ఢిల్లీ పాలం విమానాశ్రయం నుండి బయలుదేరిందొక చార్టర్డ్ ప్లేన్. కరుణాకర్‌తో పాటు ఇద్దరు సీనియర్ సి.బి.ఐ. ఆఫీసర్లు ఉన్నారు అందులో.

తన అనుమానాన్ని ధృవపరచుకోవడానికి గ్రీన్ ఫ్లవర్ నర్సింగ్ మీదకు రైడింగ్ చేయడానికి వెళ్తున్నారా సి బి ఐ. ఆఫీసర్లు.

# 9

ఆ దృశ్యం చూశాక ఒక్క క్షణం కూడా అక్కడ నిలుచుని ఉండలేకపోయాడు గులాబ్ సింగ్.

ఆ భవనంలో తానుండటం ఎంత ప్రమాదకరమో అర్థం అయ్యేసరికి అతని నుదుట చెమటలు పట్టాయి. వెనువెంటనే ఆ గది బయటకు నడిచాడతడు. పిల్లిలా అడుగులు వేస్తూ వార్డును దాటే సమయంలో అప్రయత్నంగా వార్డులోనికి చూశాడు.

అప్పుడే తెలివి వచ్చినట్లు ఒక పేషెంట్ మెల్లగా కదులుతున్నాడు. ఆ పేషెంట్ ముఖం చూడగానే బ్రేకులు వేసినట్లు ఆగిపోయాయి అతడి కాళ్ళు.

ఆ పేషెంట్ యెవరో కాదు. అతడు....శ్రావణ్ కుమార్. చటుక్కున ఆ వార్డులోనికి ప్రవేశించాడతడు. శ్రావణ్ కుమార్ పడుకునివున్న బెడ్‌ను సమీపించాడు. అతని శరీరంలోనికి గ్లూకోజ్ ద్రవాన్ని పంపుతున్న సన్నని రబ్బరుగొట్టాన్ని నెమ్మదిగా తొలగించాడు.

ఆ రబ్బరుగొట్టంగుండా చుక్కలుగా నేలకు రాలుతున్న ద్రవాన్ని చూసేసరికి అతని మనసులో యేదో అనుమానం ప్రవేశించింది.

ఆ ద్రవాన్ని కాస్త వేలితో తీసుకొని వాసన

చూశాడు అప్పుడర్థమయింది అతడికి ఆ ద్రవమేమిటో. మనిషిని మత్తులో పడేసే హెవీ డ్రగ్ ద్రవం అది. చాలా తక్కువ డోసేజ్‌లో డైల్యూట్ చేయబడిందది.

శ్రావణ్‌కుమార్ మరి కాస్త తెలివిలోకి వచ్చాడు. అతడిని లేపి కూర్చోబెట్టాడు గులాబ్‌సింగ్.

"మిష్టర్ శ్రావణ్‌కుమార్! మనం తప్పించుకోడానికి ఇదే మంచి సమయం. కమాన్ లెట్స్ గో అవుటాఫ్ ది హెల్ హియర్."

గులాబ్‌సింగ్ వంక బ్లాంక్‌గా చూశాడతడు. శ్రావణ్‌కుమార్ చేతిని పట్టుకుని రమ్మన్నట్లు లాగాడు. అతడు మెల్లగా లేచాడు. నిస్సత్తువుగా ముందుకు తూలిపోబోతున్న అతడిని పట్టుకొని నెమ్మదిగా ఆ వార్డులో నుండి బయటకు తీసుకొని వెళ్ళాడు.

వారి అదృష్టం—ఆ సమయంలో నర్స్ బాత్‌రూంలోనికి వెళ్ళింది. సరిగ్గా వారు ఆ కారిడర్ చివరకు చేరుకొనే సమయానికి ఆమె బాత్‌రూంలో నుండి బయటకు వచ్చింది. ఫ్లాస్కులో వున్న కాఫీని కప్పులో పోసుకొని త్రాగిందామె.

ఖాళీకప్పును టేబిల్ మీద వుంచి వార్డులో రౌండ్సుకు బయలుదేరిందామె.

• • •

కారిడర్ చివరకు చేరాక—ఒక్క క్షణం పాటు యేం చేయాలని ఆలోచించాడు గులాబ్‌సింగ్.

'మెట్లగుండా క్రింది అంతస్తుకు చేరినా, గార్డ్సు కళ్ళుకప్పి మెయిన్ హాలు నుండి బయటకు వెళ్ళటం

అసాధ్యం. మరి....ఎలా తప్పించుకోవడం....?'

కిటికీవైపు సాభిప్రాయంగా చూశాడు. జేబులోనుండి ఒక ట్యూబ్ లాంటిది తీశాడు. దాన్ని నొక్కేసరికి పేస్టు లాంటి ముద్ద పైకి వచ్చింది. అది శరీరంమీద పడకుండా ఆ ట్యూబ్‌తోనే....ఆ యినుప ఊచలకు వ్రాశాడు.

బుస బుస మంటూ తెల్లని నురుగు వచ్చింది. ఒక నిమిషం తరువాత ఆ ఇనుప ఊచలను చేతితో లాగేసరికి అవి రెండు ముక్కల్లా ఊడి వచ్చేశాయి.

ఎంతో కఠినమైన లోహాలను సైతం క్షణంలో కరిగించగల కెమికల్ అది ఇండియన్ ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ రీసెర్చ్ అండ్ అనాలిసిస్ వారిచే క్రొత్తగా కనిపెట్టబడింది.

శ్రావణ్ కుమార్‌ను ముందు పైకి ఎక్కించాక, తను కూడా కిటికీమీదకు చేరుకున్నాడు గులాబ్ సింగ్. కిటికీని ఆనుకుని వున్న నీటి పంపును చూడగానే అతడి కళ్ళు ఆనందంతో మెరిశాయి.

కాని మరుక్షణం అతనికి మరో అనుమానం వచ్చింది. శ్రావణ్ కుమార్ ఇంకా యేదో మగతలోనే వున్నాడు. నీటిపంపు పట్టుకొని క్రిందకు దిగగలడా అతడు? యేం చేయాలి?

ఒక నిర్ణయానికి వచ్చినట్లు చిన్నగా తల పంకించాడు అతడు. కిటికీ కర్టెన్‌ను ఊడదీసి శ్రావణకుమార్‌ను తన వీపుకు గట్టిగా కట్టుకున్నాడు. నీటి పంపును పట్టుకుని మెల్లగా క్రిందకు జారసాగాడతడు.

• • •

ఒక్కొక్క బెడ్‌మీదున్న పేషెంట్ ముఖంపై శ్ర

వంతమైన టార్చ్‌లైట్‌ను ఫోకస్ చేస్తూ....ఒక్కొక్క పేషెంట్‌నూ చెక్ చేసుకుంటూ వెళ్తోంది నర్స్.

శ్రావణ్ కుమార్ పడుకునివుండే బెడ్‌ను సమీపించిందామె టార్చిలైట్ వెలుగులో ఖాళీ బెడ్‌ను చూసేసరికి నిర్ఘాంతపోయిందామె. కంగారుగా ఆ వార్డు నలుమూలలూ వెదికిందామె. ఒక పేషెంట్ తప్పించుకున్నాడని నిర్ధారణ చేసుకోవడానికి ఆమెకు కొన్ని నిముషాలు పట్టింది.

ఆత్రంగా క్రిందకు పరిగెత్తిందామె. ఒక పేషెంట్ తప్పించుకున్నాడన్న విషయాన్ని ఆ హాలులో నున్న గార్డ్స్‌కు తెలియజేసింది. ఆ కంగారులో ఊచలు పీకేయబడ్డ కిటికీని గమనించలేదు ఆమె.

ఆమె మాటలకు ఆశ్చర్యపోయారు గార్డ్స్. ఒక పేషెంట్. అదీ మత్తులో వున్నవాడు, తప్పించుకోవడమంటే....నో....ఇంపాజిబుల్. కాని, ఆమె ఖచ్చితంగా చెబుతూండటంతో మెయిన్ హాలుకున్న డోరును లాక్ చేసి, లిఫ్ట్‌ను కూడా లాక్ చేసి, ఆ భవనాన్ని సెర్చ్ చేయడానికి బయలుదేరారు కొంతమంది గార్డ్స్.

ఇద్దరు గార్డ్స్ మాత్రం రైఫిల్స్ పట్టుకుని ఆ హాలులోనే కాపలా ఉన్నారు.

* * *

నీటిపంపును పట్టుకొని మెల్లగా దిగాడు గులాబ్ సింగ్. నేలమీదకు కాలు మోపగానే, తన వీపుకు కట్టిన కర్టెన్‌ను విప్పేశాడు.

తన బరువుతో పాటు శ్రావణ్ కుమార్ బరువునుకూడా మోస్తూ నీటి పంపుగుండా దిగటంతో అతడి చేతులు బాధతో లాగుతున్నాయి. అరచేతులు ఎర్రగా కంది

పోయి మంటలు పెడుతున్నాయి. కాని, ఇది శారీరక బాధల గూర్చి ఆలోచించే సమయం కాదని అతడికి తెలుసు.

శ్రావణ్ కుమార్ చేయి పట్టుకొని మొక్కల చాటుకు పరుగెత్తాడతడు. అక్కడే ఒక్క నిమిషం పొంచి కూర్చుని చుట్టూ పరికించి చూశాడు.

'మెయిన్ గేటు దగ్గర ఇద్దరు గార్డ్సు అటూ ఇటూ గస్తీ తిరుగుతున్నారు. అలాగే భవనం వెనకవైపు గార్డ్సు క్వార్టర్స్ ఉన్నాయి కాబట్టి అటూ వీలవదు. మరి ఎలా తప్పించుకోవడం?'

భవనం చుట్టూ ఆరడుగుల ఎత్తులో నిర్మింపబడి వుంది బలమైన వైరన్ ఫెన్సింగ్. ఆ ఇనుపకంచె లోపల భవనానికి ఉత్తరదిక్కులో వున్న పెద్ద నూయినీ, దానికి అనుకుని వున్న వాటర్ ఇంజన్ కోసం నిర్మింపబడ్డ షెడ్ను చూసేసరికి అతడి కళ్ళు విచిత్రంగా మెరిశాయి.

మెల్లగా ప్రాకుతుంటూ ఆ షెడ్ వెనకకు చేరుకున్నారు వారు. ఇప్పుడు వారు గార్డ్సుకు కనిపించటం లేదు. ఇప్పుడు ఇనుప కంచె సరిగ్గా వారికి ఆరు అడుగుల దూరంలో ఉంది.

తన దగ్గరున్న మెటల్ మెల్టింగ్ లోషన్ వున్న ట్యూబును జేబులో నుండి తీశాడు గులాబ్ సింగ్. ముళ్ళతో కూడిన ఇనుప తీగెలకు దానిని అప్లయిచేసి, ఒక మనిషి దూరగలిగే టంతటి కంతను తయారుచేశాడు.

ముందుగా శ్రావణ్ కుమారును ఆ కంతగుండా బయటకు త్రోసి, తరువాత తాను కూడా ప్రాకుతూ ఆ ముళ్ళ కంచెగుండా బయటపడ్డాడతడు.

ఆ కంచె దాటిన తరువాతి ముందున్నదంతా చిట్టడివే. దారీ, తెన్నూ లేని ఆ అరణ్యంలో శ్రావణ్ కుమార్ చేయి పట్టుకొని పరుగెత్తసాగాడు గులాబ్ సింగ్.

కాని, శ్రావణ్ కుమార్ వేగంగా పరుగెత్తలేకపోతున్నాడు. మొదటిది: అతడింకా పూర్తిగా తెలివిలోనికి రాలేదు. రెండవది: నీరసం, నిస్సత్తువ అతడిని క్రుంగదీస్తున్నాయి.

గ్రుడ్డిలో మెల్లలా సంతోషించదగ్గ విషయం యేమిటంటే, గులాబ్ సింగ్ ను గుర్తించలేకపోయినా, అతడిని ప్రతిఘటించకుండా, బుద్ధిగా అతనిని అనుసరించి వస్తున్నాడు శ్రావణ్ కుమార్.

సుమారు రెండు ఫర్లాంగుల దూరం పరుగెత్తారు వారు. అంతవరకూ సన్నని దుబ్బులూ, పొదలూ, ముళ్లకంపలూ తప్ప దట్టమైన అడవి లేదు. అక్కడి నుండే ఎత్తయిన వృక్షాలతో కూడిన అడవి ప్రారంభమయింది.

ఆ తోపులో అడుగుపెట్టిన కొన్ని నిమిషాలలో నే మత్తయిన వాసన వారి కర్ణపుటాలను సోకింది. నేలంతా మంచు ముత్యాలు పరచినట్లు తెల్లని ఇప్పపూలతో నిండి వుంది. అది ఇప్ప పూలవనం.

ఆ తీయని, మత్తయిన వాసనకు వారి శరీరంలోని బడలిక మంత్రం వేసినట్లు మాయమయింది. హాయిగా వొళ్ళు విరుచుకున్నాడు గులాబ్ సింగ్. అయితే అతని ఆనందం యెన్నో క్షణాలు నిలువలేదు.

ఒక ఇప్పచెట్టు కొమ్మలమీద నుండి మెల్లగా క్రిందికి దిగుతున్న నల్లని ఆకారాన్ని చూసేసరికి భయంతో అతడి గొంతులో తడి ఆరిపోయింది.

అది ఎలుగుబంటి.

ఇప్పపూల కాలంలో.... ఇప్ప పూలలోని తేనెను సంగ్రహించి ఆ ఇప్పచెట్లమీదే తేనెపట్లను పెడతాయి తేనెటీగలు. ఆ తేనెతుట్టెల కోసం, ముట్టెలను ఎగవేసు కుంటూ ఆ ఇప్పపూల వనంలో సంచరిస్తుంటాయి ఎలుగు గొడ్లు.

మరో జీవి.... ఆ మధుపంలో వాటాకు, పోటీకి రావ డాన్ని సహించవవి. ఆ మధువనంలో పెద్దపులినైనా ధైర్యంగా యెదుర్కొంటాయి ఆ ఎలుగుగొడ్లు.

ఆ ఎలుగుబంటి కళ్ళబడకముందే అక్కడ నుండి తప్పించుకోవడం క్షేమమని తెలుసు అతడికి. శ్రావణ్ కుమార్ చేతిని పట్టుకొని ఒక చెట్టుచాటుకు పరుగెత్తా డతడు.

కాని, అప్పటికే ఆ ఎలుగుబంటి వారిని చూసేసింది. క్రమంగా అరుస్తూ పీ:పై పై అరుస్తూ రాసాగింది ఆ భల్లూకం.

# 10

ఆ భవనం నుండి తప్పించుకుని పారిపోయినది ఒక్క శ్రావణ్ కుమార్ మాత్రమే కాదు. గులాబ్ సింగ్ కూడా నని, ఆ గార్డ్సుకు తెలిసేసరికి సుమారు రెండు గంటలు పట్టింది.

ఊచలు కోయబడ్డ కిటికీ, ముళ్లకంచెలో ఏర్పడ్డ కంత.... ఆ పేషంట్సు ఎలా తప్పించుకు పారిపోయారో స్పష్టంగా తెలియజేస్తున్నాయి.

వెంటనే ఆ విషయం డాక్టర్ జీవన్‌కు తెలియజేయ బడింది.

అంత కట్టుదిట్టమైన కాపలా వుండి కూడా ...మత్తు మందు యివ్వబడ్డ యిద్దరు పేషంట్సు, గార్డ్సు కళ్ళుకప్పి,

రెండవ అంతస్థులోని కిటికీ ఊచలను తోసి, మరీ తప్పించుకున్నారంటే... ఎలక్ ఫెన్సింగ్ కూడా వారిని ఆపలేక పోయిందంటే.... అతడికి నమ్మ బుద్ధి కాలేదు.

శ్రావణ్ కుమార్ మెదడులో కంట్రోలింగ్ ఎలక్ట్రోడ్స్ ఇన్ సర్ట్ చేయబడ్డాయి గాబట్టి, అతడు స్వంతంగా పారిపోడానికి ప్రయత్నించి వుండడు.

బహుశా గులాబ్ సింగే శ్రావణ్ కుమార్ ను తప్పించి తీసుకొని పారిపోతూ వుండాలి.

అయితే .... గులాబ్ సింగ్ మామూలు పేషంటు కాదేమో! కాకుంటే ఎవరు?

తీక్షణంగా ఆలోచించసాగాడు డాక్టర్. ఎదురుగా నున్న గార్డువంక చూశాడు.

“వారు అడవిగుండా ప్రయాణిస్తూ ...పారిపోతుంటారు. మీరు వారిని వెన్నాడి బంధించండి మీతో పాటు హైపో డెర్మిక్ సిరింజ్ లను తీసుకొని వెళ్ళండి. వారికి ఒక్క ఇంజెక్షన్ చేయ గలిగితే చాలు. వారు తెలివితప్పి పడిపోతారు. ఆ తరువాత వారిని బంధించి యిక్కడకు తీసుకురావడం చాలా తేలిక.

మీరు ఒకగంటలో నాకు యే విషయమూ రిపోర్టు చేయండి గో... అండ్ ప్రొసీడ్.”

కొన్ని నిమిషాల తరువాత ఒక జీపు, నాలుగు మోటారుసైకిళ్ళు ఆ అడవి వైపు దూసుకుంటూ పోసాగాయి. వాటివంక చూసి సంతృప్తిగా తలాడించాడు డాక్టర్.

“మిష్టర్ అగర్వాల్. సరిగ్గా ఒక్కగంట సేపు వెయిట్ చేద్దాం. ఆ తరువాత శ్రావణ్ కుమార్ మెదడులోని ఎలక్ట్రోడ్స్‌ను ఆక్టివేట్ చేయండి.

మన ఆర్డర్స్‌ను శిరసావహించి వచ్చాడా మంచిది. లేదంటే మనం ఎలక్ట్రోడ్స్‌ని ఆక్టివేట్ చేయడంలో అతని మెదడులో యేర్పడే వత్తిడికి అతడి మెదడులోని రక్తనాళాలు చిట్లిపోయి, అతడు మరణించినా పర్వాలేదు.

కాని, మన రహస్యాలు అతడి పెదవిదాటి పైకి రాకూడదు. బీ కేర్‌ఫుల్."

డాక్టర్ మాటలకు అంగీకారంగా తలాడించాడు అగర్వాల్. వారిద్దరూ కంప్యూటర్ ఛాంబర్ లోనికి నడిచారు.

## 11

ఎలుగుబంటి తనను చూసిందని తెలిసాక, పారిపోవడానికి ప్రయత్నించలేదు గుల్బసింగ్. ఆ ప్రయత్నం వృధా అని అతడికి తెలుసు. తను ఒక్కడే అయితే యెలాగోలా తప్పించుకోవచ్చు. కాని..శ్రావణ్ కుమార్ ....?

నిస్సహాయుడైన శ్రావణ్ కుమార్‌ను ఆ స్థితిలో వదిలేసి....తన ప్రాణాలు రక్షించుకోడానికి పిరికివాడిలా పారిపోలేక పోయాడు. మొండి ధైర్యంతో పిడికిలి బిగించి ఆ భల్లూకాన్ని ఎదుర్కోడానికి సిద్ధంగా నిలబడ్డాడు.

కుంగ్ ఫూ వస్తాదుల చేతికి ప్రత్యర్థి చిక్కితే, అతడిని తమ ఉక్కు కౌగిలిలో బిగించి, అతడి శరీరంలోని ఎముకలను విరిచేసి, ఒక మాంసం ముద్దలా తయారుచేస్తారు. సరిగ్గా ఎలుగుబంటి పంజాలకు చిక్కితే అంతే.

ఒక్కసారి దాని చేతులకు చిక్కితే విడిపించుకోవడం అసాధ్యం, అందుకే విడిపించుకోవడానికి వీలులేని పట్టును

భల్లూకపు పట్టు అంటారు.

దాని పంజాలకు చిక్కకుండా ఎలా దానిని ఎటాక్ చేయాలో ప్లాన్ చేయసాగాడు అతడు.

వేగంగా పరుగెత్తుకువచ్చి, క్రూరంగా అరుస్తూ అతడి మీదకు లంఘించింది ఆ భల్లూకం. అతడు చటుక్కున ప్రక్కకు తప్పుకున్నాడు. ఆ వేగాన్ని కంట్రోలు చేసుకో లేకపోయిన ఎలుగుబంటి ముందుకు తూలింది.

అదే సమయంలో దాని ప్రక్కటెముకలమీద రెండు కిల్లింగ్ పంచస్‌ను రిలీజ్ చేశాడతడు. మామూలు మనుషు లైతే ఆ దెబ్బలకు చారెడు రక్తం కక్కుకొనేవారు. కాని వత్తయిన వెంట్రుకలతో కూడిన దాని దళసరి చర్మం మీద పంచస్ తమ పూర్తి ప్రభావాన్ని చూపించలేక పోయాయి.

అది కోపంగా వెనక్కి తిరిగింది. బాధతో పంజా లతో గుండెలమీద చరుచుకుంది. వికృతంగా నోరు చాస్తూ అతడిమీదకు మరోమారు లంఘించింది. గాలిలో వెనక్కి డైవ్ చేశాడతడు. కాలు నేలమీద తాకినంతనే మరోమారు గాలిలోకి లేచాడు.

రెండవసారి నేలమీదకు తూలిందా మృగం. సరిగ్గా అదే సమయంలో గాలిలోకి లేచిన అతడు తన మోకా లును మడిచి స్ప్రింగ్‌లా బిగించాడు. రివ్వున వచ్చి ఆ ఎలుగుబంటిమీద వ్రాలాడతడు. అతడి మోకాలు సరిగ్గా దాని మెడమీద పడింది. కరెంట్ షాక్ కొట్టినట్లు గిలా గిలా కొట్టుకుంది అది.

డెస్పరేట్‌గా పంజాను విసిరింది. అలా మునికాళ్ళ మీదే వెనక్కి వ్రాలిపోయాడతడు. కేవలం మార్షల్ ఆర్ట్సులో అత్యంత ప్రావీణ్యం వున్నవారు మాత్రమే

చేయగలిగే ఫీట్స్ అవి.

ఆ వ్యాఘ్రం విసురుగా తన శరీరాన్ని విదిలించింది. రెండు కాళ్ళపై లేచి, వెనక్కు వ్రాలి వున్న అతడిమీద తన పంజాలను విసిరింది. అదే సమయంలో రెండు చేతులపై తన శరీర భారాన్ని ఉంచి రెండు కాళ్ళతో ఎగిరి దాని పొత్తి కడుపుపై తన్నాడతడు.

మూడడుగులు వెనక్కు తూలి పడిందది. కాని దాని పంజాలకున్న వాడిగోళ్లు అతడి తొడలను చీల్చుకుంటూ పోయాయి. ఎర్రని రక్తం అతడి ట్రౌజర్స్‌ను తడిపేయ సాగింది.

ఇక తాత్సారం చేయడం మంచిదికాదనిపించింది అతడికి. చుట్టూ ఒకసారి చూశాడు. ఒక ఇప్పచెట్టు మొదలులో వున్న పెద్దరాయి అతడిని ఆకర్షించింది. ఫుట్ బాల్ సైజులో వుంది ఆ రాయి. రెండడుగుల్లో ఆ చెట్టును సమీపించి ఆ రాయిని చేతిలోనికి తీసుకున్నాడు.

క్రిందపడ్డ ఆ భల్లూకం మెల్లగా లేవసాగింది. అదే సమయంలో ఆ బండరాయిని రెండు చేతులతో ఎత్తి పట్టుకొని దానిమీదకు లంఘించాడతడు. సరిగ్గా దాని తలపై బలంగా మోదాడు. ఆ బండరాతి దెబ్బకు దాని తల పగిలిపోయింది. ఎర్రని రక్తంతో తడిసిన దాని నల్లని ముఖం మరింత వికృతమయింది.

గుండెలు పగిలేలా ఆర్తనాదం చేస్తూ తన పంజాతో అతని గుండెలమీద మోదింది ఆ భల్లూకం. షర్టును చీల్చుకుంటూ అతని గుండెల్లో దిగాయి దాని వాడిగోళ్లు. ఆ దెబ్బకు వెనక్కు తూలాడతడు. పళ్ళ బిగువున బాధను సహిస్తూ మెల్లగా ముందుకు అడుగు వేశాడతను. అతని చేతులలోని బండరాయి మాత్రం భద్రంగా వుంది.

ముఖాన తగిలిన దెబ్బతో, చిమ్ముతున్న రక్తం సన్నని ధారలా వంటిమీద కారుతుంటే, నిస్సత్తువతో కాళ్ళు తడబడుతున్నా, కసిగా, క్రూరంగా అతడినే చూస్తూ అతడిమీదకు దుమకబోయింది ఆ భల్లూకం. అదే క్షణంలో మరో మారు తన చేతిలోని బండతో దాని తలపై బలంగా మోదాడతడు.

అంతే! దాని తల నిలువునా చీలిపోయింది. రక్తం వరదలుగా కారుతుంటే నిర్జీవంగా నేలమీదకు వ్రాలి పోయింది ఆ భల్లూకం.

చేతిలోని బండరాయిని ప్రక్కకు విసిరేసి, దూరంగా నిలబడి ఆ పోరాటాన్నంతా నిశ్చేష్టుడై చూస్తున్న శ్రావణ్ కుమార్ చేతిని పట్టుకొని ఆ తోపులోనుండి వడి వడిగా నడుస్తూ బయటపడ్డాడు.

ఆ భల్లూకం శవాన్ని మిగిలిన ఎలుగుబంట్లు చూసి తమను వెంటాడకముందే తాము ఆ స్థలాన్ని విడిచి దూరంగా పారిపోవటం తమ ఆరోగ్యానికి యెంతయినా మంచిదని అతడికి బాగా తెలుసు.

ఆ తోపును వీడి సుమారు రెండువందల గజాలదూరం వెళ్ళి వుంటారు వారు.

అదే సమయంలో....

ఇప్పపూల తోటలోనికి ప్రవేశించింది ఒక ఎలుగుగొడ్ల గుంపు ఐదు పెద్ద ఎలుగుగొడ్లు, రెండు పిల్లలూ మొత్తం ఏడు ఎలుగుగొడ్లు అవి.

వాటికి విప్పపూల వాసనను మించి ఘాటుగా సోకింది రక్తపు వాసన. కర్ణపుటాలను పెద్దవిచేస్తూ అవి నలు దిక్కులా కలియ వెదికాయి.

తల బద్దలయి చచ్చి పడి వున్న ఎలుగుబంటిని

చూశాయి. బాధగా అరుస్తూ ఆ భల్లూక శవం చుట్టూ తిరగసాగాయి అవి.

తమ తోటి ప్రాణి మరణాన్ని చూసి ఆ వన్య మృగాలు కూడా అలా శోకిస్తాయనే నిజాన్ని ఆ దృశ్యం చూడకుంటే ఎవ్వరూ నమ్మలేరు.

కొద్దినిమిషాల తరువాత అవి ఆ శవంచుట్టూ తిరగడం ఆపి కోపంగా అరిచాయి. ముక్కులను ఎగబీలుస్తూ ఏదో వాసనను పసిగట్టడానికి ప్రయత్నించాయి.

ఒకదానినొకటి సాభిప్రాయంగా చూసుకున్నాయి. వెంటనే కూడబల్కుకున్నట్లుగా తోపును వదలి, గులాబ్ సింగ్, శ్రావణ్ కుమార్ ప్రయాణించిన దిక్కులో వేగంగా పరుగెత్తసాగాయి అవి. కొద్ది నిమిషాల వ్యవధిలో అవి వారికి సుమారు నూరు గజాల దూరం వచ్చేసాయి.

వగర్చుకుంటూ, వికృతంగా అరచుకుంటూ వస్తున్న ఆ ఎలుగుగొడ్ల గుంపును చూసేసరికి గులాబ్ సింగ్ భయంతో వణికిపోయాడు.

ఒక్కసారిగా అన్ని ఎలుగుబంట్ల మధ్య చిక్కితే, పోల్చడానికి కనీసం తమ శవాల ఆకారాలు కూడా మిగలవని అతడికి బాగా తెలుసు.

శక్తినంతా కూడదీసుకుని పరుగెత్తసాగాడతడు. శ్రావణ్ కుమార్ ఒక ప్రక్క ఆయాసంతో వగరుస్తున్నాడు. అతడి చేయి పట్టుకొని దాదాపు ఈడ్చుకెళుతున్నట్లుగా పరుగెత్తాల్సి వస్తూంది గులాబ్ సింగ్ కు.

శ్రావణ్ కుమార్ ఆ వేగానికి కాళ్ళు తడబడి, తూలి పడిపోయాడు. అతడిని లేవనెత్తడానికి క్రిందకు వంగాడతడు. అదే సమయంలో ఏదో కాంతి వారిమీద పడింది.

మీద పడుతున్న ఆ వెలుగుకు అరచేయి అడ్డం పెట్టుకొని, కళ్ళు చిట్లిస్తూ చూశాడతడు.

రెండు మోటార్ సైకిల్స్, ఒక జీపు రివ్వున దూసుకుంటూ వచ్చి వారికి కొంతదూరంలో ఆగాయి. బిల, బిలమంటూ ఆ వాహనాలలో నుండి దిగారు గార్డ్స్. కొందరు రైఫిల్స్‌ను, కొందరు రివాల్వర్స్‌ను పట్టుకొని వున్నారు. ఇద్దరు మాత్రం చేతిలో పెద్ద, పెద్ద సిరంజ్‌లను పట్టుకొని వున్నారు.

అవి.... హైపోడెర్మిక్ సిరంజ్‌లు.

ఆ గార్డ్స్ ఒక సర్కిల్‌లా ఏర్పడి, మెల్లగా వారిని సమీపించసాగారు.

ఆ గార్డ్స్‌ను చూడగానే భయంతో గొంతు ఆర్చుకు పోయింది అతడికి.

"వుయ్.... ఆర్.... ఫినిష్డ్."

అనుకున్నాడు గులాబ్ సింగ్. నిస్సహాయంగా వారిని చూస్తూ అలాగే వుండిపోచూడతడు. అతడి చేయిమాత్రం శ్రావణ్ కుమార్‌ను గట్టిగా పట్టుకొని వుంది.

వికటంగా నవ్వుతూ, అడుగులు ముందుకు వేసారు ఆ గార్డ్స్. ఇక జరగబోయేది ఊహించడం ఇష్టంలేక కన్నులు మూసుకొని నిరాసక్తంగా నిలబడ్డాడు గులాబ్ సింగ్.

## 12

ఆ రాత్రి....

సి.బి.ఐ. ఛీఫ్ కరుణాకర్ అధ్వర్యంలో గ్రీన్ ఫ్లవర్ నర్సింగ్ హోమ్‌మీద రైడింగ్ జరిగింది. ఒక్క అంగుళం కూడా వదలకుండా ఆ నర్సింగ్ హోమ్‌నంతా గాలించారు వారు.

కాని వారు ఆశించినట్లు, అనుమానించదగ్గ ఆధారా

తేం దొరకలేదు వారికి. కనీసం 'సైకో సర్జరీ' చేయబడిన ఒక పేషెంట్ కూడా ఆ క్లినిక్‌లో లేదు.

"తను అనవసరంగా డాక్టర్ జీవన్‌ను అనుమానించాడా? తొందరపడి ఆ నర్సింగ్ హోమ్‌మీద రైడ్ చేశాడా?"

సందిగ్ధంలో పడ్డాడు కరుణాకర్.

'సంథింగ్ ఈజ్ రాంగ్ హియర్.'

అంటూంది అతడి అంతరంగం. కాని, నేరాన్ని ఋజువు చేయడానికి అతడి నమ్మకం సరిపోదు. ఋజువులు కావాలి.

అతడు నర్సింగ్ హోమ్‌లోని నైట్ ఇన్‌ఛార్జి వారికి కలిగిన అసౌకర్యానికి చింతిస్తున్నామని సారీ చెప్పి బయటకు నడిచాడు.

అయితే అంతటితో అతడు ఆ నర్సింగ్ హోమ్‌ను విడిచి పెట్టదలచుకోలేదు. మఫ్టీలో నున్న ఒక సి.బి.ఐ. ఇన్‌స్పెక్టర్‌ను ఆ నర్సింగ్ హోమ్‌పై నిఘా ఉంచాడు. ఆ క్షణంనుండీ ఆ నర్సింగ్ హోమ్ ఫోన్‌లన్నీ టాప్ చేయబడ్డాయి.

అతనికి ఒకేఒక్క విషయంలో చిన్న ఆశ మిగిలి వుంది. వారు రైడింగ్ చేసిన సమయంలో ఆ నర్సింగ్ హోమ్ యజమాని, సీనియర్ ఇన్‌ఛార్జ్ అయిన డాక్టర్ జీవన్ అక్కడ లేడు. డాక్టర్ జీవన్ ఎక్కడికో వెళ్ళారంటూ నైట్ ఇన్‌ఛార్జ్ చెప్పిన మాటలు అతడిని కన్విన్స్ చేయలేక పోయాయి.

"తన అంచనా తప్పుకాకుంటే ఆ రైడింగ్ విషయం, ఎక్కడున్నా డాక్టర్ జీవన్‌కు తెలియజేయబడుతుంది.

అందుకే ఆ నర్సింగ్ హోమ్ ఫోన్లను ట్రాప్ చేయించాడు."

సెంట్రల్ టెలిఫోన్ ఎక్స్ఛేంజ్‌లో కూర్చుని ఆ ఫోన్ కాల్ కోసమే ఎదురుచూస్తున్నాడు కరుణాకర్.

ఆ ఎక్స్ఛేంజ్ ముందున్న పోర్టికోలో ఒక జీపు ఆగింది. ఏ క్షణంలోనైనా బయలుదేరడానికి సిద్ధంగా వుంది అది. వెనుక సీటులో కూర్చుని వున్న ముగ్గురు సి.బి.ఐ. ఇన్‌స్పెక్టర్లు వాచీలకంక చూడసాగారు.

ఒక్కొక్క నిమిషం భారంగా దొర్లసాగింది.

సరిగ్గా ఇరవై అయిదునిమిషాల తరువాత వారి నిరీక్షణ ఫలించింది.

గ్రీన్ ఫ్లవర్ నర్సింగ్ హోమ్ నైట్ ఇన్‌ఛార్జ్ అలిబాగ్‌కు ఓ ట్రంక్ కాల్ బుక్ చేశాడు. అయితే అది అతడు ఊహించినట్లుగా డాక్టర్ జీవన్‌కు కాదు. సతీష్ అగర్వాల్ అనే మరో వ్యక్తికి.

టేప్ చేయబడ్డ ఆ మెసేజ్‌ను అలకిస్తూ తీవ్రమైన ఆలోచనలోపడ్డాడు కరుణాకర్.

'నర్సింగ్ హోమ్‌పై జరిగిన రెయిడ్ విషయం యెవరో సతీష్ అగర్వాల్‌కు తెలియజేయవలసిన అవసరం ఏమిటి? 'అతడికీ గ్రీన్ ఫ్లవర్‌కూ యేమిటి సంబంధం? అది తేలాలంటే తాము అగర్వాల్‌ను కలుసుకోవాలి.'

ఎందుకో అతడికి అలిబాగ్‌కు వెళ్తే చాలు ఈ మిస్టరీ విడిపోతుంది అనిపించింది. అంతే! ఒక నిర్ణయానికి వచ్చినట్లు అతడు బయటకు నడిచాడు.

కరుణాకర్ యెక్కి కూర్చోగానే ఆ జీపు స్టార్టయింది. శరవేగంగా అలిబాగ్ వైపు దూసుకోపోసాగింది ఆ జీపు.

# 13

"మహా అయితే ఇంకో రెండు సెకన్లు. అంతే! ఆ గార్డ్సు చేతిలోని హైపో డెర్మిక్ సిరంజ్ లు తమ భుజాలలో దిగబడతాయి. స్పృహ తప్పిన తమకు సైకో సర్జరీ ద్వారా తన మెదడులో కంట్రోలింగ్ ఎలక్ట్రోడ్స్ ఇన్సర్ట్ చేస్తారు. ఇక జీవితాంతం, మర మనిషిలా వారి ఆజ్ఞలను పాలించే బానిసలా పడివుండాల్సిందే—"

బాధగా తలవిదిలించాడు గులాబ్ సింగ్.

ఒకటి.... రెండు.... మూడు ...

ఒక్కొక్క సెకను గడుస్తోంది.

తమ శరీరంలో దిగబడతాయనుకున్న సిరంజ్ లు తమను గుచ్చుకోలేదు. అదే సమయంలో చెవులు చిల్లులు పడేలా భయంతో వేసిన గార్డుల ఆర్తనాదాలు వినిపించాయి అతడికి. ఆశ్చర్యంగా కళ్ళు తెరిచాడతడు.

ఎదురుగా కన్పిస్తున్న దృశ్యం చూసేసరికి అతడు తెల్లబోయాడు.

శరవేగంగా తమను తరుముకుంటూ వచ్చిన ఎలుగుగొడ్ల గుంపు ఆ గార్డ్సును ఎటాక్ చేసింది. తాము గార్డ్సు మధ్య ఉండటంచేత వాటి దృష్టి తమమీద పడలేదు.

ఆ భల్లూకాల నుండి తప్పించుకోవడానికి గార్డ్సు డెస్పరేట్ గా ప్రయత్నిస్తున్నారు.

అతడు వెంటనే రియాక్టయ్యాడు. అక్కడి నుంచి తప్పించుకోవడానికి అంతకంటే మంచి అవకాశం మళ్ళీ రాదని తెలుసు అతడికి

శ్రావణ్ కుమార్ చేయి పట్టుకొని, జీపువైపు పరుగెత్తాడతడు. బ్లాంక్ గా చూస్తున్న శ్రావణ్ కుమార్ ను జీపులోనికి నెట్టి, డ్రయివింగ్ సీటులో కూర్చున్నాడు

అతడు.

జీపు ఇంజన్ స్టార్టయిన శబ్దం విని అటువైపు చూశారు గార్డ్సు. వేగంగా దూసుకుపోతున్న జీపులో తమ ప్రత్యర్థులు పారిపోతుండటం తెలిసి కూడా ఆపలేక పోయారు వారు.

నల్లని పిశాచాల్లా కోరలు చాస్తూ తనమీదకు దుముకుతున్న ఆ ఎలుగుబంట్లను ఎదుర్కొనడంతోనే వారికి సరిపోతోంది.

ముప్ఫయి నిముషాల తరువాత అంతమయింది వారి పోరాటం. రైఫిల్స్‌తో కాల్చి నాలుగు ఎలుగుబంట్లను చంపగల్గారు వారు. మిగిలినవి పారిపోయాయి.

కాని, ఆ ఎలుగుబంట్ల కోరల పాలై పోయారు వారిలో ముగ్గురు గార్డ్సు. మిగిలినవారు గ్ కసి కమయిన దేహాలతో నిస్త్రాణంగా అడుగులు వేస్తూ తమ వాహనాలను సమీపించారు.

అయితే అప్పటికే కు-గబ్ సింగ్ వాళ్ళు కనీసం, ఏళ్ళై. ఆరవై కిలోమీటర్ల దూరం వెళ్ళిపోయి ఉంటారని, యిక వారిని వెంటాడడం అనవసరం అని అనుకున్నారు వారు.

ఆ విషయాన్ని తమ బాస్‌కు రిపోర్టు చేయడానికి తమ స్థావరానికి వెనుతిరిగారు వారు.

## 14

'తన నర్సింగ్ హోమ్‌మీద రెయిడింగ్ జరిగిందన్న వార్త' వినేసరికి ఎలక్ట్రిక్ షాక్ తగిలినట్లయింది డాక్టర్ జీవన్‌కు.

'అంటే తనమీద అనుమానం యేర్పడిందన్నమాట.

ఇక తను అజ్ఞాతవాసంలోనికి వెళ్లాలి. అన్నింటి కంటే ముఖ్యమయినది శ్రావణ్ కుమార్ విషయం.'

డాక్టర్ జీవన్, తన పి. ఎ. సతీష్ అగర్వాల్ వంక చూశాడు.

'అగర్వాల్ .... శ్రావణ్ కుమార్ మెదడులోని కంట్రోలింగ్ ఎలక్ట్రోడ్స్‌ను ఏక్టివేట్ చేయి. సెర్చింగుకు వెళ్ళిన మన గార్డ్సు వచ్చేవరకూ వెయిట్ చేయడానికి మనకు అవకాశం లేదు.'

'యస్ డాక్టర్!'

అంటూ అగర్వాల్ కంప్యూటర్ రూమ్‌లోనికి నడిచాడు. అతన్ని అనుసరించాడు డాక్టర్ జీవన్.

అత్యంత అధునికమైన కంప్యూటర్ యంత్రాలతో నిండివుంది ఆ గది. మూడు ఎయిర్ కండిషన్ మిషన్లు పని చేస్తున్నా, అంత చలిలో కూడా టెన్షన్‌తో వారి నుదుట చెమట్లు పట్టాయి.

ఒక కంప్యూటర్ ముందు కూర్చున్నాడు అగర్వాల్. అతడు ఆపరేట్ చేయడం మొదలు పెట్టిన అయిదు నిముషాల తరువాత కంప్యూటర్‌కున్న స్క్రీన్‌లో అక్షరాలు కనిపించడం ప్రారంభించాయి.

'శ్రావణ్ కుమార్.'

'కనెక్టెడ్'

'ఓకె ప్రొసీడ్ ఫర్దర్.'

సంతోషంతో వాళ్ళ ముఖాలు వెయ్యి కాండిల్స్‌లా వెలిగాయి. ఒక బటన్ నొక్కాడు అగర్వాల్.

స్క్రీన్ మీద జిగ్ జాగ్‌గా సన్నని గీతలు ప్రత్యక్షమయ్యాయి. వాటిని చూస్తూ విక్రుతంగా నవ్వాడతడు.

"ఇట్స్ డన్ బాస్!" అన్నాడతడు. ప్రశంసా

పూర్వకంగా అతడి భుజం తట్టాడు డాక్టర్ జీవన్.

అంతవరకూ రేయింతో ప్రశాంతంగా కూర్చుని వున్న శ్రావణ్ కుమార్ ఒక్కసారిగా పిచ్చెక్కినట్లు అరిచాడు. బాధగా అరుస్తూ తల వెంట్రుకలను పీక్కోసాగాడు.

జీపును డ్రయివ్ చేస్తున్న గులాబ్ సింగ్ అతడివంక ఆశ్చర్యంగా చూశాడు. ఉన్నట్లుండి హఠాత్తుగా అతడిలో ఈ మార్పేమిటో అతడికి అర్ధంకాలేదు.

క్షణ క్షణానికీ శ్రావణ్ కుమార్ లో యేదో మార్పు కనిపించసాగింది. పాలిపోయినట్లు తెల్లగా వుండే అతని కళ్ళలో రక్తపు జీరలు చోటు చేసుకోసాగాయి. కోపంతో అతడి ముఖం ఎర్రగా జేవురించింది. వికృతమైన హాసంతో అతడి పెదవులు వంకరిలు తిరుగుతున్నాయి.

సన్నగా నవ్వాడతడు. పిశాచం నవ్వినట్లుంది అతని నవ్వు. అనుమానంగా అతడివైపు చూశాడు గులాబ్ సింగ్.

* * *

సతీష్ అగర్వాల్ కంప్యూటర్ కున్న కీ బోర్డులో ఒక మెసేజ్ ను టైపు చేయసాగాడు.

శ్రావణ్ కుమార్ మెదడులోని ఎలక్ట్రోడ్స్ ను ఏక్టివేట్ చేయడం పూర్తయింది. ఇక అతడు తమ కంట్రోల్ లోనికి వచ్చేసినట్టే. మెంటల్ కంట్రోలింగ్ డివైస్ ద్వారా అతడికి ఈ మెసేజ్ ను పాస్ చేస్తే చాలు దానిని అతడు తూ.చా. తప్పకుండా పాటిస్తాడు.

కంప్యూటర్ కున్న స్క్రీన్ పై అతడు టైపు చేస్తున్న మెసేజ్ ఫోకస్ అవుతోంది.

"శ్రావణ్ ....శ్రావణ్ కుమార్.

నీతో వున్న వ్యక్తి గులాబ్ సింగ్. అతడు మన

శత్రువు తక్షణం అతన్ని చంపేయ్. చంపేయ్."

ఆ మెసేజ్‌ను చూసి సంతృప్తిగా తలాడించాడు డాక్టర్ జీవన్.

## 15

గులాబ్‌సింగ్ మెడవైపు చేతులు చాచాడు శ్రావణ్ కుమార్. పాములా తన మెడను చుట్టుకుంటున్న అతడి అరచేతులను చూసి ఉలిక్కిపడ్డాడు గులాబ్‌సింగ్.

శ్రావణ్‌కుమార్‌ను విసురుగా ప్రక్కకు తోసాడు.

కాని, ఒక్క అంగుళం కూడా కదలలేదతడు. మరింత ముందుకు వంగి గులాబ్‌సింగ్ మెడను గట్టిగా పట్టుకున్నాడతడు. అతడి వేళ్ళు మెల్లగా గులాబ్‌సింగ్ కంఠంమీద బిగుసుకుంటున్నాయి.

శ్రావణ్‌కుమార్ బరువుకు ఒక ప్రక్కకు వ్రాలి పోయాడతడు. స్టీరింగ్ మీదున్న అతడి చేతులు పట్టు తప్పిపోసాగాయి. కంట్రోలు తప్పిన జీపు పాములా మెలికలు తిరుగుతూ వెళ్ళసాగింది.

ఒకప్రక్క కంఠనాళాలు తెగిపోతాయేమో అన్నంత బాధ. ఊపిరి అందటంలేదు అతడికి.

అతికష్టంగా ఒక చేత్తో స్టీరింగ్‌ను కంట్రోల్ చేస్తూ మరో చేతిని నెమ్మదిగా పైకెత్తాడు. అరచేతిని కత్తిలా బిగించి, బలంగా శ్రావణకుమార్ మెడమీద చరిచాడు.

మామూలు మనిషైతే ఆ దెబ్బకు తెలివి తప్పి పడి పోయి ఉండేవాడు. కాని, శ్రావణ్‌కుమార్ స్వతహాగా రజలర్ అదీగాక అతనిని ఏదో పిచ్చి బలం ఆవహించి వుంది.

ఆ దెబ్బకు ఒక్కసారి బాధగా అరిచాడు. అంతే! ంత కోపంతో అతడి గొంతును నులుముసాగాడతడు.

అతడిని మరి ఎదుర్కొనలేనని అర్థమయిపోయింది గులాబ్ సింగ్ కు.

“ఇంత శ్రమపడి అతడిని తప్పించి, తీసుకువచ్చింది. అతడి చేతిలో చావడానికా?”

‘నో’....అంటూ అరచేతితో బలంగా అతడి ముఖాన చరిచాడు గులాబ్ సింగ్. ఆ దెబ్బకు శ్రావణ్ కుమార్ ముఖం కందిపోయింది.

అదే సమయంలో యేదో వెహికల్ కాంతి గులాబ్ సింగ్ ముఖంపై పడింది. కళ్ళు చిట్లిస్తూ, జీపును పార్శ్వగా ప్రక్కకు టర్న్ చేశాడతడు.

అసలే ఒంటి చేత్తో కంట్రోలు చేస్తున్నాడతడు. ఆపైన శ్రావణ్ కుమార్ తో పెనుగులాడటం కంట్రోల్ తప్పిన జీపు రోడ్డుమీదనుండి క్రిందకు జారి పొదల మధ్యకు దూసుకుపోయింది. అడ్డు వచ్చిన పొదలను మట్టించుకుంటూ వెళ్ళటంలో దాని వేగం తగ్గింది. సూటిగా వెళ్ళి ఒక ఈత చెట్టును ఢీకొంది ఆ జీపు.

ఆ కుదుపుకు అన్ బాలన్స్ అయ్యారు వారిద్దరూ. స్టీరింగ్ నుదురుకు కొట్టుకోవడంతో గాయమై రక్తం కారసాగింది గులాబ్ సింగ్ కు. సీటులోనుండి క్రిందకు తుళ్ళిపోవటంలో, మోచేతులు కొట్టుకుపోయాయి శ్రావణ్ కుమార్ కు.

ఆగిపోయిన జీపులోనుండి మెల్లగా దిగాడు గులాబ్ సింగ్. నిస్త్రాణంగా రెండడుగులు ముందుకు వేశాడు. అంతే! క్రిందపడ్డ శ్రావణ్ కుమార్ ఎప్పుడు లేచాడో యేమో, భల్లూకంలా ఎగిరి అతడిమీదకు దూకాడు.

కొండచిలువలా అతడి శరీరం గులాబ్ సింగ్ ను చుట్టేసింది. బోర్లా పడ్డ గులాబ్ సింగ్ మెడకిందుగా మోచేతిని

పోనిచ్చి గట్టిగా బిగించసాగా డతడు.

అది....ఇాండియన్ రెడ్ లాక్ గా పిలతబడే మల్ల యుద్ధపు పట్టు.

డిఫెన్స్ మినిస్ట్రి ఆఫీసు గూర్ఖా ప్రాణాలుతీసింది ఆ మల్లయుద్ధపు పట్టేనని అతడికి బాగా తెలుసు.

'అయిపోయింది. ఇంతటితో ఈ జీవితం అంతం అయి పోయినట్లే గుడ్ బై! గుడ్ బై టు ఎవ్రీబడీ'-అనుకున్నా డతడు.

కాని... ఆశ్చర్యం!

ఉన్నట్లుండి శ్రావణ్ కుమార్ చేతిపట్టు మెల్లగా సడలిపోసాగింది. స్పృహ తప్పి వెనక్కు వాలిపోతున్న అతడి వంక ఆశ్చర్యంగా చూశాడు గులాబ్ సింగ్.

ఎదురుగా రక్తసిక్తమయి వున్న ఐరన్ రాడ్ను చేతితో పట్టుకొని నిలబడి వున్న సి.బి.ఐ. ఛీఫ్ కరుణాకర్ను, ఆగి వున్న వారి జీపులో నుండి దిగుతున్న మిగిలిన సి. బి. ఐ. ఆఫీసర్లను చూసేసరికి తను ఎలా రక్షింపబడ్డాడో అర్థం అయిపోయింది అతడికి.

"వెల్ డన్ రాంకుమార్ నాకు తెలుసు నీవు సాధిస్తావని."

స్పృహతప్పి క్రిందపడ్డ శ్రావణ్ కుమార్ వంక చూస్తూ ప్రశంసపూర్వకంగా గులాబ్ సింగ్ భుజం తట్టాడు సి.బి.ఐ. ఛీఫ్ కరుణాకర్.

"యూ ఆర్ ఇన్ ద కరెక్ట్ టైమ్ సర్."

చిన్నగా నవ్వుతూ అన్నాడు గులాబ్ సింగ్ ఉరఫ్ రాంకుమార్.

## ఉప సంహారం:

రాంకుమార్ అలిబాగ్ ఎస్టేట్స్ గురించి, డాక్టర్

జీవన్ చేస్తున్న హైజాక్ సర్వీస్ గురించి తన బాస్‌కు వివరంగా చెప్పాడు.

బొంబాయి క్రైం బ్రాంచికి కాంటాక్టు చేశాడతడు. రెండు వాన్‌లనిండా రిజర్వు పోలీసులతో బొంబాయి క్రైం బ్రాంచి ఇన్‌స్పెక్టర్....అలిబాగ్ ఎస్టేట్స్‌మీద రెయిడ్ జరిపాడు.

రెడ్ హాండెడ్‌గా దొరికిపోవడంతో డాక్టర్ జీవన్ తన నేరాన్ని ఒప్పుకొని చట్టానికి లొంగిపోయాడు. అతడి అనుచరులందరూ బంధింపబడ్డారు.

హైజాక్ సర్జరీ చేయబడ్డ శ్రావణ్ కుమార్ లాంటివారిని తిరిగి మామూలు మనుషులను చేయడానికి ప్రభుత్వం వారిని బొంబాయిలోని జెస్లోక్ ఆస్పత్రికి తరలించింది.

అయితే ఈ సాలెగూడు వెనుకనున్న విదేశీ హస్తమేమిటన్నది మాత్రం ఎంత ప్రయత్నించినా డాక్టర్ జీవన్ వెల్లడి చేయలేదు.

బహుశా జైలు గోడలమధ్యనుండి వారు తనను తప్పిస్తారని ఆశతో యెదురుచూస్తున్నాడేమో!

—:అ యి పో యి ం ది:—

# గజేంద్ర మోక్షం

## వసుంధర

విశాఖపట్నం బీచ్—

ఇసుక తిన్నెపై శాస్త్రి శర్మ....

ఇద్దరూ గంభీరంగా వున్నారు.

వారి మౌనం చూస్తూంటే సముద్రుడి కబుర్లు వింటున్నారా అనిపిస్తుంది.

"శర్మా!" అన్నాడు శాస్త్రి ఏదో చెప్పబోతున్న వాడిలా.

అతి దేం చెబుతాడోనని శాబోలు సముద్రుడూ తన ఘోష ఆపాడు.

"ఊఁ చెప్పు—" అన్నాడు శర్మ.

"కడుపులో ఆకలి. జేబులో డబ్బులేవు...."

"పాత విషయంకాదు. కొత్తదేమైనా చెప్పు...."

"మనలో తెలివి వుంది. సామర్థ్యముంది. ఎందుకిలా కొరగానివాళ్ళమైపోయాం?" అన్నాడు శాస్త్రి.

"మనమేమీ కొరగానివాళ్ళం కాదు, ఎన్నో

సాధించాం. కానీ...."

"ఊఁ కానీ...."

"డబ్బు మిగుల్చుకోలేక పోతున్నాం—...."

"ఎందుకంటావ్?"

"ఎందుకో నాకూ తెలియదు...." అని నిట్టూర్చాడు శర్మ.

"అయిడియా...." అన్నాడు శాస్త్రి.

"కడుపు నింపేదేనా?" అన్నాడు శర్మ అనాసక్తతతో.

"ఇప్పుడు కాకపోయినా ముందు ముందు నింపవచ్చు."

శర్మ నిట్టూర్చి—"ముందిప్పటికి పనికొచ్చే అయిడియా చెప్పు—" అన్నాడు.

"అది నాకూ తెలియదు. కానీ మనమిలా యెందుకున్నామో నా కర్థమయింది—"

"పోనీ అదే చెప్పు ..."

"మనకు ధనమంటే తెలియదు. అయినవాళ్ళెవ్వరూ లేరు. కండబలముంది. బుద్ధిబలముంది. స్వార్థం గురించి ఆలోచనలేదు—...."

"మన్ని మనం పొగుడుకుంటే కడుపునిండదు...."

"నేను చెప్పేది పూర్తిగా విను. ఈ దేశంనిండా స్వార్థపరులు. వాళ్ళు దేశం ప్రగతిపథానికి వెళ్ళకుండా అపుతున్నారు. అలాంటివారి నెదిరించడమే మన ముఖ్య లక్ష్యంగా పెట్టుకుంటే—ఎంతో బాగుంటుంది. లక్ష్యం లేకపోవడంవల్లనే మనమిలాగుండిపోయామని నాకని పిస్తోంది—"

"నువ్వు చెప్పింది నిజమే! కానీ ముందు కడుపు నిండాలి కదా—అప్పుడే లక్ష్యం గురించి ఆలోచించే

ఓపిక వస్తుంది—" అన్నాడు శర్మ.

"లక్ష్యం గురించి ఆలోచించగానే కడుపునిండే ఉపాయమూ తోచింది—శే—"

"ఎక్కడికి?"

"సుబ్రహ్మణ్యేశ్వరరావింటికి!"

"ఆయనెవడు?"

"ఈరోజాయన కూతురు పెళ్ళి...."

"అయితే...."

"అక్కడ ఘనమైన విందు."

శర్మ టక్కున లేచి నిలబడి మళ్ళీ నీరసంగా కూర్చుండి పోయాడు— "ఆ విందులో మనకు స్థానమెక్కడ దొరుకుతుంది?"

"ఆహ్వానపత్రంతో...."

"అదెలాగొస్తుంది...."

"లక్ష్యముండాలిగానీ ఉపాయం తట్టదా?"

"నాకు తట్టడంలేదు...."

"ఇంటికి పద—చెబుతాను...."

"శాస్త్రీ! ఇంటికి వడితే నా ఆకలి పెరుగుతుంది."

"ఎందుకని?"

"ఒక్కటే ఒక్క గది—ఆ గదిలో ఒక్కగానొక్క బల్ల దానిమీద క్యారియర్ — పింగాణీ ప్లేటు— చూస్తూంటే నే నాకలి ఆగలేను...."

"మరీ అలా దిగులుపడిపోకు — మనం నిన్నకూడా భోంచేశాం తెలుసా?" అన్నాడు శాస్త్రి.

"ఆ మాటకొస్తే మొన్నకూడా భోంచేశాం...."

"అదే నేనూ చెబుతున్నాను. ఒకసారి నువ్వు వరుసగా మూడు రోజులు భోం చేయలేదు. గుర్తుందా?"

"బాగుంది. అప్పుడు వాడు జ్వర మొచ్చింది—"

"ఇప్పుడూ జ్వర మొచ్చిందనుకో—" అన్నాడు శాస్త్రి.

శర్మ అభ్యంతరం చెప్పలేదు. ఇద్దరూ లేచారు.

## 2

తలుపు తాళం తీశాక — "శర్మా! నువ్వు బయటే నిలబడు—" అన్నాడు శాస్త్రి.

"ఎందుకు?"

"చిన్న పని వుంది—" అన్నాడు శాస్త్రి.

శర్మ బయటే నిలబడ్డాడు.

శాస్త్రి లోపలకు వెళ్ళి తలుపులు వేసుకొని—రెండు నిమిషాల్లో తలుపుతీశాడు.

"ఏం చేశావ్?"

"తర్వాత చెబుతాను—ముందు లోపలకు పద...."

శర్మ బల్లకేసి చూశాడు—"ఆకలి!" అన్నాడు.

"నీ ఆకలి గుర్తుకు రాకూడదు—" అన్నాడు శాస్త్రి.

"ఎందుకని?"

"బల్లమీద క్యారియరు—ప్లేట్లు నీక్కనపడకుండా దాచేశాను—"

"ఏమో—నాకవి కనపడుతూనే వున్నాయి...."

శాస్త్రికి అనుమానం వచ్చి బల్లంతా తడిమిచూశాడు. న్యూస్ పేపరుతప్ప దానిమీదింకేమీ లేదు.

"పాపం-నీకు చాలా ఆకలిగా వుంది...." అన్నాడు శాస్త్రి.

"జాలిపడొద్దు. దాంతో నా ఆకలితీరదు...."

"ఇంటాయన విశ్వంగారి దగ్గర ఆహ్వాన పత్రిక

వుంది" అన్నాడు శాస్త్రి.

"ఉంటే మనకేమి లాభం—ఆయన నీ వెంటరాడు!"

"ఆయన వెళ్ళడు ...."

"నీకెలా తెలుసు?"

"ఊళ్ళో యేం జరిగినా ఆయనను పిలుస్తూ వుంది. కానీ ఆయ నెక్కడికీ వెళ్ళడు—...." అన్నాడు శాస్త్రి.

"నువ్వు చెప్పింది నిజమే ... కాని ఆ ఆహ్వానపత్రం మనకా కాలం చే యిస్తాడా?"

"అడిగేలా అడిగితే యిస్తాడు ...."

"అయితే అడిగి పట్రా—...."

"నాతో నువ్వూ రావాలి ...."

"నేను రాను ...." అన్నాడు శర్మ.

"రానంటే ఎలా? ఇది మనిద్దరి అవసరమూను ...."

"ఆయనకు మనం రెండు నెలల అద్దె బాకీ ఉన్నాం. వెళ్ళామంటే ఆయన అదే పనిగా తిట్లు లంకించు కుంటాడు.... ఆకలిగా ఉన్నప్పుడు అన్నం తినగలను, తిట్లు తినలేను ...."

"ఆయన మనని తిట్టడు ...."

ఉన్నట్టుండి శర్మకు గుర్తొచ్చింది— "అన్నట్లు మన మాయన్ను తప్పించుకుని తిరుగుతున్నాం కదూ— కావాల నెలా ఎదురుపడతాం?"

"శర్మా! నువ్వు మన లక్ష్యం సంగతి మర్చిపోతు న్నావు ...."

"గుర్తుంది-సుబ్రహ్మణ్యేశ్వరావిల్లు ....

"అదికాదు—అన్యాయాల నెదిరించడం ...." అని—

"ఇంటాయన కూడా అన్యాయాలు, అక్రమాలు

చేస్తున్నాడని నా కనుమానంగా ఉంది—" అన్నాడు శాస్త్రి.

"పాపం—ఆయన సామాన్యుడు. ఉద్యోగం డబ్బుల మీదా, మనమిచ్చే అద్దె డబ్బులమీద ఆధారపడి బ్రతుకుతున్న అమాయకు డాయన..."

"ఆయన సామాన్యుడేనని నువొప్పుకున్నావు కదా! అలాంటప్పు డూళ్ళో జరిగే పెద్ద పెద్ద పార్టీలన్నింటికీ ఆయన కాహ్వానమెలా వస్తోందంటావు?"

శర్మ తెల్లబోయి—"నిజమే!" అన్నాడు.

"ఇందులో యేదో గూడుపుఠాణీ వుంది—పద, వెళ్ళి ఆయన్ను బెదిరించి వద్దాం—" అన్నాడు శాస్త్రి.

"ఆయన కద్దె బాకీ వుండి ఆయన్నేం బెదిరిస్తాం—"

"ఆయన సామాన్యుడే కాదు. అమాయకుడని నువ్వే కదా అన్నావు—...."

"ఏమో—అమాయకుడని గ్యారంటీ యేమిటి? నే నేదో మాటవరసక న్నాను...."

"అసలు మన కిల్లద్దెకివ్వడమే ఓ అమాయకత్వం. అ పైన మనల్నింకా ఇల్లొంచి గెంటేయలేదంటే అదింకా అమాయకత్వం...."

"సరే—పద!" అన్నాడు శర్మ.

## 3

విశ్వం కుర్చీలో కూర్చున్నాడు. ఆయన కెదురుగా శివనాథ్ అనే సమవయస్కుడు కూర్చుని ఉన్నాడు.

"ఏమీ అనుకోకోయ్—ఈ వేళ్టి కక్కడికి రాలేను" అన్నాడు విశ్వం.

"నువ్వు రాకపోతే ఆటలో మజా వుండదు—"

అన్నాడు శివనాథ్.

"నిజమే — కానీ సుబ్రహ్మణ్యేశ్వరరావుగారింటికి డిన్నరుకి వెళ్ళకుండా యింట్లో బ్రిడ్జి ఆడ్డానికొస్తే యేం బాగుంటుంది?"

"కానీ నువ్వు డిన్నరుకి వెళ్ళడం లేదుగదా!"

"లేదనుకో.... నా కిలాంటి పార్టీ లిష్టముండదు. అందుకని వెళ్ళను. ఏ అనారోగ్యమో అని వంక పెడతాను. అలా వంక పెట్టాక యింట్లోనే వుండిపోవాలి. తర్వాత ఆయనకు తెలిస్తే బాగుండదు, అబద్ధమాడినా అతికినట్లుండాలి...."

"పోనీ మా యింట్లోనే ఆట పెడితే...."

"మా ఆవిడ సంగతి నీకు తెలుసుగా....ఏదో బయటకు వెళ్ళి ఆడడాని కొప్పుకుంటోందని సంతోషించాలంతే...."

శివనాథ్ నిరుత్సాహంగా లేచి—"సుబ్రహ్మణ్యేశ్వరరావు కూతురు పెళ్ళి కాదుగానీ మన ఆట కొచ్చింది. నాలుగో చెయ్యి దొరుకుతుందన్న గ్యారంటీ లేదు. దొరికినా నీ లాంటి చెయ్యి దొరకదు....—" అన్నాడు.

అప్పుడు గుమ్మం దగ్గర శాస్త్రి, శర్మ వున్నారు.

"సుబ్రమణ్యేశ్వరరావు దాకా ఎందుకు? ఈ శివనాథ్ లేకపోతే వాళ్ళింట్లోనే ఫోంచేయ్యొచ్చు. బ్రిడ్జి కోసం యేమయినా యిస్తాడీయన?" అన్నాడు శర్మ, శాస్త్రి చెవిలో.

"సరే—మనకు బ్రిడ్జి రాదుగా—...." అన్నాడు శాస్త్రి.

"దానికేముంది— నేర్చుకుందాం!"

"నేర్పుకుందాంలే—ముందీ రోజు సమస్య తీరా లిగా—...."

శివనాథ్ గుమ్మందాకా వచ్చి వీళ్ళనోసారి పలకరించి వెళ్ళిపోయాడు.

విశ్వం శాస్త్రినీ, శర్మనూ అభిమానంగా లోపలకు పిలిచాడు.

శర్మ తెల్లబోయాడు.

"ఏమిటి—కాఫీ తీసుకుంటారా....?" అన్నాడు విశ్వం.

"అబ్బే—అలవాటు లేదండి—...." అన్నాడు శర్మ.

కాఫీ, టీలు అలవాటు లేదన్నవాళ్ళకి—సాధారణంగా ఘనపదార్థం ప్లేటులో ముడుతుంది. అదే శర్మ ఆశ....

"అరే—నిలబడే ఉన్నారే — కూర్చోండి—" అన్నాడు విశ్వం.

ఇద్దరూ కూర్చున్నారు.

"ఇప్పుడే వస్తాను. మీరు కూర్చోండి" అంటూ విశ్వం లోపలకు వెళ్ళాడు.

"పాపం—నిజంగానే మంచివాడు, అమాయకుడు. ఈయన్ని మోసం చేయాలనిపించడంలేదు—" అన్నాడు శర్మ.

"ఎంతో ఆలోచించి గానీ నిర్ణయం తీసుకోకూడదు. తీసుకున్న నిర్ణయానికి కనీసం ఓ గంటైనా కట్టుబడి ఉండాలి. అదీకాక మనమీయన్ని మోసం చేయబోవడం లేదు—" అన్నాడు శాస్త్రి గంభీరంగా.

ఓ అయిదునిముషాల తర్వాత విశ్వం లోపల్నుంచి

తింగొచ్చాడు. శర్మ ఆశించినట్లాయన చేతిలో ప్లేటేమీ లేవు.

“ఇది నాకు కాఫీ టైము. మీరేమో తాగనంటిరి. ఒక్కణ్ణీ కూర్చుని మీ ఎదురుగా తాగడమేం బాగుంటుందీ—అందుకని లోపలకుపోయి తాగేసి వచ్చాను” అని—“ఏమిటీ—మొత్తం బకాయంతా తీర్చేస్తారా?” అన్నాడు విశ్వం.

“మేము బకాయి తీర్చడానికి వచ్చామని మీరెలా అనుకున్నారు?” అన్నాడు శాస్త్రి తెల్లబోయి.

“బాగుందోయ్—ఎవరిబ్బందులు వాళ్ళవి. సమయానికి డబ్బు చేతికందక బాకీ తీర్చడంలేదు. బాకీ తీర్చడంలేదని ముఖం చెల్లక నాకు కనిపించడం మానేశారు. మీరు పనిగట్టుకుని నా ఎదుట పడ్డారంటే—అందుకు బాకీ తీర్చడం మినహా కారణమేముంటుంది? ఇంకా యిప్పట్లో యివ్వలేమని చెప్పడానికి వస్తారనుకోను గదా!” అన్నాడు విశ్వం.

‘పాపం—ఈయన నిజంగా అమాయకుడు—’ అనుకున్నాడు శాస్త్రి పైకి మాత్రం—“ఓ ముఖ్యమైన పని మీదొచ్చామండి. అది మీకు శుభవార్త కాదు—” అన్నాడు.

విశ్వం కంగారుపడి—“ఏమిటిది?” అన్నాడు.

“మేమిద్దరం ప్రభుత్వం తరఫున పనిచేసే ఇంటెలిజెన్సు శాఖవాళ్ళం. ఇంతకాలం అది మీ దగ్గర కూడా రహస్యంగానే ఉంచాం. మాకు జీతాలందే యేర్పాటు అతిరహస్యం చేయబడడం వల్ల డబ్బుకు తరచుగా ఇబ్బంది పడుతూంటాం. ఇంతకీ అసలు సంగతేమిటంటే మీమీద మాకు చెడ్డ రిపోర్టులు వచ్చాయి. మీరు ప్రజావిద్రోహులతో

చేతులు కలుపుతున్నారని తెలిసింది—" అన్నాడు శాస్త్రి.

"అద్దె యివ్వలేక నన్నిలా బెదిరిస్తున్నారా?" అన్నాడు విశ్వం కోపంగా.

"ఇది బెదిరింపు కాదు—నిజం—...."

"ముందు నా అద్దె చెల్లించి గది ఖాళీ చేసి వెళ్ళండి—"

"అందుకేం అభ్యంతరం లేదు. కానీ నాలుగురోజుల తర్వాత మీరు జైల్లో వుంటే అందుకు నన్ను తప్పట్ట వద్దు. మంచివారనిపించి హెచ్చరించాలనుకున్నాను. ఆ పైన మీ యిష్టం—"

ముందు విశ్వం బెదరలేదు కానీ క్రమంగా ఆయనలో భయం చోటు చేసుకుంది—"మీకేమైనా ఋజువు లున్నాయా?"

"ఉన్నాయి—" అంటూ ఆహ్వానపత్రాలను గురించి చెప్పాడు శాస్త్రి.

"అదా?" అన్నాడు విశ్వం అదోలా.

"అదే—మీకు పెద్ద పెద్ద పార్టీలకే పిలుపులు వస్తున్నాయి. అందుకారణ మేమిటి? నగర ప్రముఖుల్లో మీకు ప్రాముఖ్యత ఎలా లభించింది?"

"ఇంకెక్కువ ప్రశ్నలు వేయకు. నా కొచ్చే ఆహ్వాన పత్రాల రహస్యం మీకు చెప్పేస్తాను. ఇంకెవరికీ చెప్ప కూడదు మరి—" అన్నాడు విశ్వం.

విశ్వం వారిచేత ఒట్టేయించుకుని అసలు రహస్యం చెప్పాడు.

ఆయన ఓ కంపెనీలో పని చేస్తున్నాడు. మేనేజరు

ఆయన పర్సనల్ సెక్రటరీ. మేనేజరూళ్ళో చాలా పలుకుబడి కలవాడు. ఆయనకొచ్చే ఆహ్వాన పత్రాలన్నీ ఓసారి చదివి అవతల పారేస్తాడు వాటిని విశ్వం సేకరించి—కవరు మార్చి—వాటిపై తన పేరు రాసుకుని—ఇంట్లో ప్రదర్శిస్తూ టాడు. అందువల్ల ఆయనకు మిత్రబృందంలో పలుకుబడి పెరుగుతోంది. పిలిచినా పార్టీలకు వెళ్ళడని కొందరూ, పిలిచేవాళ్ళందరూ పెద్ద పెద్దవాళ్ళని కొందరూ ఆయన్ను గురించి ఆశ్చర్యంగానూ గొప్పగానూ చెప్పుకుంటారు.

అంతా అతనిలాగానూ శాస్త్రికి నవ్వొచ్చింది. శర్మ మాత్రం గంభీరంగానే వున్నాడు. మనసులో మాత్రం—“అతని తగ్గేః నవ్వుకోవాలి—” అనుకున్నాడు.

“మీతో చాలాకాలంగా పరిచయమున్నది. మీరు మంచివారేనని మా నమ్మకం. అయితే యే నమ్మకానికైనా ఋజువుండాలి కాబట్టి—ఆ బల్లమీద కార్డిలాగివ్వండి—” అన్నాడు శాస్త్రి.

“కారణం?”

“దాన్ని పరిశీలించాలి. అందులో సీక్రెట్ కోడ్లేమీ లేవని ఋజువు చేసుకోవాలి. ఆ కార్డ్ద్వారా మీకు రహస్య సమాచారం అందించబడలేదని మా పరిశోధన చెబితే మేము మీపై మంచి రిపోర్టును రాసి పంపుతాం—” అన్నాడు శాస్త్రి.

విశ్వం బల్లమీద కార్డుతీసి శాస్త్రికి అందించాడు.

శాస్త్రి కార్డును పరిశీలించాడు

తెల్లని కార్డులో ఇలా వుంది.

సుబ్రహ్మణ్యేశ్వరరావు కూతురు పెళ్ళి సందర్భంగా విందుకు ఆహ్వానం.

రైలు తొమ్మిదిన్నరకు.

అప్రయత్నంగా శాస్త్రి రైలు మాసుకుని లేచి నిలబడ్డాడు.

"ఏమయింది?" అన్నాడు విశ్వం కంగారుగా.

"రైలువుతోంది?"

"దేనికి?"

"ఎందుకి—" అనబోయి ఆగిపోయాడు శాస్త్రి—"మా కవతల వేరే అసైన్ మెంటుంది. వెళ్ళాలి—...."

"ఆ కార్డును పరీక్షిస్తే నా గురించిన నిజమెలాగూ తెలుస్తుంది. అయితే ఓ చిన్న రిక్వెస్టు—" అన్నాడు విశ్వం.

"చెప్పండి—" అన్నాడు శాస్త్రి.

"నేనూ గూఢచారి పని చేయాలనుకుంటున్నాను. మీరు నన్ను అసిస్టెంట్ గా తీసుకోకూడదూ?"

శాస్త్రి ఆశ్చర్యంగా—"చక్కటి ఉద్యోగముంది. మీ కెందుకండీ ఈ గూఢచారి ఉద్యోగం!...." అన్నాడు.

"నాకూ ఓ సారి మా బావమరిదిని అనుమానించాలని వుంది.........మీరు నన్నుమానించి నట్లే!" అన్నాడు విశ్వం.

## 4

అది సుబ్రహ్మణ్యేశ్వరరావు మేడ.

మేడ చుట్టూ ఎత్తైన ప్రహరీగోడ.

ఆ గోడలో ఓ పెద్ద ఇనుప తలుపుల గేటు—

గేటు బార్లా తెరిచివుంది.

వచ్చేపోయే జనంతో అక్కడంతా కోలాహలంగా వుంది.

గేటు దాటితే పెద్ద ఆవరణ.

పూల తోటా వుంది—మైదానం లాంటి లానూ వుంది.

లాన్లో పెద్ద షామియానా.

శాస్త్రి. శర్మ షామియానా దగ్గరకు వచ్చారు.

అక్కడో యిద్దరు యువతులు వారిద్దనీ ఆప్యాయంగా పలకరించి రెండు చేతులు జోడించి నమస్కరించారు.

శాస్త్రి శర్మ ప్రతినమస్కారాలు చేశారు.

ఇంతిలో ఓ యువకుడా యువతుల వెనుక నుంచి ముందుకువచ్చి చేయి జాపాడు.

శాస్త్రి అతడి చేతిలో ఇన్విటేషన్ కార్డుంచాడు.

అతి డాశ్చర్యపోయి-"షేక్ హేండిస్తా రనుకున్నాను" అన్నాడు.

శాస్త్రి దెబ్బతిన్నాడు.

అక్కడున్నవాళ్ళలో ఇంకెవరూ కార్డులు కూడా తెచ్చినట్లు లేదు.

శర్మ శాస్త్రిని కూడా పట్టించుకోకుండా ముందడుగు వేశాడు.

షామియానా కింద పొడుగ్గా వున్నాయి బల్లలు. బల్లలపై ఖరీదైన గుడ్డలు కప్పారు. గుడ్డపై బేసిన్లలో ఫలహారాలు. ఫలహారాల పక్కన ప్లేట్లు.

శర్మ ప్లేటందుకున్నాడు.

అతడి కేం చేస్తున్నాడో తెలియడంలేదు.

ఆకలి....

శాస్త్రి ఇన్విటేషన్ కార్డు తీసుకున్నతడితో మాట్లాడుతున్నాడు. అతడు శాస్త్రిని వదలడంలేదు. తన గురించి

తేగ చెప్పాడుంటున్నాడు.

అతడు పెళ్ళికూతురు కజన్ బ్రదరట. మర్యాదలు చేయడం అతడి బాధ్యత అట. తన పెళ్ళికి వచ్చి యెవరు సంతృప్తిపడకపోయినా పెళ్ళికూతురు అతడినే తప్పు పడుతుందిట.

శాస్త్రి కబుర్లు వింటున్నాడు. వింటూ శర్మను చూస్తున్నాడు.

అతడికి శర్మంటే అసూయగా వుంది.

ఇంకెవరో వచ్చారు. అమ్మాయిలు వాళ్ళకి నమస్కరించారు.

"వెళ్ళి షేక్‌హాండివ్వండి—" అన్నాడు శాస్త్రి.

అతడు వెళ్ళాడు. శాస్త్రి ప్లేటువైపు దూకేశాడు.

తర్వాత కాసేపతడికి ప్రపంచం తెలియదు.

ఆకలి....ఆ బాధ అనుభవించినవాళ్ళకే తెలియాలి.

కాసేపటికే శాస్త్రికి ఆత్మారాముడు శాంతించాడు. శర్మను పలకరించాడు. శర్మ కూడా అప్పటికి తృప్తి చెందాడు. శాస్త్రిని కౌగలించుకొని—"యూ ఆర్ వండ్రఫుల్—" అన్నాడు.

శాస్త్రి మిత్రుడి చెవిలో—"ఇప్పుడేం చేద్దాం—" అన్నాడు.

"వెళ్ళిపోదాం—" అన్నాడు శర్మ.

అక్కడ యెవరూ యెవర్నీ పట్టించుకోవడంలేదు. వున్నవారందరూ భిన్న సంస్కృతుల్లో కనపడుతున్నారు. ఆ జనంలో ఇరుక్కోవడం కష్టమే ననిపించి—వెళ్ళిపోవడమే మంచిదనుకున్నాడు శాస్త్రి.

ఇద్దరూ బయల్దేరారు.

అప్పుడో చేయి శాస్త్రి భుజంమీద పడింది.

ఉలిక్కిపడి వెనక్కి తిరిగాడు శాస్త్రి.

"అప్పుడే వెళ్ళిపోతారేం బ్రదర్స్—" అన్నాడాయన.

ఆయన వాళ్ళని బ్రదర్సని పిలిచినా చూడ్డానికి వాళ్ళ నాన్నలాగున్నాడు.

బట్టతల—నెరిసిన మీసాలు—సఫారీ సూట్—అంబాసిడర్ బూట్.

చామనచాయ రంగు—తమాషా నవ్వు....

శాస్త్రి కాయన తమెందుకాపాలో తెలియలేదు. ప్రశ్నార్థకంగా చూశాడు.

ఆయన నవ్వి—"రండి—అలా కూర్చుందాం—" అన్నాడు.

అంతవరకూ అక్కడున్న ఇతర యేర్పాట్లు చూడనే లేదు వాళ్ళు.

దూరంగా పేము బల్లలు, నెయ్యర్సు—సెట్సు సెట్సుగా అమర్చివున్నాయి. ఒకో బల్లదగ్గర నాలుగేసి కుర్చీలు, ఎందరో అక్కడ కూర్చుని కబుర్లు చెప్పుకుంటున్నారు. కొందరు ప్లేట్లలో టిఫిన్ తింటున్నారు. కొందరికి విస్కీ వగైరాలు సర్వ్ చేస్తున్నారు కొందరు ఖరీదయిన సర్వర్లు.

"మాకు తాగే అలవాటు లేదు—" అన్నాడు శాస్త్రి.

"నాకు తాగే అలవాటుంది—" అన్నాడాయన.

రెండింటికీ సంబంధ మేమిటో శాస్త్రి కర్థంకాక పోయినా—"ఏయ్ శర్మా!" అన్నాడు.

శాస్త్రి ఆగిపోవడం చప్పుడు విని తెలుసుకుని తనూ ఆగిపోయినా శర్మ ముందుకే గానీ వెనక్కి చూడడం

లేదు. వెనకాల ఫలహారాలున్నాయి. వాటిని ఆరగించడం అయింది. ముందు సుందరాంగులున్నారు. ఆవిడ చూపులు చురుగ్గా వున్నాయి.

శాస్త్రి పిలుపు విని అతడు వెనక్కి తిరిగాడు.

ముగ్గురూ టేబిలు దగ్గరకు వెళ్ళి కూర్చున్నారు.

“నాకు మీరిద్దరూ చాలా నచ్చారు—” అన్నాడాయన.

“ఎందుకని?” అన్నాడు శాస్త్రి.

“ఇక్కడికి వొచ్చిన వాళ్ళని చూస్తున్నాను. చక్కటి విందు ఇది ఒక్కరు కూడా తిన్నగా తినలేదు సుతారంగా కాస్త తిని లేస్తున్నారు. మీ ఇద్దరు మాత్రం పది రోజులుంచి తిండి లేనివాళ్ళలా—చక్కగా భోంచేసి విందుకే సార్థకత తెచ్చారు....”

ఆయన జోక్ చేస్తున్నాడో, వెటకారం చేస్తున్నాడో మెచ్చుకుంటున్నాడో శాస్త్రికి తెలియాలేదు కానీ తాము తిన్న పద్ధతి ఆయన్నాకర్షించిందని తెలిసి అతడికి సిగ్గేసింది. శర్మ మాత్రం చుట్టూ వున్న సిగ్గుల మొగ్గలను చూస్తున్నాడు—ఆ సంభాషణలో జోక్యం చేసుకోకుండా.

“మిమ్మల్ని చూస్తే నా కెంతో ఆనందంగా వుంది. నా నాలిక కెన్నో రుచులున్నాయి కానీ రోజు కొక్క పూట మాత్రమే నేను భోంచేయాలి. అదీ పరిమితంగా. జబ్బు చేసేదాకా సుష్టుగా భోంచేసేవాణ్ణి మా యింట్లో నేను, మా నౌకర్లు మాత్రమే సుష్టుగా భోంచేస్తామని మా ఆవిడ వేళాకోళం ఆడుతూంటుంది. ఆవిడ తన ఫిగర్ పాడైపోతుందని తిండి తినదు. ఇద్దరమ్మాయిలు నాకు. ఇద్దరూ ఏడు మల్లెపూల ఎత్తు తూగుతారంటే.

ఇద్దరబ్బాయిలు—వాళ్ళతో కుచీపచీ అక్కర్లేదు కాలోరీలు లెక్క చూసుకుని భోంచేస్తారు అందుకే వాళ్ళంటే నాకు చిరాకు. ఎవరైనా తృప్తిగా భోంచేస్తూంటే చూడాలనుంటుంది. అలాంటివాళ్ళు నాకు పనివాళ్ళలోనూ, బిచ్చగాళ్ళలోనూ కనబడతారు. వాళ్ళను నేను చూడలేను. మీకులా నీటుగా కనపడాలి....” అని—“నా కోసం మీ రింకో రౌండ్ వేస్తారా—చూడాలని వుంది...” అన్నాడాయన.

ఇదేమైనా ప్రాక్టికల్ జోక్ కాదుగదా అని శాస్త్రికి అనుమానం కలిగింది. చెప్పాలంటే యింకో రౌండ్ వేయగల శక్తి అతడికుంది. ఓ క్షణం ఆలోచించి—“అ దూరంగా టేబిలు దగ్గర కూర్చున్నారూ—వాళ్ళను పిలవండి—వాళ్ళు మీ కోరిక తీర్చగలరు—” అన్నాడతడు.

ఆయన అటు చూశాడు.

అక్కడో లావుపాటి అమ్మాయి—ఇద్దరు లావుపాటి అబ్బాయిలు కూర్చున్నారు. అందరి చేతుల్లోనూ ప్లేట్లున్నాయి.

ఆయన కాసేపు వాళ్ళని గమనించి—“నీ సెన్సాఫ్ హ్యూమర్ మెచ్చుకుంటాను. కానీ వాళ్ళంటే నాకు నచ్చరు—” అన్నాడు.

“ఎందుకని?”

“వాళ్ళు విందుకి ఆహ్వానించబడలేదని నా నమ్మకం. ఎవరిదో ఆహ్వానంమీద వచ్చారు. అందులో సందేహం లేదు—....”

“మీ కెలా తెలుసు?”

చెప్పబోయేముందు ఆయన గల గలా నవ్వాడు. ఆ

నవ్వు విచిత్రంగానూ, భయంకరంగానూ ఉంది. దూరంగా టేబిలు దగ్గరున్న లావుపాటివాళ్ళు కూడా ఓసారి తిండి తినడం ఆపి అటు చూశారు.

శాస్త్రి ఆయనవంక ఆశ్చర్యంగా చూశాడు.

ఆయన అతికష్టమీద నవ్వాపుకుని—"పామియానాలో అడుగెట్టే ముందు వాళ్ళు కార్డు చూపించారు—...." అన్నాడు. మళ్ళీ ఆయనకు నవ్వొచ్చింది,

"చూపిస్తే యేం?"

"ఆహ్వానపత్రం అడ్మిట్ కార్డు కాదు—అది కూడా తీసుకురానవసరంలేదు.... నేనైతే నా కొచ్చిన ఇన్విటేషన్ కార్డ్సన్నీ నా సెక్రటరీ కిస్తూంటాను...." అన్నాడాయన.

"మరి సెక్రటరీ ఆ కార్డు తీసుకుని పార్టీకొస్తే...."

"సుబ్రహ్మణ్యేశ్వరరావు లాంటి వాళ్ళు విందిచ్చారంటే—ఓ వెయ్యిమంది ఎక్కువొచ్చినా బాధలేదు. అయినా రిసెప్షన్ దగ్గర ఇన్విటేషన్ కార్డుని అడ్మిట్ కార్డులా యిచ్చేవాళ్ళను చూడగానే తెలిసిపోతుంది—వాళ్ళా ఆహ్వానం ఎక్కణ్ణించో కొట్టుకొచ్చారని...." అన్నాడాయన.

తమను గురించి తెలిసే ఆయన ఆ మాట లంటున్నారని శాస్త్రికి అనుమానం వచ్చింది. ఎందుకైనా మంచిదని అతడు — "మీరు గజేంద్రరావుగారు కదూ....!" అన్నాడు.

ఆయన తెల్లబోయి—"మీ కెలా తెలుసు....?" అన్నాడు.

"మా కన్నీ తెలుస్తాయి. అందరూ తెలుస్తారు—...."

"నువ్వు సమానూ మాట మాట అంటున్నావు. నీ పక్కన కూర్చున్నతడు— బెల్లం కొట్టిన రాయిలా యేమీ మాట్లాడడేం!" అన్నాడు గజేంద్రరావు.

శాస్త్రి స్వరం తగ్గించి గజేంద్రరావువైపు వంగి— "అతడు అతిథులందర్నీ శ్రద్ధగా గమనిస్తున్నాడు—" అన్నాడు.

"ఎందుకు?"

"కాసేపట్లో యిక్కడో పెద్ద నేరం జరగబోతోంది—...."

గజేంద్రరా వాశ్చర్యంగా—"ఎవరు చెప్పారు?" అన్నాడు.

"ఎవరూ చెప్పకుండానే మాకన్నీ తెలుస్తాయి. జరగబోతున్న నేరాన్నాపడానికే మేమిక్కడకు వచ్చాం—" అన్నాడు శాస్త్రి.

"అలాగా" అన్నాడు గజేంద్రరావు.

సెక్రటరీకి కార్డు లిస్తానవగానే ఆయన విశ్వం ఫాన్ అయుంటాడని ఊహించాడు శాస్త్రి. గజేంద్రరావును చూడకపోయినా ఆయన గురించి చాలా విన్నాడతడు విశ్వం ద్వారా.

శాస్త్రి కిప్పుడు సంతోషంగా వుంది. గజేంద్రరావు కిప్పుడు తామంటే శాస్త సదభిప్రాయం కలిగినట్లుంది.

గజేంద్రరావు కాసేపు మాట్లాడలేదు. తర్వాత నెమ్మదిగా— "జరగబోతున్న నేరమేమిటో మీకు తెలుసా?" అన్నాడు.

"తెలిసింది కూడా తెలుసని చెప్పం మేము...."

గజేంద్రరావు చేయి జాపి శాస్త్రికి షేక్‌హాండి

చ్చాడు—"మిమ్మల్ని కలుసుకున్నందుకు నాకు చాలా
సంతోషంగా ఉంది—"

"మా రాకకు సంతోషించేవారు ఒకరైనా యిక్క-
డున్నందుకు నా కెంతో సంతోషంగా ఉంది—" అన్నాడు
శాస్త్రి ఆయనతో కరచాలనం చేస్తూ.

"మీ రిద్దరూ యిక్కడే కూర్చోండి—నే నిప్పుడే
వస్తాను—" అని గజేంద్రరావు అక్కణ్ణించి లేచాడు.

ఆయన వెళ్ళగానే శాస్త్రి శర్మ భుజం తట్టి—
"గజేంద్రరావుగారు వెళ్ళిపోయిన విధానం చూస్తుంటే
ఆయనే యిక్కడేదో నేరం చేయడానికి వచ్చినట్లుంది"
అన్నాడు.

శర్మ శాస్త్రివైపుకి తిరిగి—"పోనీ లెద్దూ—ఆయన
కారుమీద యిక్కడకు వచ్చాము. విందు సుబ్రహ్మణ్యేశ్వ
రావుదే అయినా, కారు విశ్వమిచ్చినా, మనం గజేంద్ర
రావు ఉప్పు తిన్నట్లే లెక్క. ఆయనకేమీ హాని తల
పెట్టకద్దు—" అన్నాడు శర్మ.

"అయితే మా సంభాషణంతా విన్నావా?"

"అన్నీ విన్నాను. కానీ దానిగురించి లోతుగా ఆలో
చించలేదు. రేపటి ఆకలి గురించే నా ఆలోచనంతా!"
అన్నాడు శర్మ.

## 5

గజేంద్రరావు శాస్త్రి శర్మలను వదిలిపెట్టి దూరంగా
కనపడుతున్న ఓ మనిషి దగ్గరకు వెళ్ళాడు

అతడు నల్లటి నలుపు. బట్టలు తెల్లటి తెలుపు.

గజేంద్రరావును చూసి అతడు నవ్వాడు. అప్పుడు
పళ్ళు తెల్లగా మెరిశాయి.

"పాల్సన్—నీతో మాట్లాడాలి!" అన్నాడు గజేంద్ర

రావు.

ఇద్దరూ కాస్త దూరంగా వెళ్లారు.

"శరత్ రావడానికింకా ఎంత టైముంది?" అన్నాడు గజేంద్రరావు.

"అరగంట— ...."

"రావద్దని చెప్పగలవా?" అన్నాడు గజేంద్రరావు.

"ఎందుకు?" అన్నాడు పాల్సన్ ఆశ్చర్యంగా.

"శరత్ యిక్కడకు వస్తాడని యింకెవరికయినా తెలుసా?"

"తెలియదు!"

"తెలుసు...."

"ఎవరికి?"

"అదే మనం తెలుసుకోవాలి. కానీ ఈలోగా శరత్ యిక్కడకు రాకుండా ఆపాలి!"

"అసలేం జరిగిందో చెప్పండి...."

"శరత్ కొన్ని రహస్యపత్రాలు తెస్తాడు. వాటి కోసం మనంకాక మరో ముఠా కూడా ప్రయత్నిస్తోందని నీకు తెలుసు. వాళ్ళో యిద్దరు మనుషుల్ని పంపారని నా అనుమానం— ...."

"మీ అనుమానానికి ఆధారం ...."

"ఇక్కడేదో నేరం జరుగుతుందనీ అది ఆపడానికే వచ్చామనీ యిద్దరు మనుషులన్నారు. వాళ్ళు పోలీసుల మనుషుల్లా లేరు. మనకు తెలియకుండా వచ్చే పోలీసు మనుషులెవరూ ఉండరుగదా— వాళ్ళు మన శత్రువుల ముఠావాళ్ళే అయుండాలి—"

"అంతా మీ అనుమానమేమో!"

"కాదు. వాళ్ళలో ఒకడు చాలా నర్మగర్భంగా

మాట్లాడుతున్నాడు. నా పేరు చెప్పాడు. తన రాక నాకు సంతోషం కలిగించేది కాదన్నట్లు పరోక్షంగా సూచించాడు—"

పాల్సన్ ఆయన చెప్పిందంతా శ్రద్ధగా విని—"మన మిప్పుడు శరత్‌ని ఆపలేము. అందుకని వాళ్ళనే ఒక పట్టు పట్టాలి—...." అన్నాడు.

"శరత్ నెందుకాపలేము?"

"అతనెక్కడ బయల్దేరుతున్నదీ మనకు తెలియదు. ఏ వేషంలో వున్నదీ మనకు తెలియదు. హఠాత్తుగా వచ్చి కోడ్ వర్డ్ చెబుతాడు. నేను సిగరెట్ అడుగుతాను. అతడు పెట్టె నాకిస్తాడు. నే నతడికి సిగర్ లైటరిస్తాను. లైటర్లో వజ్రాలుంటాయి. సిగరెట్ పెట్టెలో రహస్య పత్రాల మైక్రో ఫిల్ముంటుంది—...." అన్నాడు పాల్సన్.

"సరే—నువ్వు సిగరెట్ పెట్టె నాకిస్తావు. ఇదంతా నాకు తెలిసిందే—...." అని—"నే నిచ్చిన లైటరు భద్రంగా వుంది కదా—...." అన్నాడు గజేంద్ర రావు.

"ఉందికానీ—కాసేపది మీ దగ్గరే వుంచండి. నే నా యిద్దరి సంగతీ చూసుకుని వస్తాను. ఈలోగా శరత్ వస్తే—అతడికి మీరూ తెలుసుగదా—...." అన్నాడు పాల్సన్.

"ఊఁ" అంటూ గజేంద్రరావు శాస్త్రినీ, శర్మనూ మారాన్నుంచే అతడికి చూపించి—"వాళ్ళ నేంచేస్తావు?" అన్నాడు.

"సూదిగుచ్చి చంపేస్తాను—" అన్నాడు పాల్సన్.

"ఇక్కడే—ఈ విందులోనా!"

"లేదు—మాటలతో మభ్యపెట్టి బయటకు తీసుకుని వడతాను—...."

"వాళ్ళు రాకపోతే?"

పాల్సన్ నవ్వి—"నా పద్ధతులు నావి. వాళ్ళను ఫినిష్ చేసి వస్తాను—..." అన్నాడు.

"రసాభాస జరక్కుండా చూడు—...." అన్నాడు గజేంద్రరావు.

పాల్సన్ జేబులోంచి ఓ లైటర్ తీసి గజేంద్రరావు కందించాడు.

గజేంద్రరావు జేబులోంచి సిగరెట్ తీశాడు. లైటర్లో వెలిగించుకుని—"థాంక్స్!" అన్నాడు.

# 6

అది ఒక అందమైన గది.

గదిలో ఒంటరిగా ఉందో అందమైన అమ్మాయి.

ఆమె పేరు శ్రీరమ.

ఆమె యెంతో అందంగా ఉంది. అంత అందమైన ముఖంలో దిగులుండటం ఎలాంటివారికైనా దిగులు కలిగిస్తుంది.

శ్రీరమ సుబ్రహ్మణ్యేశ్వరరావు కూతురు. పెళ్ళి కూతురు.

ఆమె వంటి నిండా ఖరీదయిన బట్టలు, నగలు ఉన్నాయి

ఆమె మనసులో ఉన్న సుబ్బారావు పేదవాడు, కటిక పేదవాడు.

బియ్యే ప్యాసై ఉద్యోగం లేకుండా తిరుగుతున్నాడు. శ్రీరమ కనిపించి నాలుగు డబ్బులిస్తే తప్ప కాఫీ కూడా దొరకదతడికి.

సుబ్బారావుకు తల్లి తండ్రి, ఇద్దగన్నలు, ముగ్గురక్కలు, ఓ చెల్లి వున్నారు.

శ్రీరమ సుబ్బారావును పెళ్ళి చేసుకుంటే వారందరినీ నాశనం చేస్తానని సుబ్రహ్మణ్యేశ్వరరావు సుబ్బారావు తండ్రిని బెదిరించాడు. శ్రీరమను మర్చిపోకపోతే తిండీ తిప్పలూ వుండదని సుబ్బారావును తల్లీ తండ్రీ బెదిరించారు.

శ్రీరమ కంతా తెలిసింది. సుబ్బారావు తంటిమీద చేయి పడితే మాటలు దక్కవని ఆమె తండ్రికి చెప్పింది. తను ఆత్మహత్య చేసుకుంటానంది.

వాళ్ళిద్దరి పెళ్ళికీ తన అభ్యంతరం లేదని తండ్రి అన్నాడు.

సుబ్బారావు తన తలిదండ్రుల క్షేమంకోరి శ్రీరమను పెళ్ళి చేసుకోనని చెప్పాడు. తలిదండ్రులపై కోపం కొద్దీ ఇంట్లో తిండి మానేశాడు.

సుబ్రహ్మణ్యేశ్వరరావు శ్రీరమకు తన అంతస్థుకు తగ్గ సంబంధం చూశాడు. ఇప్పుడామెకు పెళ్ళి అయిపోతోంది.

పెళ్ళికి ముందు విందిది.

రాత్రి ఒంటి గంటకు పెళ్ళి ముహూర్తం.

అతిథుల సల్లాపపర్చడానికి సుబ్రహ్మణ్యేశ్వరరావెన్నో యేర్పాట్లు చేశాడు. ఎన్నో లక్షలు ఖర్చుపెడుతున్నాడు.

ఆయన కూతురు మనసులో మాత్రం ఉల్లాసం లేదు.

శాసేపామె ఒంటరితనాన్ని కోరింది. మనసులోని బరువంతా దింపుకుని తేలిక చేసుకుంటానంది.

కానీ క్రమంగా ఆమె హృదయం మరింత బరువెక్క

తోంది.

ఆ సమయంలో ఆ గదిలో ఆమె ముందు ప్రత్యక్ష మయ్యాడు సుబ్బారావు.

శ్రీరమ తెల్లబోయి చూసింది—"నువ్వేనా—ఎలా వచ్చావు?"

సుబ్బారావు వికటంగా నవ్వాడు—"నేను నీ కోసం రాలేదు. నీ నగల కోసం వచ్చాను—"

"అంటే?"

"నీకూ నాకూ పెళ్ళి జరిగితే నా కుటుంబం సర్వ నాశనమైపోతుంది. అది నేను భరించలేను. నీకు డబ్బుంది. ఆ డబ్బుతో నువ్వు నన్ను మర్చిపోగలవు. నేనూ నిన్ను మరిచిపోవాలనుకుంటున్నాను. అందుకు డబ్బు కావాలి. నగలు ఒలిచి కింద పెట్టు—...." అన్నాడు సుబ్బారావు.

"నా మనసు మార్చడానికి మా నాన్న నిన్నిలా నాటకమాడమన్నాడా?"

"నువ్వేలాగనుకున్నా నాకు బాధలేదు. మీ నాన్న ఈ ప్రపంచంలో ఎవరినైనా ఆడించగలడు. నన్నాడిస్తే ఆశ్చర్యమేమీ లేదు. నాకు నీ నగలు కావాలి—...."

"నగ లెందుకు—క్యాష్ యిస్తాను—పట్టుకు పో—...."

"వద్దు—నగలే కావాలి....నీ నగలే కావాలి. ఆ నగ లను ఓ పెట్టెలో పెట్టుకొని నిన్నుగా భావిస్తూ ఆనం దిస్తాను...." అన్నాడు సుబ్బారావు.

"నన్నుగా భావించి ఆనందించడానికి నగ లెందుకు? నా ఫోటో చాలదూ?" అంది శ్రీరమ.

"చాలదు. నీ ఫోటో విలువైనది కావచ్చు. ఇతరులు దానికి విలువివ్వరు. నేను నిన్నుగా భావించే వస్తువుకు

ఇతరులు కూడా విలువనివ్వాలి, అందుకే నగలడుగుతున్నాను....”

“ఎలావచ్చావ్ ఈ గదిలోకి!”

“మనసుంటే మార్గముంటుంది. బాత్రూంలో నుంచి వచ్చాను....”

“ఎవరూ నిన్నడ్డగించలేదా?”

“నే నిక్కడకు వస్తున్నట్లు మా నాన్నకూ, మీ నాన్నకూ తెలుసు....”

శ్రీరమ ఆశ్చర్యపడింది.

సుబ్బారావు వివరించాడు—“నీకు నామీద ప్రేమ లేదని ఇద్దరూ నన్ను సవాలు చేశారు. నేను నీ నగల నడిగి తెస్తానని సవాలు చేశాను. ఇది మన ప్రేమకు పరీక్ష. ఈ పరీక్ష యెందుకో తెలుసా? నాన్నకు నీ నగలు కావాలి. మీ నాన్న నన్ను దొంగను చేయాలనుకుంటున్నాడు. అయితే ప్రేమ ఈ యిద్దర్నించీ నన్ను రక్షించగలదు. నువ్వేమో నాకు నగలిస్తావు. నాన్న తెల్లబోతాడు. మీ నాన్న నాపై దొంగతనం నేరం మోపితే—అది నువ్వే యిచ్చావంటావు. మీ నాన్న దెబ్బతింటాడు—”

“నా ప్రేమ నేను ఋజువు చేసుకుంటాను. మరి నీ ప్రేమెలా ఋజువౌతుంది?”

“నువ్విచ్చిన నగలు నేను సొమ్ము చేసుకోను. వాటిని అలాగే ఆరాధిస్తాను. ఆ విధంగా నా ప్రేమ మా నాన్నను దెబ్బతీస్తుంది. దొంగతనం నేరం మోపబడుతుందని తెలిసీ నీ నగలు నేను తీసుకుంటాను. అది మీ నాన్నకు నా ప్రేమను తెలియజెప్పుతుంది—....”

“శభాష్!” అంది శ్రీరమ — “ఇంతగా నన్ను

ప్రేమించినవాడివి — ధైర్యంగా నన్ను పెళ్ళాడ వచ్చుగా—"

"నా ప్రేమ నా జీవితంతో ఆడుకోవచ్చు. ఇతరుల జీవితాలతో ఆడుకోరాదు...."

శ్రీరమ నగలు ఒలిచి మూటగట్టి—"వీటిలో నా అంతరాత్మ కలిసింది. నేను కట్టెగా మిగిలిపోతున్నాను" అంది.

"థాంక్స్ శ్రీరమా!" అని సుబ్బారావు మూట అందుకొని బాత్రూంవైపు నడిచాడు.

"అగు—చక్కని రాజమార్గముండగా—...." అంది శ్రీరమ.

"నీ యింటికి రాజమార్గాన వచ్చే అవకాశం నాకు లేదు. దొంగలా వచ్చాను. దొంగలాగే వెళ్ళి పోతాను—...." అంటూ సుబ్బారావు బాత్రూంవైపు వెళ్ళాడు.

శ్రీరమ కదలలేదు. అతడు వెడుతున్నవైపే చూసి భారంగా నిట్టూర్చింది. ఇప్పుడేం జరుగుతుంది? అతణ్ని పోలీసులు పట్టుకుంటారా?"

"రేపు సుబ్బారావు యోగక్షేమాలు విచారించాలి" అని ఆమె అనుకొంటూండగా—అక్కడికి సుబ్రహ్మణ్యేశ్వరరావు వచ్చాడు. ఆయనననుసరించే శ్రీరమ తల్లికూడా వచ్చింది.

"కాసేపు నన్ను ఒంటరిగా వదలమన్నాను కదా!" అంది శ్రీరమ.

"మీ అమ్మ నిన్నిప్పుడు అసలు నగలతో అలంకరించాలని వచ్చింది—...."

"అంటే?" అంది శ్రీరమ తెల్లబోయి.

"సుబ్బారావు నిన్ను కలుసుకోవాలనుకొన్నాడు. రాజమార్గంలో అతడు కలుసుకోనేందుకు వీలులే దన్నాను. తనపై నీకు గల ప్రేమను ఋజువు చేస్తా నన్నాడు. అందుకే నీకు ముందు నకిలీ నగలు తగిలించడం జరిగింది. ఇప్పుడు సుబ్బారావు నీనిచ్చిన నగలు పరీక్ష చేయిస్తే—నీ ప్రేమ నకిలీదని తెలుసుకుని గుండె పగిలి చస్తాడు...."

సుబ్రహ్మణ్యేశ్వరరావు విలన్లా నవ్వుతున్నాడు.

తల్లి శ్రీరమకు నగ అలంకరిస్తోంది.

శ్రీరమ ప్రామ్పడిపోయింది.

# 7

"మీ ఆరోగ్యం బాగాలేదు. మీరు నాతో బయటకు రండి—" అన్నాడు పాల్సన్ శాస్త్రి, శర్మల నుద్దేశించి.

"మేము గామూ—" అన్నాడు శాస్త్రి అతడివంక ఆశ్చర్యంగా చూస్తూ.

"అదిగో — అటు చూడండి....ఆయన డాక్టరు. ఇక్కడికి వచ్చినవారిలో మీ ప్రవర్తన బాగోలేదనీ—అందుకు అనారోగ్యం కారణమనీ ఆయన చెప్పాడు. మీరు నాతో బయటకు రాకపోతే—మీ రెవరోనని ఆరా తీయాల్సి వస్తుంది...." అన్నాడు పాల్సన్.

"బయటకు వచ్చి యేం చేయాలి....?" అన్నాడు శర్మ.

"ఎక్కడ తెలుసుకునే వివరా లక్కడే తెలుసుకోవాలి...." అన్నాడు పాల్సన్.

శాస్త్రి, శర్మ—యిద్దరూ పాల్సన్తో కలిసి ఆ భవనం ఆవరణ నుంచి బయటపడ్డారు. ఇద్దరూ అతని

ననుసరిస్తూ సందులూ గొందులూ తిరిగి ఓ చిన్న దాబా యింట్లో ప్రవేశించారు.

"కూర్చోండి—" అన్నాడు పాల్సన్.

అక్కడో రెండు కుర్చీలున్నాయి. ఇద్దరూ కూర్చున్నారు.

"మీ రెవరో చెప్పండి!"

"నా పేరు శాస్త్రి, ఇతడి పేరు శర్మ ..."

"ఇంకా... "

"అంతకు మించి వివరాలుంటే బాగుండునని మాకూ వుంది. మా వివరాలంతే...."

"మీ చేత ఎలా చెప్పించాలో నాకు తెలుసు...." అంటూ పాల్సన్ చొక్కా విప్పి ఓసారి ఛాతీ ఉబ్బించాడు.

మరుక్షణంలో అతడు నేలమీద వున్నాడు.

"డియర్ మిస్టర్ ఎక్స్! ఇప్పుడు నీ వివరాలు చెప్పు. ....లేదా చెప్పించాల్సి వుంటుంది...." అన్నాడు శర్మ తీవ్రంగా.

ముందు చెప్పకపోయినా పాల్సన్ గజేంద్రరావు వ్యవహారం గురించి కొంత చెప్పకతప్పలేదు.

శాస్త్రి, శర్మ అతడినక్కడే కుర్చీకి బంధించి మళ్ళీ పార్టీకి వెళ్ళారు. అయితే మామూలుగా కాదు—మారువేషాల్లో.

శాస్త్రి తిన్నగా గజేంద్రరావు వద్దకు వెళ్ళాడు. పాల్సన్ దగ్గర తెలుసుకున్న కోడ్ వర్డ్ చెప్పాడు.

"శరత్!" అన్నాడు గజేంద్రరా వుత్సాహంగా.

గజేంద్రరావతడికి రైటరిచ్చి—అతడిచ్చిన సిగరెట్ పెట్టె తీసుకొన్నాడు. అప్పుడు శాస్త్రి నెమ్మదిగా—

"కాసేపట్లో యిక్కడికి మరో శరత్ రావచ్చు—" అన్నాడు.

"అదేమిటి?"

"మన పథకం శత్రువులకు తెలిసింది. వాళ్ళు తెలివిగా మీ దగ్గర వజ్రాలు కాజేయాలనుకొంటున్నారు. ఆ మనిషిని పట్టడానికి మన మిక్కడే పొంచి ఉండాలి—...."

"ఎలా పడతాం?"

"చాలా సింపుల్—మరో శరత్ వచ్చి కోడ్ వర్డ్ చెబుతాడు. వాణ్ణి మనం తెలివిగా ట్రాప్ చేసి బయటకు తీసుకుని వెళ్ళాలి...."

సరే నన్నాడు గజేంద్రరావు.

సరిగ్గా పది నిముషాలకు వచ్చాడు నిజం శరత్.

అతడు ముస్లిం వేషంలో వున్నాడు. కోడ్ వర్డు చెప్పగానే గజేంద్రరా వతణ్ణి గుర్తించాడు. శాస్త్రిని పిలిచాడు.

శాస్త్రి చేయిజాపి—"హలో—శరత్!" అన్నాడు.

"నా పేరు శరత్ కాదు—సలీం—" అన్నాడు శరత్.

"అయాం సారీ—నిన్ను పాల్సన్ తీసుకుని రమ్మన్నాడు ..."

"ఎందుకు?"

శాస్త్రి శరత్ చెవిలో—"గజేంద్రరావుని నమ్మడానికి లేదుట. రహస్యపత్రాలు తనకే అందజేయా లన్నాడు. తనిక్కడ లేడు...." అన్నాడు.

"ఎక్కడున్నాడు?" అన్నాడు శరత్.

"నాతో వస్తే చూపిస్తాను—...." అన్నాడు.

శరత్ అనుమానంగా-"నిన్నెలా నమ్మడం" అన్నాడు.

శాస్త్రి జేబులోంచి లైటర్ తీశాడు.

అది చూస్తూనే శరత్ ముఖం వెలిగింది.

ఉత్సాహంగా—'అదే' అన్నాడు.

"పాల్సన్ గుర్తుగా వుంటుందని నాకిది యిచ్చాడు. నువ్వు నాతో రా—పాల్సన్ దగ్గరే యివి తీసుకుందువు గాని—...." అన్నాడు శాస్త్రి.

శరత్ సంతోషంగా అంగీకరించాడు.

శాస్త్రి అక్కణ్ణించి కదులుతూ గజేంద్రరావుకు కన్నుకొట్టాడు. గజేంద్రరావు ఉత్సాహంగా తనూ కన్నుకొట్టాడు.

## 8

శాస్త్రి, శరత్ కలిసి వెళ్ళడం చూశాడు శర్మ.

"ఈ దెబ్బతో గజేంద్రరావు ఆట కట్టవుతుంది—" అనుకొన్నాడు శర్మ. గజేంద్రరావు కంపెనీ ఉద్యోగిగా వుంటూ—ఎందరో సంఘవిద్రోహులకు సాయపడుతూ—సంఘంలో తన హోదానూ, అంతస్తునూ పెంచుకుంటున్నాడు. పాల్సన్, శరత్‌లను శాస్త్రి పోలీసుల కప్పగించాడంటే అందులోంచి చాలా రహస్యాలు బయట పడతాయి.

"ఇప్పుడు నే నేం చేయాలి....?" అనుకొన్నాడు శర్మ.

శాస్త్రి చెప్పినప్రకారం గజేంద్రరావు నో కంట కని పెడుతూ వే రెవరితోనూ చేతులు కలపకుండా చూడాలి.

శర్మ గజేంద్రరావునే గమనించసాగాడు.

మోసపోయానని ఎరుగని గజేంద్రరావు—మోసం

నుంచి తప్పించుకున్నా ననుకుంటూ మహా ఉత్సాహంగా తిరుగుతున్నాడు.

అప్పుడు షామియానాలో మేజిక్ ప్రదర్శన ప్రారంభ మయింది.

చాలామంది మెజీషియన్ చుట్టూ చేరారు. అందులో గజేంద్రరావూ వున్నాడు. శర్మకు మాత్రం ఆయన్ని కని పెట్టాలో, మెజీషియన్ను కనిపెట్టాలో తెలియడంలేదు.

మెజీషియన్ చేస్తున్న ట్రిక్స్ చాలా గొప్పగా వున్నాయి. అయినా శర్మ గజేంద్రరావునే కనిపెడు తున్నాడు.

గజేంద్రరావు ట్రిక్స్ చూస్తున్నాడు. ఆయన చాలా హుషారుగా వున్నాడు.

ఉన్నట్టుండి మెజీషియన్ ఆయన్ని పిలిచాడు.

గజేంద్రరావు వెళ్లాడు.

మెజీషియన్ ఆయన్నొ అద్దాలతలుపుల పెట్టెలో వుంచాడు. పెట్టెను నాలుగువైపులా తిప్పాడు.

అన్ని వైపుల నుంచీ గజేంద్రరావు కనబడుతున్నాడు.

మెజీషియన్ ఆయన్ను పేరడిగాడు.

"గజేంద్రరావు—" అన్నా డాయన.

"అయితే మీరిప్పుడు గజేంద్రమోక్షం చూస్తారు—" అన్నాడు మెజీషియన్. "భగవంతు డీయనకోసం ఈ అద్దాల పెట్టెని పంపించాడు...." అంటూ అద్దాల పెట్టెకి నాలుగువైపులా తెరలు దించాడు. మరోసారి అద్దాల పెట్టెని నాలుగువైపులా తిప్పాడు.

అప్పుడు తెరలు తొలగించాడు.

పెట్టె ఖాళీగా వుంది.

అంతా చప్పట్లు కొట్టారు.

కానీ గజేంద్రరావు వెనక్కురాలేదు.

మెజీషియన్ మరో ట్రిక్కు చేస్తున్నాడు.

శర్మ హుటాహుటిన నడిచి మెజీషియన్ దగ్గర వెళ్ళి—"గజేంద్రరావుగారేమయ్యారు?" అన్నాడు.

"ఎందుకు?" అన్నాడు మెజీషియన్.

"నా కాయనతో పనుంది—...."

"మోక్ష ప్రాప్తి కలిగినవారు మనకిక కనపడరు—" అన్నాడు మెజీషియన్.

అంతా నవ్వారు.

"నాకూ మోక్షప్రాప్తిని కలిగించు—" అన్నాడు శర్మ.

"అందు కీశ్వరుడి పిలుపు రావాలి—" అన్నాడు మెజీషియన్.

మళ్ళీ అంతా నవ్వారు.

శర్మ లాభంలేదని వెనక్కు వచ్చేశాడు.

మెజీషియన్ చాలా చురుకయినవాడు. అతడు చాలా తెలివిగా మాట్లాడుతున్నాడు, చురుకుదనం మాటల్లోనూ, చేతల్లోనూ, చేతుల్లోనూ కూడా వుంది.

శర్మ ఆలోచిస్తున్నాడు.

సాధారణంగా మెజీషియన్లు తాము మాయం చేసిన వ్యక్తిని తిరిగి రప్పిస్తారు. గజేంద్రరావు విషయంలో అలా జరుగలేదు.

కావాలని తెలివిగా ఆయన్ను మాయం చేయడం జరిగిందా?

పెద్దవాళ్ళతో పిలుపందినపుడు— అక్కడ కలుసుకుందుకు వచ్చేవారందరూ తమ కార్యకలాపాలు కొనసాగించుకోవాలని వస్తున్నారు.

గజేంద్రరావు పెద్ద వ్యవహారాల్లో వున్నాడు.

ఇప్పుడు తను సంపాదించిన రహస్య పత్రాల నాయనేం చేయాలనుకుంటున్నాడు? ఏ దేశాని కమ్మాలనుకుంటున్నాడు?

ఇవన్నీ కని పెట్టాలనుకున్నాడు తను.

ఆయన మాయమయ్యాడు.

ఆ నాయన్ను కని పెడుతున్న సైవరికయినా తెలిసిందా?

అప్పుడే శర్మ భుజంమీద ఎవరిదో చేయి పడింది.

అతడు వెనక్కి తిరిగాడు.

లావుగా, పొట్టిగా వున్నాడతడు. శర్మ భుజంమీద చేయి వేయడంకోసం కాబోలు—అతడో చిన్న స్టూలు మీద నిలబడి వున్నాడు.

శర్మ అతడివంక ప్రశ్నార్థకంగా చూశాడు.

"గజేంద్రరావును చూస్తావా?"

"ఊఁ."

"నాతో రా—"

శర్మ అతడి ననుసరించాడు.

అతడు శర్మను సరాసరి సుబ్రహ్మణ్యేశ్వరరావింటిలోనికి తీసుకుని వెళ్ళాడు.

శర్మ ఆశ్చర్యపడ్డాడు. అతడి కిల్లంతా తెలిసినట్లే కన పడుతోంది.

ఇద్దరూ మేడమీద ఓ గదిలోనికి వెళ్ళారు.

గదిలో రెండు కుర్చీలున్నాయి.

ఇద్దరూ చెరో కుర్చీలో కూర్చున్నారు.

"ఎవర్నువ్వు?" అన్నాడు పొట్టి వ్యక్తి.

"ఇంటెలిజెన్సు మనిషిని— ...."

"వాళ్ళంతా నాకు తెలుసు. నువ్వు వాళ్ళలో మనిషివి కాదు—...."

శర్మ నవ్వి—"లోకంలోని తెలివైనవాళ్ళందరూ నీకు తెలిసినట్లు మాట్లాడుతున్నావే—....ఇంటెలిజెన్సంటే నా ఉద్దేశ్యం—తెలివున్న మనిషి ...." అన్నాడు.

"అదే నిజమైతే—తెలివికి ఫుల్ స్టాప్ పెట్టడం నాకు చేతనవును—...."

"ఎలా?"

"ఈ పెన్ తో—...." అంటూ జేబులోంచి అతడొక పెన్ తీశాడు,

శర్మ అతడి చేతిలోని పెన్ వంక చూశాడు. మామూలు పెన్నులాగే వుంది—"పెన్ను తెలివికి ఫుల్ స్టాపెలా పడుతుంది?"

"మీట నొక్కితే సయనైడ్ పిన్ ఒకటి నీ గుండెల్లోకి దిగుతుంది. వెంటనే నీ ప్రాణాలు పోతాయి. తెలివికి ఫుల్ స్టాఫ్ పడుతుంది—...."

"ఎవరు నువ్వు?" అన్నాడు శర్మ,

"గజేంద్రరావును కలుసుకోవాలంటే నీకూ మోక్షం కావాలి. అది నీకిప్పించాలనే వచ్చాను...." అన్నాడు పొట్టి వ్యక్తి.

"గజేంద్రరావును కలుసుకోవాలంటే తప్పా?"

"ఊఁ."

"ఎందుకు?"

"మొసలి ఒకటి అతడి కాళ్ళను పట్టుకుంది. అతడిని విడిపించాలనుకున్న వాళ్ళనా మొసలి పట్టుకుంటుంది...."

"ఎవరా మొసలి?"

"నేనే!" అన్నాడతడు—"మొసలికి నీటిలో బల

ముంటుంది. విష్ణుచక్రంమించి దానినెవరూ యేమీ చేయ లేరు. నేను మొసలినైతే ఈ ప్రపంచమంతా నాకు జల మయమే!"

"నాకు సరిగ్గా చెప్పు...."

"గజేంద్రరావు పెద్ద కంపెనీలో మేనేజరు. సమా జంలో అతడికి గొప్ప హోదా వుంది. పలుకుబడి వుంది. అతడినో పెద్ద పట్టు పట్టాను నేను. అతడిద్వారా యెన్నో పనులు సాధిస్తున్నాను. అతడికిది ఇష్టంలేదు. తప్పించు కుందామని చూస్తున్నాడు. అతడిని నేను వెయ్యి కళ్ళతో కనిపెడుతున్నాను...." అన్నాడా పొట్టి వ్యక్తి.

"అయితే?"

"గజేంద్రరావుకీ రోజు చాలా ముఖ్యమైన రహస్య పత్రాలందాయి. వాటిని మేము విదేశాలకమ్మబోతున్నాం. గజేంద్రరావు కిది ఇష్టంలేదు. ఆ రహస్య పత్రాలను మా కందకుండా చేస్తాడని నా నమ్మకం .. అందుకే గజేంద్ర రావుని వెయ్యి కళ్ళతో కనిపెడుతున్నాను. అయితే అతడు తన్ను తాను రక్షించుకునేందుకు నిన్ను నియమిం చాడని నా నమ్మకం."

శర్మ నవ్వి—"ఏడిసినట్లుంది—" అన్నాడు.

"నువ్వాతణ్ని వెయ్యికళ్ళతో కనిపెడుతున్నావు. మ్యాజిక్ షో చూడ్డంకూడా మానేసి అతణ్ని కనిపెడు తున్నావంటే—అతడే నిన్ను నియమించుకుని వుండాలి. తన దగ్గరున్న రహస్యపత్రాలనతడు మాకిచ్చే ఉద్దేశ్యంలో లేడు. వాటి రక్షణకోసమే అతడు నిన్ను తన్ను కని పెట్టమన్నాడు. అందుకే నేనతణ్ని మెఫిస్టోఫిలిస్ ద్వారా మాయంచేసి నా దగ్గరకు రప్పించుకున్నాను. మెఫిస్టోఫి యస్ కూడా మా మనిషి. నువ్వతణ్ని గజేంద్రరావు

గురించి అడగడంలో నీమీద నాకున్న అనుమానం రూఢి అయింది. అందుకే నిన్నూ ఓ పట్టు పట్టాలనుకున్నాను...."

"పట్టయితే చేతో పట్టాలి...." అన్నాడు శర్మ.

"ఆ సరదా కూడా తీరుస్తాను. కానీ ముందు నాకీ విషయం చెప్పు. ఆ రహస్యపత్రాల మైక్రో ఫిల్ము ఏం చేశావో చెప్పు...."

"అది గజేంద్రరావు దగ్గరుండాలి. గజేంద్రరావు మీ దగ్గరున్నాడు...."

"గజేంద్రరావు మా దగ్గరే వున్నాడు. మైక్రోఫిల్ము అతడిదగ్గరలేదు. అతడు తానేమీ ఎరుగనంటున్నాడు...." అన్నాడు పొట్టివ్యక్తి.

"నాకూ ఏమీ తెలియదు...."

"తెలియకపోతే చెప్పిస్తాను...." అంటూ పొట్టివ్యక్తి లేచి నిలబడ్డాడు.

శర్మ అతడివంకే చూస్తున్నాడు.

పొట్టివ్యక్తి వెనక్కడుగులు వేసుకుంటూ గుమ్మం దాకా వెళ్ళి—"ఈ గది తలుపులు నేను తెరిస్తే తప్ప తెరుచుకోవు. ఇక్కడే ఉండి ఆలోచించుకో—ఓ గంట టైమిస్తున్నాను. మళ్ళీ వచ్చేసరికి మైక్రోఫిల్ము గురించిన సమాచారం నాక్కావాలి ..." అన్నాడు.

"నే నివ్వకపోతే?"

"తిండీ నీళ్ళూ లేకుండా ఈ గదిలోనే అంతమవుతావు—...." అంటూ పొట్టివ్యక్తి గుమ్మం బయటకు వెళ్ళి తలుపులు వేశాడు.

## 9

శర్మ గదంతా కలయదిరిగాడు. గోడలు మినహాయించి వేరే ఏమీ లేవు—తలుపులుగానీ—గుమ్మాలుగానీ! వున్న

ఒక్క గుమ్మం తలుపులూ మూసి వున్నాయి.

ఆ తలుపులు తెరవాలని శాయశక్తులా ప్రయత్నించాడతడు. లాభంలేకపోయింది.

మరోగంటదాకా ఆ గదిలో బందీగా పడివుండక తప్పదు.

శర్మ కుర్చీలో కూర్చుని ఏం జరిగిందో మననం చేసుకున్నాడు.

కేవలం ఆకలితీర్చుకోవడంకోసం-ఈ పార్టీ కొచ్చారు. అక్కడ గజేంద్రరావు తగిలాడు. ఆయన తమను పరోక్షంగా పరిహాసించాడు. ఆయన్ను భయపెట్టాలని తమ గురించి అబద్ధం చెప్పాడు. పాల్సన్ వచ్చాడు. ఓ పెద్ద వ్యవహారం బయటపడింది. శాస్త్రి పాల్సన్నీ, శరత్ నీ పోలీసుల కప్పగించాలని వెళ్ళాడు ఈలోగా పాటి వ్యక్తి తననను మానించి ఈ గదిలో బంధించాడు. అతడు తలుపులు తీస్తే తప్ప తానిక్కడినించి బయటపడలేడు.

ఒకవేళ శాస్త్రి మైక్రోఫిల్ముల్ని పోలీసులకందజేయగానే—పోలీసులు రంగంలోకి దిగితే—పాటి వ్యక్తికి మైక్రోఫిల్ములు పోలీసుల పాలయ్యాయని తెలిసిపోతే,

అప్పుడిక అతడు తన నీ గదిలోంచి బయటకు రప్పించడు.

అతడు తన నిక్కడ బంధించిన విషయం యెవరికీ తెలియదు.

ఇది సుబ్రహ్మణ్యేశ్వరరావిల్లు. అంటే ఈ వ్యవహారాలన్నింటిలోనూ ఆయన హస్తముంది.

ఈ గదిలోంచి బయటపడడమెలా?

శర్మ గదినంతా క్షుణ్ణంగా పరిశీలిస్తున్నాడు.

గోడలు తెల్లగా వున్నాయి. ఎక్కడా చిన్న మచ్చ

కూడా లేదు.

నేలమీద కార్పెట్ లేదు కానీ — మొజాయిక్ ఫ్లోరింగ్.

శర్మ ఫ్లోరింగ్ నే క్షుణ్ణంగా పరిశీలించసాగాడు.

అక్కడేమీ కనపడడంలేదు.

చివరికి శర్మ విసిగిపోయి మళ్ళీ కుర్చీలో కూర్చున్నాడు. అతడి శరీరం తిన్నగా వుండడంలేదు. అసహనంతో ఊగుతోంది.

అప్పుడు శర్మ ఓ విచిత్రం గమనించాడు.

మామూలు పేము కుర్చీలవి. తానెంత కదిలినా కుర్చీ కదలడంలేదు. అంటే వాటిని నేలలోకి తాపడం చేసి వుండాలి. ఎందుకు? శర్మ కుర్చీలోంచి లేచాడు. కుర్చీని కదపాలని చూశాడు.

కుర్చీ కదలడంలేదు.

శర్మ తన బలాన్నంతా ఉపయోగించి కుర్చీని కదిపాడు. మొత్తంమీద కుర్చీ కదిలింది. కుర్చీ కదుల్తూంటే యేదో చప్పుడయింది.

శర్మ చప్పుడయినవైపుగా తిరిగాడు.

ఆ పక్కగా గోడలో మనిషి పట్టేటంత మార్గమేర్పడింది.

"హాక్రే—" అనుకున్నాడు శర్మ.

ఒక్కక్షణంలో అతడా మార్గంలోంచి బయటపడ్డాడు.

అదింకో గది....

ఆ గదిలో....

శర్మ ఉలిక్కిపడ్డాడు.

సీలింగ్ నుంచి పాలిన్ వ్రేలాడుతోంది. ఫ్యాన్‌కో

చీర వ్రేలాడుతోంది. చీరతో యువతి వ్రేలాడుతోంది.

ఆమె గిలగిల తన్నుకుంటోంది.

ఎవరో ఆమెను ఫ్యాన్ కు ఉరితీశారు.

శర్మ ఆలస్యం చేయలేదు.

గదిలోని బల్లను జరిపి — దానిమీద ఓ కుర్చీ వేసి — దానిమీదకూ తాను వెళ్ళి — ఫ్యాన్ కు కట్టిన చీరను విప్పాడు.

ఆమె దబ్బున నేలమీద పడింది.

శర్మ ఆమె గొంతు ముడిని విప్పాడు.

మనిషి నవవధువులా అలంకరించుకుని వుంది.

ఏ దుర్మార్గుడామెను ఉరితీశాడో?

శర్మ ఆమె నాడి పరీక్షించాడు.

ఇంకా ప్రాణం పోలేదు.

కాసేపటిదామెకు పచారాలు చేశాడు.

ఆమెకు స్పృహ వచ్చింది. ఎదురుగా శర్మను చూసి-"ఎవర్నువ్వు?" అంది.

అతడు క్లుప్తంగా తన గురించి చెప్పాడు.

"నా పేరు శ్రీరమ. నేను సుబ్రహ్మణ్యేశ్వరరావుగారి కూతుర్ని. నన్ను నాకంటే గొప్పగా యెవరూ రక్షించలేరు...." అందామె.

"కానీ నేను రక్షించాను...."

"రక్షించి పొరపాటు చేశావు. నా ఆత్మహత్యా ప్రయత్నాన్ని వ్యర్థం చేశావు—"

"ఆత్మహత్యా?" అతడాశ్చర్యపడ్డాడు.

శ్రీరమ క్లుప్తంగా తన కథ చెప్పి—"ఎలాగో అలా అన్నింటికీ సరిపెట్టుకుందామనుకున్నాను. కానీ నా తండ్రి నన్ను నకిలీ నగలతో మోసగించాడు. ఆ మోసాన్ని

సుబ్బారావు నమ్మాడు. అతడి కా విషయం తెలియజెప్పే అవకాశం నాకు లేదు....ఇష్టంలేని పెళ్ళి—తండ్రి చేసిన మోసం—ప్రియుడు నన్ను వంచకివనుకోవడం ఎమోషనల్ గా—నన్ను బలహీనురాలిని చేసింది. ఆత్మహత్యకు పాల్పడ్డాను. నువ్వు రక్షించావని నాకానందంగా లేదు."

"నీకూ సుబ్బారావుకూ పెళ్ళి జరిపిస్తాను. అప్పుడానందంగా వుంటావా?"

"మా పెళ్ళికి సుబ్బారావే ఒప్పుకోడు...." అంది శ్రీరమ.

"సుబ్బారావొప్పుకున్నా — నువ్వు శ్రీరమ పెళ్ళి జరిపించలేవు...." అన్న గొంతు వెనుకనుంచి వినపడింది.

శర్మ వెనక్కు తిరిగాడు.

అక్కడ పొట్టి వ్యక్తి నిలబడి వున్నాడు.

అతడి చేతిలో పెన్ను మెరుస్తోంది.

శర్మ ఆలస్యం చేయలేదు. ఆతడు చటుక్కున శ్రీరమ వెనక్కు వెళ్ళి—"ఈమె నాకు రక్షాకవచం—నువ్వు నన్నిప్పుడేమీ చేయలేవు...." అన్నాడు.

"పిచ్చి పిచ్చి వేషాలు వేయకు...." అన్నాడు పొట్టి వ్యక్తి—"నీ రక్షణాకవచం నేలకూలడానికెంతో సేపు పట్టదు...."

"అంటే?"

"నా మైక్రో ఫిల్ములకంటె శ్రీరమ ఎక్కువకాదు నాకు...." అతడింకా యేదో అనబోతుండగా—అతడి చేతిలోని పెన్ను జారి కిందపడింది.

శర్మ వెనక్కు తిరిగాడు.

పోలీసులు!

# 10

శాస్త్రి, శర్మ బీచి దగ్గర కూర్చున్నారు.

"మీలో యేదో విశేషముంది శాస్త్రీ! విందుకు వెళ్ళిన పనేమిటి? చేసిన పనేమిటి?" అన్నాడు.

"ఆ మైక్రోఫిల్ములో — దేశ క్షేమానికి హానికలిగించే విశేషాలున్నాయట. అవి విదేశాలు చేరిందంటే — ఎంత ప్రమాదమో మాటల్లో చెప్పడం కష్టం .... బహుశా పాకిస్తాన్, బంగ్లాదేశ్, శ్రీలంక — యూక ఉమ్మడిగా మనపై దండెత్తి వుండేవారు. వారికి ఆన్ని దేశాల మద్దతూ వుండేది...." అన్నాడు శాస్త్రి.

"తల్లి భారతమాతకు మనవల్ల సాయం అందవలసి వుంది. మనం నిమిత్తమాత్రులం...." అన్నాడు శర్మ.

"ఈ నేరంలో సుబ్రహ్మణ్యేశ్వరరావు కాబోయే అల్లుడి పాలుందని తెలియడంతో — జరగబోయే పెళ్ళి ఆగిపోయింది. సుబ్రహ్మణ్యేశ్వరరావు ఈ విషయంలో యెంతగా అప్సెట్ అయ్యాడంటే — సుబ్బారావుతో పెళ్ళి జరిపించడానికి ఒప్పుకున్నాడు ...."

"ఒప్పుకోక ఏం చేస్తాడు? ఇద్దరూ తమ ప్రేమను గొప్పగా ఋజువు చేసుకున్నారు. సుబ్బారావు నకిలీ నగలతో పోలీస్టేషన్‌కు వెళ్ళి — మున్ముందు నన్ను అనుమానించవద్దు. నా ప్రియురాలు తన జ్ఞాపకార్థం నాకివి ఇచ్చింది. ఆమె జ్ఞాపకార్థం నేనివి వుంచుకుంటున్నాను — కావాలంటే అడిగి తెలుసుకోండి — అని సూటిగా ధైర్యంగా చెప్పాడు. ప్రియుడిని మోసం చేయలేనని తలచి శ్రీరమ తన జీవితాన్ని అంతం చేసుకోబోయింది — ఇంతకుమించి ప్రేమకేం సాక్ష్యం కావాలి...."

"అవును....అన్నట్లు ఈ ప్రేమికుల పెళ్ళిలో కూడా మన హస్తముంది...."

"అందుకేగా—మనకు సుబ్రహ్మణ్యేశ్వరరావు పాతిక వేల రూపాయలకు చెక్కిచ్చాడు....తన కూతురి ప్రాణాలు నిలబెట్టినందుకు తానిచ్చినది నిజానికి చాలా చిన్న మొత్తం అయితే మనకున్న పరిస్థితిబట్టే దాని విలువ వుంటుంది. తిండికి లేక చస్తున్న సమయంలో—పాతిక వేలంటే మాటలు కాదు మనకి..." అన్నాడు శర్మ.

"సుబ్రహ్మణ్యేశ్వరరావు విలువకట్టింది కూతురి ప్రాణాలకి కాదు.... నువ్వు పొట్టి వ్యక్తి చేత ఆయన ఇంట్లోనే బంధింపబడ్డ విషయం చెప్పకుండా ఉన్నందుకు.... ఈ వ్యవహారంలో ఆయనకూ సంబంధం వుందనడంలో సందేహం లేదు. కొంత పోలీసులకు డబ్బిచ్చి—కొంత మనలాంటి వాళ్ళ నోరు మూయించి—తప్పించుకుంటున్నాడు...."

"అంటే దేశద్రోహంలో కూడా ఉన్నాడంటావా? అలాంటప్పుడు మనం ఉపేక్షించకూడదు...."

"డియర్ ఫ్రెండ్.... దేశంలో నాలుగు డబ్బులు కూడబెట్టిన ప్రతివాడూ దేశద్రోహికిందే లెక్క....ఎందుకంటే దేశంలో నూటికి తొంభైమందికి తిండికికూడా గతిలేదు...."

"అయితే పాతిక వేలు తీసుకున్న మనమూ దేశద్రోహులమే అవుతాము. ఈ డబ్బుతో ఆకలిగా వున్న వాళ్ళందరికీ అన్నదానాలు చేద్దామా?"

"అలా ఎన్నాళ్ళు చేయగలం? ఆ బాధ్యత మనది కాదు. దేశనాయకులు, ధర్మదాతలు, మతప్రవక్తలు—ఎందరో వాళ్ళని చూసి కన్నీళ్ళు కార్చి—తమ బ్రతుకులు మామూలుగా సాగదీస్తున్నారు. మనమూ అంతే చేద్దాం.

మరోసారి ఆకలిబాధ—కనీసం మనకుండకూడదు...."

శర్మ యేదో అనబోతుండగా పరుగున ఓ వ్యక్తి వచ్చి వారి ముందాగాడు.

ఆయన నగేంద్రరావు.

"మీ కారణంగా నాకు మోక్షం లభించాలి. మీ సాక్ష్యమే నా నిర్దోషిత్వాన్ని ఋజువు చేస్తుంది—" అన్నాడు నగేంద్రరావు.

"మీరు నిర్దోషులా?" అన్నారు శాస్త్రి, శర్మ ఏక కంఠంతో.

"అవును—నా భార్య, చెల్లెలు, కుమార్తె—వీరి నగ్న చిత్రాలు పబ్లిక్ చేస్తామని బెదిరించి నాచేత అవినీతి కరమైన పనులు చేయిస్తోందొక ముఠా. సమాచారం చూసి ఆ ముఠాని బయట పెట్టాలని చూస్తున్నాను. నా సెక్రటరీ విశ్వం నాకు కబురు పంపాడు—ఎవరో ఇంటెలిజెన్సు వాళ్ళు—నా ఇన్విటేషన్ కార్డు తన దగ్గర్నుంచి తీసుకున్నారని. ఆయన సమాచారంతో నేను మిమ్మల్ని గుర్తించి—మీరు నిజంగా ఇంటిలిజెన్సు అయితే మీ సహకారం తీసుకోవాలనుకున్నాను. నా సహకారంతో నే మీకు మైక్రోఫిల్ములు వచ్చాయి...."

"ఇలాంటివి నమ్మడానికి మేము చిన్నపిల్లలం కాదు" - అన్నాడు శాస్త్రి.

"ఒక ఋజువుంది. పాల్సన్ తెలివితక్కువవాడు కాదు. తన్ను బంధించినపుడు—అతడు మీకు చెప్పిన కోడ్ వాక్యం తప్పు. ఆ విధంగా నేను మిమ్మల్ని గుర్తించగలనని అతడి ఆశ. కానీ నే నా అవకాశాన్నుపయోగించుకొని—మిమ్మల్ని నమ్మినట్లు నటించాను. మీరు చెప్పిన కోడ్ వర్డు యేమిటో నాకు తప్ప ఎవరికీ తెలియదు

కదా! అందుకని మురా వ్యక్తులకు నామీద అనుమానం రాదు...."

శాస్త్రి, శర్మ—ఇద్దరూ తెల్లబోయారు.

పాల్సన్ నించి కోడ్ వర్డు తెలుసుకున్నారు తాము. గజేంద్రరావు సహకరించాకపోతే తాము — విరోధి వ్యూహ్యంలో అతి సులభంగా చిక్కుకో నేవారు.

"మీరు కోరిన సాక్ష్యమిస్తాం, మీకు మోక్షం కలిగిస్తాం...." అన్నాడు శాస్త్రి

శాస్త్రి, శర్మల సాక్ష్యాధారంతో—బెయిలుమీద విడదలైన గజేంద్రరావు—ఆ తర్వాత శాశ్వతంగానే కేసులబారినుండి బయటపడ్డాడు. అయితే సంవత్సర కాలం జెయిలు శిక్షమాత్రం ఆయనకు తప్పనిసరయింది.

జైల్లో వున్నప్పటికీ—తనకు అప్పుడే మోక్షప్రాప్తి కలిగినట్లే ఫీలవుతున్నాడు గజేంద్రరావు.

—: అయిపోయింది :—

# అడవి రాజు

## బొమ్మిడి అచ్చారావు

"కాట్రేనికోన ఏజెన్సీ ప్రాంతంలో 'ఎపిడెమిక్' అవుట్ బ్రేకయింది. ఇంతవరకు మన వైద్యశాస్త్ర పరిధిలోకి రాని కొత్తరకం భయంకర విషజ్వరం! దాని పేరు కూడా బహుశా మనమే నిర్ణయించాలేమో! వెంటనే ఓ మెడికల్ టీమ్ కాట్రేనికోన వెళ్లాలి! అందుకే అర్జంటు సర్క్యులర్ మీద ఈ మీటింగ్ యేర్పాటు చేశాను" అన్నాడు, డి.ఎమ్. అండ్ హెచ్.ఓ. (జిల్లా వైద్య ఆరోగ్యాధికారి).

సమావేశమయిన అరవై మంది ప్రాథమికారోగ్య కేంద్రాల్లో పనిచేసే మెడికల్ ఆఫీసర్లు, ఆయన చెప్పేది శ్రద్ధగా వింటున్నారు.

"ఇప్పటివరకు ఎన్ని కేసులు రిపోర్టయ్యాయి సర్?" అనడిగాడో మెడికల్ ఆఫీసరు. అతని పేరు తీర్థానాథ్ అందరూ డాక్టర్ నాథ్ అని పిలుస్తారు. మంచి అనుభవమున్న డాక్టరు. కేసును డయాగ్నోస్ చేయటంలో సిద్ధ

హా కుంతు.

"అగత్తై నాలుగు కేసులు రిపోర్టయ్యాయి. అందులో నలభై యెనిమిది మంది జ్వరం అటాక్ అయిన నలభై యెనిమిది గంటల్లో ఒళ్ళంతా పసుపుపచ్చ రంగుకు తిరిగి చని పోయారు. తక్కిన పదహారు కేసుల్లో తొమ్మిదిమంది వివిధ అవయవాలు చచ్చుపడి జీవచ్ఛవాలయిపోయారు.

ఆరు కేసులు మెంటల్ డిప్రెషన్‌కి లోనైతే ఒకడు 'సిరోసిస్ ఆఫ్ లివర్'తో ఇవాళో రేపో అన్నట్టు న్నాడు. తక్కిన వివరాలు కాప్రేనికోన పి. హెచ్. సి. మెడికల్ ఆఫీసర్స్ చెప్తారు" అన్నాడు డి. ఎమ్. హెచ్ ఓ.

కాప్రేనికోన మెడికల్ ఆఫీసర్స్ సంజీవ్, జయ దేవ్ లేచి కేసు స్వభావస్వరూపాల గురించి వివరంగా చెప్పారు:

కాప్రేనికోన యిప్పుడిప్పుడే అభివృద్ధి చెందుతున్న ఏజెన్సీ ప్రాంతం. దానికి సమీపంలో వున్న మారేడు మిల్లి, చట్రవాడ, కె.డి. పేట వంటి ఏజెన్సీలకన్న అటవీ సంపదకు పేరెన్నికగన్నది.

ఇటీవల అకస్మాత్తుగా కాప్రేనికోన గూడేల్లో పేరు తెలియని ఓ రకమైన విషజ్వరం మహామ్మారిలా వ్యాపించింది.

మొదట ఒళ్ళునొప్పులు, తలనొప్పితో మొదలవు తుంది. ఇరవై నాలుగ్గంటల్లో జ్వర తీవ్రత గణనీయంగా పెరిగిపోతుంది. ఆ జ్వరం మలేరియా కన్నా చాలా తీవ్ర స్థాయిలో వణుకు, చలితో కూడి వస్తుంది. నలభైయెని మిది గంటల్లో ఒళ్ళంతా పసుపుముద్ద లాగా మారి పోతుంది. జుట్టుతో పాటు పసుపు రంగుకి తిరిగి పోతుంది.

రోగి విపరీతమైన దాహంతో, గుండె దడ, ఆయాసంతో బాధపడతారు. ఆఖరుగా మెదడులోని నరాలు చిట్లి హేమరేజ్ తో ప్రాణాలు వదులుతారు.

వైద్యచరిత్ర కందని ఈ వింతరోగం భయంకరమైన అంటువ్యాధి కావటంవల్ల చాలా తక్కువ వ్యవధలో గూడేలకి గూడేలని నాశనం చేసేస్తోంది. నూటికి తొంభై కేసుల్లో మరణం సంభవిస్తే ఆ తక్కిన పది శాతం వికలాంగులగానో, పిచ్చివాళ్ళగానో మారిపోతున్నారు.

డాక్టర్ సంజీవ్, జయదేవ్ లు యెంత శ్రమపడ్డా రోగంబారిపడ్డ వాళ్ళను మృత్యుముఖంనుంచి తప్పించలేక పోతున్నారు. వెంటనే హుటాహుటిన జిల్లా వైద్య ఆరోగ్య శాఖాధికారికి 'ఎపిడెమిక్' (ఒకేసారి యెక్కువమందికి వ్యాపించే వ్యాధి) గురించి తెలియచేశారు.

దాని ఫలితంగానే ఇరవై నాలుగు గంటల్లో వైద్యాధికారుల అత్యవసర సమావేశం యేర్పాటు చేయబడింది.

"మీ లాబ్ టెక్నిషియన్ లతో వ్యాధి సోకిన వాళ్ళకు రక్తపరీక్ష, మూత్రపరీక్ష వగయిరా టెస్ట్స చేయించారా?" ఓ మెడికల్ ఆఫీసర్ — సంజీవ్, జయదేవ్ లను ప్రశ్నించాడు.

"చేయించాం. కాని యెలాంటి బాక్టీరియా కూడా ట్రేస్ అవుట్ కాలేదు. వైరస్ డిసీస్ అని నిర్ణయించాం."

"నా ఉద్దేశంలో యిది జాండిస్ (పచ్చకామెర్లు) సంబంధితమైనది కావచ్చు ననుకొంటున్నాను. వైల్

పాట్స్ బైల్ పిగ్మెంట్స్, యూరిన్‌లో కనిపించలేదా?"
డాక్టర్ నాథ్ ప్రశ్నించాడు.

సంజీవ్ సమాధానం చెప్పాడు. "జాండిస్‌ని డయాగ్నోసిస్ చేయటం కష్టంకాదు. యూరిన్‌లో అవేమీ దొరకలేదు. 'సిరోసిస్ ఆఫ్ లివర్' కంప్లెయింట్ అరవై నాలుగు మందిలోను ఒక్కడిలోనే కనిపించింది. తక్కిన వాళ్ళలో లివర్ ఎన్లార్జి కాలేదు. నార్మల్ సైజులోనే వుంది."

ఆ తర్వాత రెండు కేస్‌లలో ముప్ఫయిమంది డాక్టర్లు, పదిమంది రిజర్వు ఎపిడెమిక్ యూనిట్ స్టాఫ్ మెంబర్స్‌ని, అవసరమయిన మందుల్ని తీసుకుని కాట్రేనికోన బయలు దేరారు.

## 2

కాట్రేనికోన చేరేసరికి మరో ముప్ఫయిమందికి విష జ్వరం సోకి, అందులో ఇరవై నాలుగుమంది చివరి క్షణాల్లో ఉన్నారు.

డాక్టర్ల కృషితో ఆరుగుర్ని మాత్రం రక్షించగలిగారు. కాని ఆయిదుగురికి అంగవైకల్యం తప్పలేదు. ఒక్కడు మాత్రం స్వల్పవైకల్యంతో చావు తప్పించుకో గలిగాడు.

ముప్ఫయిమంది డాక్టర్లలోనూ డాక్టర్ నాథ్‌లాంటి మెరికల్లాంటి డాక్టర్లు ఎనిమిదిమంది వున్నారు.

అందులో డాక్టర్ విఠల్, డాక్టర్ వర్మ, డాక్టర్ సురేఖ, డాక్టర్ లతీఫ్ ప్రముఖులు.

రెండు కేసులు పరీక్షించేసరికి, అది పచ్చకామెర్లు గాని, మరెలాంటి కామెర్ల రోగంగాని కాదని నిర్ధారణ చేసుకున్నారు వాళ్ళు.

"ఈ ఫీవర్ రాకుండా నిరోధించటానికి మనం చెయ్యగలిగిందేమైనా వుందా అన్నది సురేఖ.

"అసలు రోగనివారణ కాకుండా ట్రీట్‌మెంటు కూడా సాధ్యంకాదు. ఇక ప్రివెంటివ్ మెజర్స్ గాని, ప్రికాషనరీ మెజర్స్‌గాని ఏం తీసుకుంటాం? ఎలా తీసుకుంటాం?" అన్నాడు నాథ్.

సరిగ్గా అప్పుడే డాక్టర్ల బృందం కూచునివున్న ప్రాథమికారోగ్య కేంద్రం ఆవరణలో నిలిపి వున్న, మందులున్న వేన్ ఒక్కసారిగా భగ్గున మండిపోవటం మొదలెట్టింది.

అందరూ నిర్ఘాంతపోయి చూశారు.

అక్కడ ఫైర్ యింజన్లుండటానికి అవకాశంలేదు. ఒక్కోసారి గూడేలకి గూడేలు పరశురామ ప్రీతి అవుతుంటే. ఆర్పటానికి నీళ్ళచుక్క కూడా లేక కళ్లప్పగించి చూస్తూ ఉండిపోవటం ఆ గిరిజనులకు అలవాటే.

కాని యిప్పుడు జరుగుతున్నది కొన్ని లక్షల రూపాయల మందుల నష్టం! వేన్ కూడా యెందుకూ పనికిరాదు.

సంజీవ్, జయదేవ్‌ల ఆదేశంమీద పి. హెచ్. సి. ఆవరణలో వున్న నూతి నుంచి నీళ్ళు తోడి మంటల నడుపులోకి తేవటానికి ప్రయత్నించారు గాని సాధ్యపడలేదు.

మంటల నడుపులోకి తెచ్చేసరికి మందులన్నీ మాడి మసిబొగ్గులై పోయాయి. వేన్ తిరిగి బాగుచేయించుకోవటానికి వీల్లేనంత దారుణంగా దెబ్బతిని పోయింది.

మందులన్నీ పి. హెచ్. సి. స్టోర్సులో భద్రపరచాలనుకుంటుండగా జరిగింది అనుకోని ఈ ఘోర ప్రమాదం

నిట్టనిలువునా పీకవరకు మునిగిపోయిన ఈ అడవి ప్రాంతంలోని నూటయిరవై గూడేల్లోని పదహారు వేల గిరిజనుల ప్రాణాలకి భద్రత లేకుండా పోయింది. ఈ మందులుంటే, ఆ వ్యాధి యేదయినాగాని, దాని తీవ్రతను మరింత పెరక్కుండా కొంతవరకైనా నిరోధించవచ్చును.

అసలు అగ్నిప్రమాదమెలా సంభవించింది? డాక్టర్లందరు అక్కడే వున్నారు. పి. హెచ్. సి. స్టాఫ్‌తో బాటు, మామూలుగా ఒ.పి (O.P.)కి హాజరయ్యే సాధారణ రోగులున్నారు. ఇందరి సముఖంలో జరిగింది ఘోరమైన అగ్నిప్రమాదం! ఎలా జరిగింది? ఎలా? ఎలా?

డాక్టర్లందర్నీ సంభ్రమాశ్చర్యాల్లో ముంచెత్తి, తామెదుర్కోబోయే విషజ్వర క్రిమికంటే దారుణమైన మనుషులెవరో కావాలని తలపెట్టిన దుశ్చర్యగా తోచింది.

జయదేవ్ జరిగిన విషయం వెంటనే డి.ఎమ్.ఎచ్.వో.కి టెలిగ్రామిచ్చాడు. పోలీస్ స్టేషన్‌కి రిపోర్టు పంపించాడు.

తాము తలపెట్టిన బృహత్కార్యానికిది పెద్ద అపశకునంలా, ఆటకంలా తోచించి డాక్టర్ల బృందానికి.

ప్రమాదకారణాలు ట్రేస్ కాలేదు. అయితే ఇంతలోనే మరో ప్రమాదం విరుచుకుపడింది. రామన్న గూడెంలో విషజ్వరం తగిలి ఒకేసారి నలభై మంది అస్వస్థులైనట్టు రిపోర్టు వచ్చింది.

డాక్టర్ల బృందం వెంటనే రెండో వేన్‌లో అక్కడికి అయిదు కిలోమీటర్ల దూరంలో వున్న రామన్నగూడెం బయల్దేరింది.

## 3

మూడు కిలోమీటర్లు వేన్ సాఫీగా నడిచింది. అక్కడినుంచి అంతా ఎగుడు దిగుడు దారి. వేన్ లోపలికి వెళ్ళటానికి వీల్లేనంత సన్నని దారి, కచ్చాదారి, తప్పని సరిగా నడిచి వెళ్ళాల్సిందే!

తప్పనిసరిగా నడవ మొదలెట్టారంతా. పి. హెచ్. సి. సిబ్బంది ముందుదారి చూపుతుండగా అందరు ముళ్ళ కంచెల్ని, మేకల్లా మొన తేలివున్న రాళ్ళని దాటుకుంటూ అతి ప్రయాసతో నడుస్తున్నారు.

ముందు నడుస్తున్న డాక్టర్ లతీఫ్ చిన్నగా కేక పెట్టాడు. చిన్న కేకే అయినా అది చావుకేకలా తోచింది అందరికీ!

అదిరిపడి అటు చూశారు.

జగ్రున జారిపోతున్నాడు లతీఫ్! అక్కడ అడుగు కూడా కనపడనంత లోతుగా వున్న లోయ వుంది.

లతీఫ్ కాలు ఓ చిన్న రాయిమీదపడి స్లిప్ అయింది. తననితాను నిలదొక్కుకొనేలోపల జారుడు మొదలై, మహావేగంగా లోయవైపు దొర్లిపోయాడు.

పి. హెచ్. సి. అటెండరు అతన్ని ఆపటానికి ప్రయత్నం చేయటంలో తనూ అతనితోబాటు దొర్లిపోయాడు.

రెండు నిముషాల తర్వాత అక్కడున్న వాళ్ళందరి గుండెలు అవిసిపోయేలా రెండు చావుకేకలు వినిపించాయి.

మొదటిది లతీఫ్‌ది, రెండోది అటెండర్‌ది.

కొన్ని వందలమీటర్ల దిగువవున్న లోయలో పడి పోయారిద్దరు.

వెంటవున్న డాక్టర్ల బృందం, పి. హెచ్. సి. సిబ్బంది నిర్ఘాంతపోయి, జరిగిపోయిన ఘోరానికి సాక్షులుగా

దిక్కుతోచక అలాగే నిల్చుని చూస్తూండిపోయారు!

తమతో అంతదాకా సజీవంగా మసలిన డాక్టరు, అటెండరు కళ్ళముందే బలైపోతే ఆ నిజాన్ని జీర్ణించుకోవటానికి చాలా టైంపట్టింది వాళ్ళకు.

గుబారు చెట్లమీద ఇద్దరు వ్యక్తులు ఎవరికీ కనిపించకుండా దాక్కుని వున్నారనిగాని, డాక్టర్ లతీఫ్‌ని చాలా లాఘవంగా లోయలోకి పడేలా వాళ్ళే నెట్టారని గాని యెవరికీ తెలియదు.

అందరి హృదయాలు భారంగా వున్నాయి.

కర్తవ్యం వెన్నుతట్టి ముందుకు నడిపింది వాళ్ళను. యాంత్రికంగా రామన్న గూడెం నడుస్తూ మరో గంటకు చేరారు.

వాళ్ళు వెళ్ళేసరికి పరిస్థితి తీవ్రరూపం దాల్చింది. నలభై మందికి వ్యాధి సోకినట్టు ప్రాథమిక రిపోర్టు వచ్చింది. కాని, వాళ్ళు అక్కడికి చేరుకొనే సరికి డబ్భయి మంది విషజ్వరంతో మంచాన పడ్డారు.

డాక్టర్లు చకచక మెషిన్లలా పనిచేయటం మొదలెట్టారు. తనుతోటి డాక్టరు, అనుభవజ్ఞుడు, సహృదయుడు అయిన లతీఫ్ మరణం వాళ్ళని మానసికంగా బాగా అలజడికి గురిచేసింది. అందరి మనస్సుల్లోను తేలుకొండిలాంటి ప్రశ్న తలెత్తింది.

అందరు జాగ్రత్తగానే నడిచివస్తుండగా లతీఫ్ లోయవైపు యెలా జారిపోయాడు? అసలేం జరిగింది? లతీఫ్ మరణానికి, మందుల వేన్ తగలబడిపోవటానికి యేదయినా సంబంధముందా?

డాక్టర్ నాథ్ యిదే విషయమై తీవ్రంగా ఆలోచిస్తున్నాడు.

దేబ్భయి కేసులకి ముప్ఫయి కేసులు అప్పటికే డాక్టర్ల చెయ్యి దాటిపోయాయి. తక్కిన నలభై కేసుల్ని మృత్యుముఖం నుంచి తప్పించటానికి తీవ్రంగా కృషి చేస్తున్నారు డాక్టర్ల బృందం.

"చాలా చిత్రమయిన క్లినికల్ మానిఫెస్టేషన్స్. అసలు 'రూట్ ఆఫ్ ఇన్ ఫెక్షన్' నిర్ధారించటానికి వీల్లేని పరిస్థితి. ఏ గ్రౌండ్స్‌మీద ట్రీట్ చెయ్యాలో తెలియని అగమ్య పరిస్థితి. జ్వర తీవ్రతను తగ్గించటం తప్ప, మనం చెయ్యగలిగిందేమీ కనిపించటంలేదు. గాల్లో బాణం వేసినట్టే వుంది మన చికిత్స" నాథ్ చెప్పాడు రోగులందర్నీ పరీక్ష చేశాక.

తక్కిన డాక్టర్లు అతను చెప్పినదానికి ఔనన్నట్టు తల పంకించారు.

"కనీసం జ్వరతీవ్రతను తగ్గిస్తూ విషజ్వరానికి, వైరస్ ఫీవర్స్‌కిచ్చే ట్రీట్ మెంట్ నే ఇవ్వటం మంచిదని నా అభిప్రాయం" అంది సురేఖ.

"యూ ఆర్ రైట్! లెటజ్ ప్రొసీడ్ ఆన్ ది సేమ్ ప్రొసీజర్!" అన్నాడు విఠల్.

"మనం ట్రీట్ మెంట్ టేకప్ చేసిన కేసులు పసుపుపచ్చ రంగుకు తిరగలేదు. గమనించారా?" అన్నాడు వర్మ.

సరిగ్గా అప్పుడే డాక్టర్ల బృందానికి కబురొచ్చింది.

వద్దెర గూడెం నుంచి విషజ్వరం సోకినట్టు, దాదాపు ఇరవై మంది అస్వస్థులైనట్టు మెసేజ్ వచ్చింది.

డాక్టర్స్‌ని కొంతమందిని వద్దెర గూడెం వెళ్ళవల

సించిగా కోరుతూ జయదేవ్ మనిషి చేత కబురంపించాడు.

వర్మ, విఠల్, సురేఖ, మరో పదిమంది డాక్టర్సు పి.హెచ్.సి. స్టాఫ్ సాయంతో వడ్డెరగూడెం బయలు దేరారు.

నాథ్, సంజీవ్ పర్యవేక్షణలో తక్కిన డాక్టర్లు రామన్నగూడెంలోనే వుండిపోయారు.

## 4

వడ్డెరగూడెం మరీ దట్టమైన డొంకదారి గుండా ప్రయాణం చెయ్యాల్సి వచ్చింది.

వర్మ సురేఖను వారించాడు.

"మీరు యిలాంటి ఇంటీరియర్ విలేజికి నడిచి ప్రయాణం చేయలేరు. మీరు రామన్న గూడెంలోనే వుండిపోతే మంచిది!" అన్నాడు.

"నో, నో! మనం వచ్చింది ఆపదలో వున్న రోగుల్ని రక్షించటానికి! మన సుఖంకోసం చూసుకుంటే మన విద్యుక్తధర్మం నెరవేర్చలేం. ఫరవాలేదు, పదండి" అంది సురేఖ.

వడ్డెరగూడెం బాగా కొండవాలు ప్రదేశంలో వుంది. ప్రయాణం చాలా కష్టంగా వుంది. అన్నీ గుబురు చెట్లు, పొదలు, లోయలతో కాలు పెట్టడానికూడా వీల్లేనంత దుర్గమంగా వుంది.

మొదట్లో ఉత్సాహంగా సిద్ధపడినా, తర్వాత తను ఆ అడవి దారిన నడవటం చాలా కష్టసాధ్యమని గ్రహించింది సురేఖ. కాని పళ్ళబిగువున సహించింది.

వడ్డెరగూడెం యింకో కిలోమీటరు దూరంలో ఉందనగా డాక్టర్ వర్మ కాల్లో యేదో గుచ్చుకున్నట్టనిపించి

చటుక్కున నిల్చుండిపోయాడు.

దబ్బనంలా పొడవుగా వున్న ముల్లు బూటు అడుగు నుంచి అతని అరికాలుకి బలంగా నాటుకుంది.

బాధతో విలవిల్లాడాడు వర్మ. ముల్లు తీసుకోవటాని కన్నట్టు కొద్దిగా వంగాడు.

అంతలో తక్కిన డాక్టర్లు నాలుగడుగులు ముందుకి వేశారు.

సరిగ్గా అదే సమయంలో తన నడుంమీద ఏదో వస్తువు పడినట్టనిపించి ఉలిక్కిపడ్డాడు వర్మ.

అదేమిటో గ్రహించేలోపల అతని నడుముమీద కరుక్కున రెండు పళ్ళు దిగిపోయాయి. వెన్నుపూసగుండా విషం సరాసరి మెదడుకీ, నాడీమండలానికి రక్తంతో బాటు చివ్వున ప్రవహితమయింది.

అంతే! ఉన్న చోటనే కుప్పలా కూలిపోయాడు వర్మ. అతని నోటివెంట నురుగులు. క్షణాల్లో నల్లగా బొగ్గులా మాడిపోయిందతని శరీరం. అతన్ని కాటేసిన నల్లత్రాచు తనపని పూర్తయినట్లు జర జరా పొదల్లోకి పాక్కుంటూ పోయింది.

వర్మ రాకపోవటం చూసి వెనుతిరిగిన డాక్టర్లకి నేల వాలిన వర్మ కళేబరం కనిపించింది. అందరు ఒక్క పరుగున వెనక్కి వచ్చారు.

వర్మ శవాన్ని చూస్తూనే విరల్ ముందుగా అతని నాడి చూసి, పెదవి విరిచాడు. సురేఖ వర్మ ముఖం చూస్తూనే అతను విషనాగు కాటువల్ల మరణించినట్టు గ్రహించింది.

వరుసగా అన్నీ భయోత్పాతం కలిగించే సంఘటనలే జరగటంతో యిదంతా కాకతాళీయంగా జరుగుతున్నట్టు

సరిపెట్టుకోలేకపోయారు వాళ్ళు.

ఇప్పుడు వర్మ మరణంతో డాక్టర్లకి వెన్నున చలి పుట్టింది. ఒక్క రోజులో మూడు భయంకర సంఘటనలు! మందులతో నిండివున్న వ్యాన్ సమూలంగా తగలబడి పోవటం, తమ వృత్తిలో నిష్ణాతులైన యిద్దరు ప్రముఖు లయిన డాక్టర్లు కొద్ది గంటల వ్యవధలో ప్రాణాలు కోల్పోవటం—వాళ్ళని భయభ్రాంతుల్ని చేశాయి.

అస్వమనస్కంగానే వర్దెంగూడెం చేరారు డాక్టర్లు-వర్మ శరీరాన్ని పి. హెచ్ సి.కి తరలించి. డాక్టర్ లతీఫ్ శరీరమయితే దొరక నేలేదు!

డాక్టర్లు చేరేసరికి కేసుల సంఖ్య విపరీతంగా ఏభైకి పెరిగింది. ఓ పక్క చికిత్స చేస్తుండగానే మరో పది హేనుమందికి వ్యాధి సోకింది.

డాక్టర్ విఠల్ పరిస్థితి చాలా తీవ్రరూపం ధరించి నట్టు గ్రహించాడు. ఇది కేవలం తమ ముప్ఫయిమంది డాక్టర్లకి లొంగేటంత సామాన్య విషజ్వరం కాదని, తమ జిల్లానుంచే కాక, బయటి జిల్లాల నుంచి కూడా డాక్టర్లని రప్పించి, యుద్ధ ప్రాతిపదిక మీద చికిత్స జరపాల్సిందేనని నిర్ణయించుకున్నాడు.

జయదేవ్‌కి కబురు చెయ్యాలని కూడా అనుకున్నాడు. అయితే పెల్లిగ్రాం చూసుకుని డి. ఎమ్. హెచ్. వో. ఎలాగూ వస్తాడని అతనికి తెలుసు. అప్పుడు పరిస్థితి తీవ్రతను గురించి అతనికి తెలియపరచవచ్చు.

కాసేపట్లో విధి నిర్వహణపట్ల అత్యంత శ్రద్ధ కనపరిచే సురేఖ ఆధ్వర్యంలో డాక్టర్లందరు చిత్తశుద్ధితో తమ విధులను నిర్వహించటంలో నిమగ్నులయ్యారు.

డాక్టర్ జయదేవ్ కుర్చీలో నిటారుగా కూర్చుండి పోయి, తనకొచ్చిన లేఖను అప్పటికి అయిదోసారి ఆమూలాగ్రం చదువుతున్నాడు.

అతనికి ముచ్చెమటలు పోశాయి. ఒంట్లో సన్నగా ప్రకంపనలు మొదలయ్యాయి. అప్పటికి రెండు గ్లాసుల మంచినీళ్ళు తాగాడు. ఇంకా సిగరెట్లు చెయిన్ స్మోకింగ్ చేశాడు.

ఏడోసారి ఆ ఉత్తరం చదువుతున్నాడు.

"డియర్ డాక్టర్ జయదేవ్,

ఈ పిహెచ్ సిలో నీ శవం కూడా పార్లాడకుండా వుండాలంటే, నీ భార్యాబిడ్డలు నీ కళ్ళ ముందే దారుణంగా చావకుండా వుండాలంటే, వచ్చిన డాక్టర్లని యేదో సాకుతో వెంటనే పంపెయ్యి. లేకుంటే ఇరవై నాలుగ్గంటల్లో నీ కుటుంబాన్ని నీతో బాటు సమూలంగా నాశనం చేసేస్తాను.

నేనెవరో నీకు తెలియకపోయినా ఏం ప్రమాదంలేదు. తెలుసుకోవాలనుకున్నా నీ తరం కాదు. నేను నీ అడవిలోని చెట్టులో చెట్టుని, ఆకులో ఆకుని, పుట్టలో పుట్టని, గుట్టలో గుట్టని.

బి కేర్ ఫుల్!

—నీ శ్రేయోభిలాషి."

జయదేవ్‌కి అది ఉత్త బెదిరింపు మాత్రమే కాదని ఆ 'శ్రేయోభిలాషి' వాక్శూరుడే కాదు, కార్యశూరుడే నని జరిగిపోయిన దుర్ఘటనలు తిరుగులేని సాక్ష్యాలుగా

కనిపిస్తున్నాయి.

అంతక్రితమే వర్మ శవాన్ని పి.హెచ్.సి.కి తీసుకొచ్చారు. దాన్ని హెడ్‌క్వార్టర్సుకి పంపించటానికి సన్నాహాలు చేస్తుండగా ఇంతలో యెవరో ఇచ్చారంటూ ఓ పేషంటు కుర్రాడు ఉత్తరం తెచ్చియిచ్చాడు.

అప్పట్నుంచి మొదలయ్యింది జయదేవ్‌లో ఆరాటం! సంజీవ్, మరో డాక్టరు భీమశంకరం రామన్నగూడెం వెళ్ళారు. పి.హెచ్.సి. స్టాఫ్ కూడా వాళ్ళవెంట వెళ్ళారు. ఇద్దరు ఏ ఎన్నెమ్‌లు, ఓ ఇన్‌స్పెక్టరు, హెల్తు అసిస్టెంటు, టెక్నీషియన్, ఓ అటెండర్ తను మాత్రమే పి.హెచ్.సి.లో వున్నారు.

ఇప్పుడు తనేం చెయ్యాలి? డాక్టర్ల వలన ఆ వ్యక్తికి వచ్చిన నష్టమేమిటి? వాళ్ళనెందుకు వెనక్కి పంపించెయ్యమంటున్నాడు?

ఓ పక్క సీరియస్, అవుట్ బ్రేక్ ఆఫ్ ఎపిడిమిక్‌తో వందలాది ప్రాణాలు నష్టపోతుంటే, వాళ్ళ ప్రాణాలు రక్షించటానికి కష్టనష్టాల కోర్చి వచ్చిన డాక్టర్లని వెనక్కి పంపెయ్యాలా?

ఇదేదో చిన్న విషయమా, పంపెయ్యటానికి? ఈ జిల్లాలోనే కాక, ఇతర జిల్లాలకు కూడా ఈ వ్యాధి గురించి సమాచారం తెలిసిపోయింది. వైద్య ఆరోగ్య సర్వీసెస్ డైరెక్టర్‌కి కూడా టెలిగ్రాం వెళ్ళిపోయుంటుం దీపాటికి.

ఇంకా అదనంగా వైద్యసిబ్బందిని, పరికరాల్ని, మందుల్ని పంపించవలసిన తీవ్రపరిస్థితి! ఇలాంటి సమయంలో వున్నవాళ్ళని యేదో సాకు చెప్పి పంపెయ్యమని ఆ వ్యక్తి, లేక వ్యక్తుల సముదాయం బెదిరిస్తుంటే

రొలా యీ విపత్కర పరిస్థితి నుంచి బయట పడటం....!?

తను కాదని ఎదురుతిరిగితే!? తనని చంపెయ్యొచ్చు. తన భార్యాబిడ్డల్ని కూడా మట్టుబెట్టొచ్చు....తమ స్వార్థం కోసం వేలాది గిరిజనులను బలిచెయ్యటం యేమాత్రం న్యాయంకాదు.

ఆ 'శ్రేయోభిలాషి'తో తలపడటానికే నిర్ణయించుకున్నాడు జయదేవ్. అప్పుడతని కళ్ళముందు భార్యాబిడ్డలు కనిపించలేదు—కొన్ని వేలమంది గిరిజనులు కనిపిస్తూన్నారు.

జయదేవ్ నెత్తిమీదుగా గోడపైనున్న ప్రధాని లాల్ బహాదుర్ శాస్త్రిగారు ఫోటోలో నుంచి కర్తవ్యాన్నుపదేశిస్తున్నట్టుగా అనిపించిందతనికి.

మరో అరగంట తర్వాత చెంచుగూడెం నుంచి మెసేజ్ వచ్చింది.—పది కేసులు రిపోర్ట్ అయ్యాయి.

జయదేవ్ రామన్నగూడెం, వర్దెంగూడెం కూడా కబురు పెట్టాడు ఆ రెండు బాచ్‌ల్లోని డాక్టర్లలో కొందర్ని చెంచుగూడెం వెళ్ళవలసిందిగా కోరాడు. తను స్వయంగా చెంచుగూడెం బయల్దేరాడు.

సరిగ్గా అప్పుడే అతనికి ఎఫ్ ఎస్.ఓ. ఓ ఉత్తరం తీసుకొచ్చి ఇచ్చింది, మూసివున్న కవరుతో.

జయదేవ్‌కి తెలుసు అది 'శ్రేయోభిలాషి' నుంచి వచ్చినట్టు. సెకండ్ వార్నింగ్ వచ్చివుంటుంది. తనిలాంటి వాటిని లెక్క చెయ్యకూడదు.

అనాసక్తంగానే తెరిచి చదివాడు.

"....నేను హెచ్చరించినా వినకుండా చెంచుగూడెం కేసుల్ని కూడా అటెండ్ కావడానికి

పెడుతున్నావు కదూ! ఫలితం అనుభవిస్తావు...."

అని వుంది అందులో.

దాన్ని ముక్కలుగా చించి, సింక్‌లో వేసి నాబ్ తిప్పాడు జయదేవ్.

సరిగ్గా మరో అరగంటలో డి.ఎమ్.హెచ్.వో.కి టెలిగ్రాం వెళ్ళింది జయదేవ్ పేర.

"పరిస్థితి అదుపులో వుంది. అదనపు సిబ్బంది అవసరం లేదు. కొత్త కేసులు రిపోర్టు కాలేదు!" అని.

జయదేవ్‌కి సకల సన్నాహాలు చేస్తున్న డి.ఎమ్.హెచ్.వో ఆగిపోతాడని, ఆ టెలిగ్రాం చూసి సంతృప్తి పడిపోతాడని 'శ్రేయోభిలాషి'కి తెలుసు!

అదే జరిగింది! డిఎమ్‌హెచ్‌వో ఆగిపోయాడు.

డ్రగ్స్‌తో వేన్ కాలిపోయినట్టు అతను డిఎమ్‌హెచ్‌వోకిచ్చిన టెలిగ్రాం అతన్ని చేరకుండానే మధ్యలోనే ట్రాప్ అయిపోయినట్టు జయదేవ్‌కి తెలియదు.

# 6

చెంచుగూడెం అక్కడికి రెండున్నర గంటల ప్రయాణం!

జయదేవ్ వాచ్ చూసుకున్నాడు.

సాయంత్రం అయిదున్నర కావస్తోంది.

ఎఫ్.ఎన్.వో.ని పిలిచి, తమ క్వార్టర్సుకి కబురు పెట్టాడు—ముప్ఫయి మందికి సరిపడేలా వంట చేయమని!

మెడికల్ ఆఫీసర్సుకి పి.హెచ్.పి ఆవరణలోనే క్వార్టర్సు ఇవ్వబడ్డాయి.

కేసులు యెక్కడ్నుంచయినా రిపోర్టు వస్తే చెంచుగూడెం కబురు పెట్టమని చెప్పాడు.

చెంచుగూడెం మరో గంటలో చేరతామనేసరికి చీకటిపడిపోయింది. వెంట టార్చిలైటు తెచ్చాడు. ముందు ఎమ్మెస్వో, టెక్నిషియన్, ఓ హెల్తు అసిస్టెంటు, ఫేమిలీ వెల్ఫేర్ ఇన్ స్పెక్టరు నడుస్తూండగా జయదేవ్ ఆలోచనల్లో మునిగి పరధ్యానంగా నడుస్తున్నాడు.

అకస్మాత్తుగా జయదేవ్ మెడకు పైనుంచి ఉరిపడి క్షణాల్లో బిగిసింది. ఒక్క నిమిషం మాత్రం చెట్లమీదికి లాగివేయబడ్డాడు. మరునిమిషం నేలమీదికి వదిలివేయబడ్డాడు. ఇప్పుడు అతని మెడకు ఉరి లేదు!

ముందుగా ఇన్ స్పెక్టరు, హెల్తు అసిస్టెంటు తమ ఆఫీసరు రాకపోవటం గమనించి వెనుతిరిగి చూశారు.

నేలమీద నిర్జీవంగా పడున్న జయదేవ్‌ని చూసి అందరికీ గుండెలవిసిపోయాయి. దగ్గరగా వచ్చి చూసి, ప్రాణంలేదని నిర్ధారణ చేసుకున్నారు.

హెల్తు అసిస్టెంటు వడ్డెగూడెం, ఇన్ స్పెక్టరు రామన్నగూడెం, టెక్నిషియన్ చెంచుగూడెం వెళ్ళారు ఈ విషయం తెలియచేయటానికి. ఒక్కరోజులో ముగ్గురు డాక్టర్లు ప్రమాదానికి గురయి చచ్చిపోవటం అందరి గుండెల్ని అదరగొడుతోంది. జయదేవ్ శవంవద్ద ఎమ్మెస్వోని కాపలా పెట్టారు.

## 7

రామన్నగూడెంలో నాథ్ ఆధ్వర్యంలో చికిత్స సాగుతోంది.

నాథ్ వ్యాధి యెక్కడ ఎలా ప్రారంభమయిందో మొదటిగా ఎవరికి సోకిందో ఆ విషయాలన్నీ ఆరా తీశాడు.

మొదట ఓ పన్నెండేళ్ళ కుర్రాడికి తలనొప్పి, ఒళ్ళు నొప్పులు, వాంతులతో మొదలయ్యింది విషజ్వరం! ఆ తర్వాత ఆ ఇంటిలోని వారందరికి వ్యాధి సోకింది. క్షణాల్లో వాళ్ళుకూడా వ్యాధిగ్రస్తులయ్యారు.

నాథ్ కనిపెట్టిన విషయమేమిటంటే ఈ వైరస్ ఫీవర్ కేవలం నీటిద్వారానే వ్యాప్తిచెందినదని! అపరిశుభ్రమైన ఈ కొండజాతి మనుషుల ఆహారపుటలవాట్లే అందుక్కారణం.

వీళ్ళు ఆరోగ్య విషయమై చాలా వెనకబడి వున్నారు. ప్రకృతిసిద్ధంగా దొరికే పండ్లు, వెదురుబియ్యంవంటి పదార్థాలనే ఆహారంగా ఉపయోగిస్తూ, కొండ బండలమధ్య నుంచి ప్రవహించే నీటినే తాగుతూ బతికేయటం అనాదిగా వాళ్ళ కలవాటు!

ఈ వైరస్ చాలా వేగంగా వ్యాప్తిచెందే లక్షణమున్న అతి భయంకర క్రిమి. వైద్య చరిత్రలో దీనికింకా పేరు నిర్ణయించబడలేదన్నది నిర్వివాదాంశం.

అందుకే ఎలాంటి చర్యలద్వారా వ్యాధినిరాకుండా నిరోధించటమో ఇతమిద్ధంగా తెలీని అగమ్య పరిస్థితి ఎదురైంది వాళ్ళకి.

అయితే వాళ్ళు తీసుకొన్న జాగ్రత్తలవల్ల, ఇచ్చిన చికిత్సవల్ల కొత్తగా ఆ గూడెంలో మళ్ళీ కేసులు రాకుండా చేయగలిగారు.

అక్కడ వడ్డెర గూడెంలో కూడా సురేఖ కొత్తగా ఎవరికీ వ్యాధి సోకకుండా అన్ని రకాల చర్యలు తీసుకున్నది.

ఓ పక్క తాము వ్యాధి సోకిన వాళ్ళకు నిర్విరామంగా సేవచేస్తూంటే కొత్తగా మరో గూడెంలో వ్యాధి

పోకటం, మళ్ళీ అక్కడకు పరుగెత్తటం డాక్టర్ల పాహ సానికి అగ్నిపరీక్షలా వుంది.

ఇద్దరు డాక్టర్లు రామన్న గూడెంలోను, ముగ్గురు వద్దెగూడెంలోను కేసుల పర్యవేక్షణకు ఉండి. తక్కిన డాక్టర్లందరు జయదేవ్ పంపిన కబురు అందుకొని చెంచు గూడెం వెళ్తూండగా, జయదేవ్ దుర్మరణ వార్త తెలిసింది.

సరిగ్గా అందరి మనసుల్లోను అప్పుడే ఓ తీవ్రమైన అలజడి చెలరేగింది. ఉదయంనించి అప్పటివరకు జరిగిన దుస్సంఘటనలు కాకతాళీయంగా జరిగినవి కాదనే నిర్ణయానికొచ్చారు.

అయితే, ఎవరు చేస్తున్నారిదంతా? ఈ అమాయక ప్రజల్ని రక్షించాలని వచ్చిన ఇద్దరు డాక్టర్లు, సానికంగా వున్న మరో డాక్టరు—కొన్ని గంటల వ్యవధిలో దుర్మరణం పాలుకావటం సామాన్యమైన విషయంకాదు!

పెద్ద సంచలన వార్త!

ఇప్పుడు తామేం చేయాలి? కనీసం జిల్లా అధికారి అయిన డిఎమ్‌హెచ్‌వో అయినా వచ్చి చూస్తే బావుండును! వేన తగలబడిపోయిన వార్త టెలిగ్రామిచ్చినా ఇంకా ఎవరూ బయల్దేరాకపోవటం చాలా విచిత్రంగా కనిపిస్తోంది.

అన్యమనస్కంగానే అందరు చెంచుగూడెం బయల్దేరారు.

అప్పుడు సమయం రాత్రి ఎనిమిదిగంటలు కావస్తోంది.

ఎవరి మట్టుకు వాళ్ళు బాగా అలిసిపోయారు. పి. హెచ్.సి.నుంచి తెచ్చుకున్న కాఫీలు ఓప్న స్పాట్‌లో చుక్క నీరుకూడా ఎవరూ తాగలేదు. తమ వెంట వున్న

పి.హెచ్.సి స్టాఫ్ని మాత్రం నీటిని కాచుకొని వడబోసి తాగమని సలహా చెప్పారు.

చెంచుగూడెంలో పని పూర్తిచేసుకొని మరో ముగ్గురు డాక్టర్లు కాత్రేనికోన మూడో డాక్టరు భీమశంకరం అక్కడ వుండటానికి నియమించి, సురేఖ, నాథ్, విఠల్ మొదలైన డాక్టర్లంతా పి.హెచ్.సికి సంజీవ్తో సహా బయల్దేరారు. వాళ్ళకి కావలసిన సదుపాయాలు చూడటానికి.

అప్పుడు రాత్రి పదిగంటలయింది.

గిరిజన నాయకులు, గూడెం పెద్దలు డాక్టర్లని సాగనంపటానికి సాయం బయల్దేరారు.

అక్కడికి కాత్రేనికోన రెండున్నర గంటల ప్రయాణం! అడ్డదారిన గంటన్నరలో వెళ్ళవచ్చునని గూడెంవాళ్ళు సలహా చెప్పటమే కాక ఆ దారిన తీసుకు వెళ్ళటానికి సిద్ధమయ్యారు.

అలిసిపోయిన డాక్టర్లు ఓ గంట ప్రయాణం తగ్గటమే చాలుననుకొని సరేనన్నారు.

అయితే, దారి చాలా దుర్గమంగా వుంది!

అసలే రాత్రి సమయం. పైగా చీకటి రాత్రులు! ఎగుడుదిగుడు దారి. ఓ అరగంట ప్రయాణం జరిగింది.

గిరిజన నాయకులు చేత కాగడాలు ధరించి దారి చూపిస్తూన్నారు. ముందు కొంతిమంది మధ్యలో డాక్టర్లు, చివరగా మళ్ళీ గూడెం పెద్దలు అంగరక్షకుల్లాగా వెంట వెంటి నడుస్తూన్నారు.

సరిగ్గా అప్పుడే ఎక్కడినుంచో బాణాలు రివ్వురివ్వున దూసుకొచ్చి గిరిజన నాయకుల్ని, గూడెం పెద్దల్ని తీవ్రంగా గాయపరిచాయి.

వాళ్ళ చేతుల్లోని కాగడాలు ఎగిరి అవతల పడ్డాయి. ఒక్కసారిగా గందరగోళ పరిస్థితి యేర్పడింది. చుట్టూ చీకటి ఆవరించుకొని ఎంతటి ధైర్యశాలుడినైనా భీరువుగా మార్చెయ్యగల వాతావరణం భయంకరంగా పరచుకొని వుందక్కడ!

సరిగ్గా అదే సమయంలో ఎక్కడినుంచో పులి గాండ్రింపు వినిపించింది.

గాయపడ్డ గిరిజనులు తేరుకోవటానికి చాలా సేపు పట్టింది. కిందపడ్డ కాగడాలు అందుకొని, బాణాలు ఎవరు ప్రయోగించారో తెలియని అయోమయస్థితిలో చేతుల్లో వున్న బల్లేలని స్థిరంగా పట్టుకుని వెతుకుతూ కొండభాషలో తీవ్రపదజాలంతో గట్టిగా తిట్టారు.

కాని ఎక్కడ్నుంచీ సమాధానం లేదు!

డాక్టర్లయితే పూర్తిగా భయపడిపోయారు. బాణాలు ఎవరు గుప్పించారు? భయాందోళనలతో గిరిజనులవంక చూశారు.

"మీ పేనాలకి మా పేనాలడ్డం పెడతాం దొరలూ! మీకేటి భయంలేదు. మాం బతికుండగా మీమీద ఈగ వోల్లు" అన్నారు గిరిజనులు దృఢంగా.

వాళ్ళు అంత సమర్థులేనని డాక్టర్లకికూడా నమ్మకం కుదిరింది. ఒంటికి గుచ్చుకున్న బాణాల నొప్పిని, లెక్క చెయ్యకుండా చేత్తోతీసి అవతల విసిరేశారు. సూది గుచ్చు కున్నట్టుగా, యేమాత్రం చలించకుండా వాళ్ళ ప్రాణా లని పణంపెట్టి తమకోసం తాపత్రయపడుతున్న ఆ గిరిజనుల్ని చూశాక, వాళ్ళ బంధువులకోసం తాము అంతదాకా పడ్డ శ్రమ వ్యర్థం కాలేదనిపించింది వాళ్ళకు.

అయితే ఊహించనివిధంగా గిరిజనులందరు ఒకరి

తర్వాత ఒకరుగా చాపచుట్టల్లా నేలమీద పడిపోయి గిలగిల కొట్టుకోసాగారు.

వాళ్ళు చెప్పకుండానే, ఆ అవసరంలేకుండానే ఏం జరిగిందో డాక్టర్లకి తెలిసిపోయింది.

వాళ్ళు చేతులు జోడించి, "దొరలూ, బాణాలకి గరలం పూసినారు. కానుకోలేకపోయినం, ఎలిపోతున్నాం, జాగర్తగా ఎల్లుండి" అంటూ తలలు వాల్చేశారు.

వాళ్ళ నోటిచివర్లనుంచి నురగలు. విషసర్పాలు కాటందుకుంటే కనిపించే లక్షణాలు స్పష్టంగా వాళ్ళలో కనిపించాయి.

బాణం చివర్లకు విషసర్పాలనుంచి సంగ్రహించిన విషం పూశారు శత్రువులు.

ఇంతకీ వాళ్ళెవరు? ఎవరిమీద కక్ష?

"ఆ కాగడాలు చేతపట్టుకోండి!" అన్నాడు నాథ్, స్టాఫ్ వంక చూసి.

కాగడాల వెలుగులో నేలకూలిపోయిన గిరిజనుల శవాలు చాలా వికృతంటూ కనిపిస్తూన్నాయి.

కొద్దిసేపు అందరు మౌనంగా వాళ్ళ ఆత్మశాంతికి ప్రార్థన చేశారు. అందరి మనసులు చాలా భారంగా వున్నాయి. ఒకదానివెంట మరొకటి అన్నీ విషాద సంఘటనలే!

దారుణ మారణహోమం!

సమీప పొదల్లో తీవ్రమైన అలజడి రేగింది.

తేళ్ళు, కందేళ్ళు, చిన్న చిన్న జంతువులు అలజడిగా అటు ఇటు పరుగులు పెట్టాయి. అంతదాకా కనిపించకుండా దాగిన మూగజీవులన్నీ కకావికలుగా చెదిరిపోయాయి.

అయిదు నిమిషాల్లో ఆ ప్రదేశమంతా చాలా నిశ్శ బ్దంగా మారిపోయింది.

గాల్లో అదోరక రకమైన కబ్బువాసన వాళ్ళ నాసికా పుటాలకి సోకింది.

నాథ్ వెంటనే అందరికేసి హెచ్చరికగా చూసి, "పులి చాలా సమీపంలోనే ఎక్కడో పొంచి వుంది. వెంటనే నెగడు వెలిగించి దాన్ని భయపెట్టి తరిమేయాలి" అన్నాడు.

నలుగురు చకచక చితుకులు పోగుచేసి, కాగడాతో మంట చేశారు.

సరిగ్గా అప్పుడే పొదల్లోంచి వాళ్ళమీదకు దూక బోయిన పులి, అలజడిగా అక్కడినుంచి పారిపోయింది. ఎండుటాకులమీద చితుకులమీద పెద్దగా శబ్దమయింది. కబ్బువాసనకూడా మాయమైపోయింది.

"బ్రిలియంట్ యేక్షన్! పులి పారిపోయింది" అన్నాడు విఠల్ ప్రశంసగా నాథ్ వంక చూస్తూ.

అంతదాకా ఊపిరి బిగబట్టి చూస్తూన్న అందరికీ రిలీఫ్ అనిపించింది.

మళ్ళీ ముందుకు ప్రయాణం మొదలయ్యింది, అయితే అప్పటికి కాగడాల వెలుగు దాదాపు క్షీణించిపోయింది. చమురు ఖర్చయిపోయింది.

టార్చిలైట్లు రెండే రెండున్నాయి వాళ్ళవద్ద. వాటి వెలుగులోను, కాగడాల గుడ్డి వెలుగులోను ముందుకు సాగుతున్నారు.

ఇంకా రెండుకిలోమీటర్ల దూరముంది.

సరిగ్గా అప్పుడే ఎవరూ ఊహించని సంఘటన జరిగి పోయింది,

ఒక్కసారిగా ఏభైమంది ఆటవికులు, విల్లమ్ములు, పట్టాకత్తులు, బరిసెలు ధరించి వాళ్ళని చుట్టుముట్టారు.

కాసేపటివరకు దిగ్భ్రాంతినుంచి ఎవరూ తేరుకోలేక పోయారు.

నాథ్ ధైర్యంచేసి, "ఏమిటిదంతా? ఎందుకు మీరు మమ్మల్ని చుట్టుముట్టారు?" అనడిగాడు వాళ్ళని.

వాళ్ళు ఆయుధాలు గురిచేసి పట్టుకొని, "ఎవరూ మాట్లాడకుండా మా వెనకమాలి రండి. లేకపోతే పేనాలు తీసేస్తాం" అన్నారు.

సంఖ్యలో తామకూడా దాదాపు ఏభైమంది వరకు వున్నా, నిరాయుధులు.

వాళ్ళు చూడబోతే జాలి, కనికరం, దయ ఉన్న వాళ్ళుగాని, ఆ మాటలకర్థం తెలిసినవాళ్ళుగాని కాదని నాథ్‌కి పక్కనవారికి కూడా తెలుసు. అయితే ఇంత దాకా తాము చికిత్సచేసిన గిరిజనుల్లో ఇలాంటి దుష్ట స్వభావమున్న వాళ్ళెవరూ తారసపడలేదు.

వీళ్ళు ఈ గూడేలకి సంబంధించిన వాళ్ళేనా? అలా కనిపించటంలేదు.

అయితే, వీళ్ళెవరు?

ఆ రోజంతా జరిగిన మారణహోమాలు గుర్తొచ్చాయి వాళ్ళకు. ముగ్గురు డాక్టర్లని నిర్దాక్షిణ్యంగా చంపేశారు. వ్యాన్‌తోబాటు ప్రాణరక్షణ మందులన్నీ తగలేశారు. ఇప్పుడు తమని నిర్బంధిస్తున్నారు. కాదంటే నిస్సంకోచంగా ప్రాణాలు తీసేస్తారు.

విఠల్, నాథ్ తమ బృందంవైపు సాభిప్రాయంగా చూశారు. అందరు ఆటవికుల వెంట వెళ్ళటానికి మానసికంగా తమను తాము ప్రిపేర్ చేసుకున్నారు.

"ఊఁ! పదండి వేగి" అన్నారా ఆటవికులు.

డాక్టర్ల బృందం వాళ్ళ వెంట మౌనంగా నడిచారు. ఓ అరగంట ప్రయాణం తర్వాత గుహాలా వున్న నేల మాళిగలోపలికి తీసుకు వెళ్ళారు ఆటవికులు.

# 8

లోపల చీకటిగా, దారుణంగా వుంటుందని ఊహించిన డాక్టర్లకు, అక్కడ అధునాతన సౌకర్యాలతో దేదీప్యమానంగా వెలిగిపోతున్న కట్టడాలని చూసి నోట మాట రాలేదు.

అప్పుడు రాత్రి సరిగ్గా పన్నెండు గంటలయింది.

పొడవుగా వున్న ఓ హాల్లో వాళ్ళందర్నీ సామూహికంగా బంధించి, తలుపులు మూసేశారు ఆటవికులు.

నాథ్, విఠల్ వాళ్ళని ఆపి వివరాలడగాలనుకున్నారు. కాని వాళ్ళందుకవకాశమివ్వకుండా మౌనంగా వెళ్ళిపోయారు.

వాళ్ళ అంతర్యం తెలిసినట్టుగా ఎక్కడి నుంచో మాటలు వినిపించాయి.

"మిమ్మల్ని వెంటనే పంపించివెయ్యమని డాక్టర్ జయదేవ్‌కి చెప్పాం. కాని అతను మూర్ఖత్వంతో తన ప్రాణాల్ని బలి చేసుకున్నాడు. మీ ప్రాణాలకి ముప్పు తెచ్చాడు."

డాక్టర్ల బృందం చెవులు రిక్కించి వింటున్నారు. బహుశా ఆ హాల్లో యెక్కడో స్పీకర్లు అమర్చబడి వుంటాయని గ్రహించారు.

నాథ్ చుట్టూ చూసి, "ఇంతకీ మీరెవరు? ఎందుకు మేమంటే మీ కింత పగ? మేము రోగులకు సేవ చెయ్యటానికొచ్చిన డాక్టర్లం. ఎవరికీ హాని చేసేవాళ్ళం కాదు! మా

మీద కత్తి దేనికి?" అన్నాడు.

జవాబుగా వికటాట్టహాసం వినిపించింది.

"నన్ను ప్రశ్నించే అధికారం యెవరికీ లేదు. నే నీ అడవికి మకుటంలేని మహారాజాని. నాకు వ్యతిరేకంగా ప్రవర్తించినవాళ్ళు గాని, నన్నెదిరించినవాళ్ళు గాని ఇప్పటివరకు బతికి బట్టకట్టలేదు."

"మమ్మల్ని యేం చేయాలనుకుంటున్నారు? మేము తిరిగి వెళ్ళిపోవటంవల్ల మీకేమి లాభం? మేము లేకుంటే యీ అమాయక ప్రజల్ని రక్షించే దెవరు?" విఠల్ అడిగాడు.

"ఎవరూ రక్షించనక్కర్లేదు. రక్షించకూడదనే నేను కోరేది."

ఆ మాట వింటూనే వాళ్ళందరూ బ్రాన్పడి పోయారు.

సురేఖ నోరు తెరిచింది: "చాలా అన్యాయంగా మాట్లాడుతున్నారే! గుర్తుతెలియని క్రిమి ఈ గిరిజనుల ప్రాణాల్ని విషజ్వరం రూపంలో హరిస్తుంటే, మా ఆరోగ్యాన్ని పణంపెట్టి ట్రీట్ చెయ్యటాని కొచ్చాం. ఎన్నో ప్రాణాల్ని నిలబెట్టాం. మా అవసరం లేదని తెలిసిన మరుక్షణం తిరిగి వెళ్ళిపోతాం. అంతవరకు మా విధ్యుక్తధర్మాన్ని మమ్మల్ని నిర్వర్తించనివ్వండి."

"విధ్యుక్తధర్మం!" అతను హేళనగా నవ్వాడు. "మీకు వాళ్ళని రక్షించటం విధ్యుక్త ధర్మమయితే, నాకు వాళ్ళను, రక్షించే వాళ్ళను భక్షించటం విధ్యుక్త ధర్మం!"

అతని భావం వాళ్ళ మేధస్సు కందటంలేదు. అతను బాగా దుర్మార్గుడయినా అయివుండాలి, లేదా పిచ్చివా

డయినా అయ్యుండాలి! ఇది పిచ్చివాడి స్వర్గంలా వుంది!

"ఇంతకీ మమ్మల్నేం చేయాలనుకుంటున్నారు?" అన్నాడు నాథ్ వస్తున్న కోపాన్ని అణచుకుంటూ.

"అదిప్పుడు చెప్పను. ప్రస్తుతానికి మీరంతా నా బందీలు. మిమ్మల్ని ప్రాణాలతో ఉంచాలా, పరలోకం పంపించాలా అన్న విషయం ఇరవై నాలుగ్గంటల్లో నిర్ణయించి చెప్తాను."

"దారుణం! ఈ లోపల మరికొన్ని గూడేలకి ఆ విష జ్వరం పాకిపోతుంది. అప్పుడు ఎవరూ కంట్రోల్ చెయ్య లేనంతగా చెయ్యిదాటి పోతుంది. సర్వనాశనమయి పోతుంది" ఆవేదనగా చెప్పాడు విఠల్.

"అయిపోనివ్వండి, నాక్కావలసిందీ అదే!"

"అంటే మేము లేకపోయినంత మాత్రాన రాష్ట్రం డాక్టర్లవు గొడ్డుబోయిందా? మేం రాకపోవటంతో ఎంక్వయిరీ జరుగుతుంది. మరింత మంది డాక్టర్లు రంగం లోకి దిగుతారు. మీరు వాళ్ళని కూడా బంధిస్తే మరింత మంది.... ఈసారి పోలీసు బందోబస్తుతో మిలిటరీ సహా యంతో వచ్చి చికిత్స కొనసాగిస్తారే గాని, మానటం జరగదు.... ప్లీజ్ మైండిట్!"

సురేఖ ఆవేశంగా చెప్పింది.

"అదీ చూద్దాం మేడమ్! ఇంతవరకూ నేననుకున్న వన్నీ సాధించాను. ఇదీ సాధించితీరతాను. మీతో నాకు వాదన అనవసరం. భగవంతుడ్ని ప్రార్థించుకుంటూ కాల క్షేపం చేయండి."

ఆ తర్వాత మరి మాటలు వినిపించలేదు. అంతరవకు ప్రశాంతంగా వెలుగుతున్న దీపాలు ఒక్కసారిగా డిమ్

అయిపోయాయి.

డాక్టర్లందరు ఒకరిముఖాలొకరు చూసుకున్నారు. చాలా చిత్రమైన పరిస్థితుల్లో యిక్కడ చిక్కుకుపోయినందుకు చింతించసాగారు.

పి.హెచ్.సి. స్టాఫ్ కూడా డాక్టర్లతో బాటు బందీలైపోయారు.

సంజీవ్ డాక్టర్లవంక అపాలజిటిక్ గా చూసి, "అయామ్ వెరీసారీ! ఈ రోజంతా మీకు అసౌకర్యాలు లేకుండా చేశాను. మా పి.హెచ్.సి. తరఫున క్షమాపణ వేడుకుంటున్నాను" అన్నాడు.

"ఇట్సాల్ రైట్! ఇప్పుడు మనమేం చెయ్యాలో నిర్ణయించుకోవాలి. మనకిది ఓ సవాల్!" అన్నాడు నాథ్.

# 9

పరిస్థితి అదుపులో ఉందని వచ్చిన టెలిగ్రాం చూసుకుని డిఎమ్ హెచ్ వో సంతృప్తిపడ్డాడు. కాని, ముగ్గురు డాక్టర్లు దారుణంగా బలయిపోయారన్న వార్త, వ్యాన్ తగలబడిపోయిన వార్త పేపర్లో చూసి హతాశుడైపోయాడు.

విలేఖర్లకు అడ్డేముంది? ఎంత దాయాలని ప్రయత్నించినా నిజాల్ని వాళ్ళనుంచి దాచలేరు. కాలిపోయిన వ్యాన్ ని ఫోటోలతో బాటు ప్రచురించారు.

డాక్టర్ల మారణహోమం గురించి, దారుణ విషజ్వరం గురించి ప్రముఖంగా ప్రచురించారు.

అయితే అప్పటికింకా డాక్టర్ల అంతర్ధానం గురించిన వివరాలు తెలియనందున ఆ విషయం మాత్రం పేపర్లో రాలేదు.

డిఎమ్‌హెచ్‌వోకి చాలా ఆగ్రహం కలిగింది. మందులతో ప్రభుత్వ వాహనం తగలబడిపోతే ముప్ఫయిమంది డెప్యూటేట్ చెయ్యబడ్డ డాక్టర్లు గాని, పి.హెచ్.సి. లోని ముగ్గురు డాక్టర్లు గాని ఎందుకు తనకు తెలియ చేయలేదు?

డాక్టర్లు ముగ్గురు — జయదేవ్‌తోబాటు — యెలా చనిపోయారు? అసలేం జరిగింది?

డిఎమ్‌హెచ్‌వో సిబ్బందితో కార్లేనికొని హుటాహుటిన బయల్దేరాడు.

జరిగిన విచిత్ర సంఘటనలు విని మ్రాన్పడిపోయాడు. డాక్టర్లు గతరాత్రి హెడ్‌క్వార్టర్స్‌కి తిరిగిరాని విషయం తెలిసి, నిర్ఘాంతపోయాడు.

చెంచుగూడెనించి డాక్టర్లు బయలుదేరడం, దార్లో ఆటవికులు దారుణంగా బలవటించారని చెప్పగలిగాడో గిరిజన యువకుడు. కాని ఆ తర్వాత డాక్టర్లేమయ్యారో యెవరూ చూసినవాళ్ళు లేరు.

ఆ గిరిజన యువకుడు తమ గూడెం నాయకులు దెబ్బ తిని నేలవాలిపోతున్న సమయానికి చెంచుగూడెం వెళ్తున్నాడు జరిగిన దారుణం గురించి తన గూడెంవాళ్ళకి చెప్పి సహాయం తీసుకువద్దామని పరుగెత్తాడు చెంచుగూడెం వైపు.

అతను వాళ్ళ గిరిజన యువకుల్ని, మరికొందరు పెద్దల్ని వెంటబెట్టుకొని తమ గూడెం నాయకులు బాణాల దెబ్బలు తిని నేలకూలిన ప్రదేశానికొచ్చేసరికి డాక్టర్లు లేరు — శవాలు తప్ప.

జరిగిందేమిటో అర్థంకాని పరిస్థితుల్లో తమ నాయకుల

శవాలు తీసుకుని చెంచుగూడెం వెళ్ళిపోయారు.

మరునాడు చెంచుగూడెంలో వున్న పి హెచ్ సి మెడికల్ ఆఫీసరు భీమశంకరం, తక్కిన ముగ్గురు డాక్టర్లు. జరిగిన విషయం గిరిజన యువకుడివల్ల తెల్సుకుని పి. హెచ్. సికి బయల్దేరి వెళ్లారు.

వాళ్ళు అక్కడికి చేరి, తప్పిపోయిన డాక్టర్ల గురించి ఎంక్వయిరీ చేస్తూండగానే డిఎమ్‌హెచ్‌వో, సిబ్బందితో బయల్దేరి రావటం జరిగింది.

జరిగిన నష్టాన్ని, ప్రాణనష్టాన్ని స్వయంగా తిలకించిన ఆ జిల్లా అధికారి చాలాసేపు దిగ్భ్రాంతినుంచి తేరుకో లేకపోయాడు.

ముఖ్యంగా, కనిపించకుండా పోయిన డాక్టర్ల విషయం ఆయన్ని దైలమాలో పడేసింది.

రామన్న గూడెంలోను, వడ్డెర గూడెంలోను, చెంచు గూడెంలోను పరిస్థితి పూర్తిగా అదుపులోకి వచ్చింది. అక్కడ కొత్తకేసులేవీ రిపోర్టు కాలేదు. వ్యాధి సోకిన వాళ్ళలో చికిత్స చేయబడ్డవాళ్ళు త్వరితగతిని కోలుకుంటున్నారు.

డిఎమ్‌హెచ్‌వో మిస్సయిన డాక్టర్లని వెతకటానికి అవసరమైన ప్రయత్నాలు చేస్తూండగానే పిడుగులాంటి వార్త వచ్చింది.

అక్కడికి ఎనిమిది కిలోమీటర్ల మార్గంలో వున్న చిలకల గూడెంలో విషజ్వర కేసులు పది అవుట్ బ్రేక్ అయ్యాయి!

అంతే! డిఎమ్‌హెచ్‌వో తన వెంట తీసుకొచ్చిన ఆరుగురు డాక్టర్లను. చిలకల గూడెం పంపించాడు.

ఆ టెండర్ని మారేడుమిల్లి పంపించి, అక్కడినుంచి

జిల్లా హెడ్ క్వార్టర్స్‌కి మెసేజ్ పంపించాడు ఫోన్ ద్వారా. వెంటనే ఓ ఇరవై మంది డాక్టర్లని వివిధ పి హెచ్ సీల నుంచి డెప్యూటేట్ చెయ్యమని డిప్యూటీ డిఎమ్ హెచ్ వోకి మెసేజ్ పంపాడు. మందులతో సిద్ధంగా రమ్మని.

ఆయన సర్వీస్‌లో ఇది చాలా విచిత్రమైన వ్యాధి. ఓపక్క ఎపిడెమిక్ తమ శాఖను సవాల్ చేస్తూంటే, మరోపక్క జాడ తెలియకుండా పోయిన డాక్టర్ల అంతర్ధానం ఓ పజిల్‌లా తనని భయపెడుతోంది.

మధ్యాహ్నానికి డాక్టర్లను వెతకటానికి వెళ్ళిన గిరిజన యువకులు అడవంతా గాలించి వచ్చి చెప్పారు—కనిపించలేదంటూ.

డిఎమ్ హెచ్ వో అప్పటికప్పుడే ఓ నిర్ణయానికొచ్చాడు అయితే ఈలోపల చిలకల గూడెంలో ఎపిడెమిక్ కంట్రోల్ కావటంలేదని కబురొచ్చింది.

డిఎమ్ హెచ్ వోకి పరిస్థితి అంతా అగమ్యగోచరంగా అనిపించింది. అదనపు సిబ్బందిని పక్క జిల్లాలనుంచి, జిల్లాలోని తాలూకా హాస్పిటల్స్‌నుంచి రప్పించాలి. ప్రాణరక్షణ మందుల్ని కూడా తెప్పించాలి!

డిఎమ్ హెచ్ వో మెదడులో ఓ ప్లాన్ వెలిగింది.

అవును! ఇలాంటి విపత్కర పరిస్థితుల్లో ఆయనయితేనే తనని ఒడ్డెక్కించగలడు!

ఈ ఆలోచన వచ్చాక మరుక్షణంకూడా వృథా కానివ్వలేదాయన. జీప్‌లో మారేడుమిల్లి వెళ్ళాడు.

జిల్లా హెడ్ క్వార్టర్స్‌కి ఫోన్ చేసి డెప్యూటీ డిఎమ్ హెచ్ వోతో మాట్లాడి, మరో యిరవై మంది డాక్టర్లని, ప్రాణరక్షణ మందుల్ని వెంటనే పంపించమని చెప్పాడు.

తర్వాత మరో నంబర్ కి డయల్ చేశాడు.

అటునుంచి సమాధానం వచ్చింది.

"హల్లో. డిటెక్టివ్ కిరణ్ గారున్నారా?" అనడిగాడు డిఎస్‌హెచ్‌వో ఆత్రుతగా.

"లేరండి. ఓ కేసు పరిశోధన నిమిత్తం నాగపూర్ వెళ్ళారు. ఇంకా రాలేదు."

"మీరు ....!?"

"లాయర్ బిందు కిరణ్."

"అలాగా, నమస్తే లాయర్ గారూ! కిరణ్ యెప్పుడొస్తారో చెప్పగలరా? చాలా అర్జంటు."

"రెండు మూడు రోజుల్లో రావచ్చు. లేదా ఈ రాత్రికే రావచ్చు పనయిపోతే! చెప్పలేం. ఏం కావాలో చెప్పండి."

"నేను డిఎస్‌హెచ్‌వోని మాట్లాడుతున్నాను........" అంటూ వివరాలు చెప్పాడు.

అటునుంచి కొద్దిక్షణాలు నిశ్శబ్దం. తర్వాత, "నోట్ చేసుకున్నాను. వచ్చాక చెప్తాను" అన్నది లాయర్ బిందు.

"థాంక్యూ!" అంటూ ఫోన్ క్రెడిల్ చేశాడతను.

'కిరణ్ వచ్చేలోపల తను చెయ్యాల్సిన పనులు వేరే వున్నాయి. ముందు చిలకల గూడెం వెళ్ళి అక్కడి కేసుల్ని వెరిఫై చెయ్యాలి' అనుకున్నాడు.

ఓ అటెండర్ని, ఇన్‌స్పెక్టర్ని, మఫ్టీ పర్సన్ వర్కర్స్ ఇద్దర్ని వెంటబెట్టుకొని చిలకలగూడెం బయల్దేరాడు జీప్‌లో.

దాదాపు నాలుగు కిలోమీటర్ల వరకు జీప్ బాగానే వెళ్ళింది. ఆ తర్వాత దారి సుగమంగా లేదు. జీప్ వెళ్ళ

నంత ఇరుకు దారి. వెంట ఓ గిరిజన యువకుడు వెళ్ళాడు.

"ఇక నడవదు సార్! బాగా నేరో రోడ్!" చెప్పాడు డ్రైవర్. గిరిజన యువకుడు తలూపాడు.

"ఇంకా నాలుగు కిలోమీటర్ల దూరముంది సార్! కాలినడకనే వెళ్ళాల్సి వుంటుంది" మల్టీపర్పస్ వర్కర్లు చెప్పారు.

గిరిజన యువకుడు "అవున్దొరా. నేదారి చూపిస్త, రండి" అన్నాడు.

డ్రైవర్ కూడా బయల్దేరాడు.

ముందు గిరిజన యువకుడు దారి చూపుతుంటే వాడి వెనక మల్టీపర్పస్ వర్కర్ల మధ్య డిఎమ్‌హెచ్‌వో, ఆయన వెనక అటెండర్, డ్రైవర్ నడుస్తూన్నారు.

సరిగ్గా అప్పుడే పెద్దపులి గాండ్రింపు వినిపించింది. అందరికి గుండెలు ఝల్లుమన్నాయి.

పులి చాలా సమీపంలో వుందని దాని గాండ్రింపు ధ్వనిని బట్టి నిర్ధారణ అయింది. ఏ క్షణంలోనైనా అది తమమీద విరుచుకు పడొచ్చు,

గిరిజన యువకుడు నిల్చుండిపోయాడు.

"మెకం కానా దగ్గరసా వొచ్చినా ద్దొరా! బయం పడమాకండి. నాదరి బరిసె వుండాది గదా, ఏటాడ తాను" అన్నాడు.

అయితే అతను బరిసె చేతిలో వాటంగా పట్టుకుంటుండగానే, అమాంతం పొదల్లోంచి పులి అతనిమీద ఉరికింది.

చేతిలోని బరిసె ఎగిరి అవతలపడింది. పులి అతని ఛాతీమీద, ముఖంమీద పంజాతో కొట్టింది. అతను కలియబడ్డాడు.

ఈలోపల ఆ కొండర్, డ్రైవర్ వగయిరా స్టాఫ్ కకావికలుగా చెదిరిపోయారు.

సరిగ్గా అప్పుడే, ఎటూపోకుండా నిర్ఘాంతపోయి నిల్చుండిపోయిన డిఎమ్‌హెచ్ వోమీద నైలాన్ వల పడింది. దాన్నుంచి తప్పించుకోవటానికి ఆయన ప్రయత్నించేలోపల, ఆ వల చెట్టుపైకి గబగబ చేరుకోబడింది.

పులి ఆ గిరిజన యువకుడి కంఠం చీల్చి చంపేసి పొదల్లోకి లాక్కుపోయింది.

# 10

తెల్లవారి పదిగంటల పొద్దెక్కినా తమని ఆ బందిఖానానుంచి కాలకృత్యాలకు కూడా వదలకపోవటంతో తమను బంధించిన వ్యక్తి ఎంతటి క్రూరుడో అర్థమయిపోయింది నాథ్ బృందానికి.

విఠల్ అసహనంగా హాల్లో అటు యిటు పచార్లు చేస్తూన్నాడు. సంజీవ్ తమ కారణంగా అంతమంది డాక్టర్లని ఇబ్బందులకు గురిచేసినందుకు చాలా బాధపడుతున్నాడు. సురేఖ మొదలైన డాక్టర్లంతా దీర్ఘంగా ఆలోచిస్తూన్నారు—పరిస్థితి నెలా ఎదుర్కోవాలా అని!

"వీళ్ళ అంతర్యం ఈ పాటికి మీకర్థమయ్యే వుంటుంది. మనకు అన్నపానీయాలు అందకుండా చేసి, ఆకలితో మలమలమాడి చావాలని అతని ఉద్దేశ్యం" అన్నాడు నాథ్.

విఠల్ తలూపి, "కరెక్ట్! మనల్ని యిలాంటి ఆయుధంతోను చంపకుండా, మనంతమనమే చావాలని ఇతని కోరిక" అన్నాడు.

సురేఖ సాలోచనగా వాళ్ళవైపు చూసి, "నాకైతే అది సరైన కారణమనిపించటంలేదు. ఇతను మనల్ని

చంపాలనే ఉద్దేశ్యంలో లేదు. ఇతనే చంపాలనుకుంటే మనల్ని ఇంతదూరం శ్రమపడి తీసుకురావాల్సిన పనిలేదు. అడవిలోనే అంతం చేసి వుండేవాడు. ఆ ఉద్దేశ్యమే లేనప్పుడు మనల్ని ఇక్కడ పెట్టి, మనంతటమనం చావాలని మాత్రం ఎందుకనుకుంటాడు?" అన్నది.

ఆమె హేతువాదం తక్కిన అందరికీ సబబుగానే కనిపించింది. తమను బంధించటంలో అతని ఉద్దేశ్యం వేరే యేదో అయివుంటుంది. ఏమిటది? తమతో అతనికేమైనా పనుంటే అన్నపానీయాలు ఇవ్వకుండా చంపటానికి ప్రయత్నించడు.

సరిగ్గా అప్పుడే ఎక్కడ్నుంచో స్పీకర్లో మాటలు వినిపించాయి. "హల్లో ఫ్రెండ్స్! గుడ్ మార్నింగ్! ఎలా సాగా వున్నారా?"

అదే గొంతు హేళనగా ధ్వనించింది.

నాథ్ వెంటనే అడిగాడు. "మిస్టర్, మీరెవరు? ఎందుకు మమ్మల్ని నిర్బంధించారు? ఏం కోరి మమ్మల్నిలా యెందుకు హింసిస్తున్నారు?"

"డియర్ డాక్టర్! నన్ను! నన్ను ప్రశ్నించే అధికారం ఎవరికీ లేదని ముందుగానే చెప్పాను. మళ్ళీ చెప్తున్నాను. మిమ్మల్నెందుకు బంధించానో అదికూడా ఇప్పుడు చెప్పను. మిమ్మల్ని ప్రాణాలతో వుంచుతానా లేదా అన్న సంగతికూడా చెప్పను."

విలేకరికి కోపంతో అరికాలమంట నెత్తికెక్క "ఏం చెప్పకపోతే ఎందుకలా డంబాలు కొట్టుకోవటం? మమ్మల్ని పలకరించకుండా మా మానాన వదిలేయొచ్చు!" అన్నాడు.

"మీరు నా శత్రువులని రక్షించటానికి ప్రయత్నించి

నాకు శత్రువులయ్యారు. నా శత్రువుల నాశనాన్ని కోరు కొనే నేను ఫాక్ యెంతదూరంలో మీరున్నారో ఎప్పటికప్పుడు చెక్ చేసుకుంటున్నాను" వికటంగా నవ్వాడు.

"మా నాశనాన్ని కోరుకోవటానికి మమ్మల్ని ఇక్కడ బంధించాల్సిన పనిలేదే!?"

"అదే చిదంబర రహస్యం. ప్రాణాలు పోయేవరకు ఆలోచించుకుంటూ వుండండి. బై!"

"ఇంతకీ, వాటీజ్ యువర్ నేమ్?" అడిగాడు నాథ్.

"నా పేరులో పనేముంది? పేరే కావాలనుకుంటే మిష్టర్ 'ఎక్స్' అని పిలుచుకోండి!"

## 11

పి హెచ్ సి ముందు వేన్ ఆగింది.

అందులోనుంచి ఇగ్గైమంది డాక్టర్స్, పాతికమంది నర్సులు, ఆరుగురు ఎమ్మెన్ వోలు (మేల్ నర్స్ ఆర్డర్లీలు) దిగారు. తమతో బాటు అవసరమైన మందులన్నీ తీసు కొచ్చారు.

పి హెచ్ సిలో ఆ సమయానికి అటెండరు, ఇద్దరు ఏ ఎన్నెమ్ లు (ఆగ్జిలరీ నర్స్ మిడ్ వైఫ్ లు) ఓ ఎఫ్ ఎన్ వో వున్నారు.

ఆ డాక్టర్స్ లో దాదాపు ఆరడుగుల రెండంగుళాల ఎత్తుతో, స్ఫురద్రూపియైన డాక్టరు ముందుకొచ్చి "డిఎమ్ హెచ్ వో గారెక్కడున్నారు?" అనడిగాడు.

ఏ ఎన్నెమ్ ల్లో ఒకామె చెప్పింది. "చిలకల గూడెంలో కేసుల్ని చూడటానికి వెళ్ళారు సార్! మీరొస్తే అక్కడికి రమ్మని చెప్పమన్నారు."

"ఆయామ్ డాక్టర్ ధన్వంతరి! మాకు చిలకలగూడెం

వెళ్లేదారి చూపించాలి!" అన్నాడా డాక్టరు హుందాగా. ఆ టీమ్‌కి అతనే నాయకుడిలాగా వున్నాడు. ఫుల్ సూట్‌లో వున్నాడు. కోటు జేబులోనుంచి స్టెతస్కోపు తొంగిచూస్తోంది.

"అలాగే సర్, పిహెచ్‌సి స్టాఫ్ అందరు డ్యూటీ మీద వెళ్ళిపోయారు. ఆటెండరు తప్ప అందరు ఆడవాళ్ళే వున్నారు. అతనికి ఆఫీసు వర్క్స్ తప్పితే, అడవిలోకి దారి తెలియదు. దగ్గర్లో గిరిజన యువసంఘం నాయకులున్నారు పిలిపిస్తాం, దయచేసి రెస్టుతీసుకోండి కాసేపు" అన్నది రెండో ఏఎన్నెమ్.

డాక్టర్ ధన్వంతరి తక్కిన డాక్టర్ల వంక, పారా మెడికల్ స్టాఫ్ వంక చూసి, "కమాన్ డాక్టర్స్! లెటజ్ హావ్ ఎ ఫ్యూ మినిట్స్ రిలాక్సేషన్" అన్నాడు.

అందరు అతన్ని ఫాలో అయ్యారు.

ఈలోపల గిరిజన సంఘ యువనాయకుడికి కబురు వెళ్ళింది. ఇద్దరు యువకులు అయిదు నిమిషాల తర్వాత ధన్వంతరి బృందంముందు హాజరయ్యారు.

ఇద్దరు కాస్త చదువు సంధ్య ఉన్నవాళ్ళలాగానే వున్నారు. కాకపోతే, మాటల్లో యాస కొట్టొచ్చినట్టు కనిపిస్తోంది.

"చిలకలగూడెం తీస్కపోతాం, రండి దొరా!" అన్నారు వాళ్ళు.

ధన్వంతరి లేచాడు. తక్కిన డాక్టర్లుకూడా అతని వెంట లేచి ముందుకు నడిచారు.

"ఎంతదూరముంటుంది?" అడిగాడు ధన్వంతరి.

"దాదాపు రెండున్నర కోసులుంటాద్దొరా!"

"అంటే ఎనిమిది కిలోమీటర్లన్నమాట!" మనసులోనే గుణించుకున్నాడు ధన్వంతరి.

"వేన్ వెళ్ళగలదా?"

"సగందాకా ఎల్లగలుగుద్ది. ఆమీదన దారి బాగోదు."

మందులు తీసుక వెళ్ళటానికి ఎమ్మెన్వోలు వున్నారు. అయితే వేన్‌లో కొంతదూరం వెళ్ళి మళ్ళీ అక్కడ్నుంచి మందుల్ని బేగ్స్‌లో సర్దుకుని, వాళ్ళ చేత పట్టించుక పోవాలి!

వేన్‌లో పదిమంది డాక్టర్లు స్టాఫ్ గిరిజన యువకులు కూచున్నారు. అప్పటికే, మందులతో కూడిన వేన్ తగల బడిపోవటం, పిహెచ్‌సి మెడికల్ ఆఫీసరు జయదేవ్‌తో బాటు మరో ఇద్దరు డాక్టర్లు అకాల మృత్యువాతపడటం మొదలయిన వివరాలు ధన్వంతరి బృందానికి పిహెచ్‌సి అటెండర్ పూసగుచ్చినట్టు చెప్పాడు.

వేన్ నాలుగు కిలోమీటర్లు నడిచేసరికి అంతక్రితం డిఎమ్‌హెచ్‌వో ప్రయాణించివచ్చిన జీప్ కనిపించింది.

ధన్వంతరి దాన్ని చూస్తూనే డ్రైవర్‌తో "వేన్ స్లో చెయ్యి. నేను దిగుతున్నాను" అన్నాడు. డాక్టర్ల వంక చూసి చిన్నగా సైగచేశాడు. వాళ్ళు అర్థమయినట్టు తలలూపారు.

ధన్వంతరి వేన్ నడుస్తూండగానే మెరుపువేగంతో దిగిపోయి, పక్కనే వున్న గుబురు పొదలవైపు నడిచాడు. అతని చెయ్యి కోటుజేబులో బిగుసుకుని వుంది. ఏ క్షణంలోనైనా ప్రమాదం తనమీద విరుచుకుపడ వచ్చునని అతను చాలా అలర్టుగా వున్నాడు.

వేన్ జీవ్‌కి సమీపంలో ఆగిపోయింది.

డాక్టర్లు. పారా మెడికల్ స్టాఫ్ వేన్ దిగారు. సంచుల్లో మందులు సర్దుకుని భుజాలకు వేలాడదీసుకున్నారు స్టాఫ్.

గిరిజన యువకులు దారి చూపుతుండగా డాక్టర్లు వాళ్ళని అనుసరిస్తూన్నారు.

వారికి కొంత దూరంలో డాక్టర్ ధన్వంతరి అనుసరిస్తున్నాడు. త్వరలోనే యే మూలనుంచో ఎటాక్ ఎదుర్కోవలసి వుంటుందని అతని సిక్స్త్ సెన్స్ చెపుతోంది. చుట్టూ పరీక్షగా చూసుకుంటూ నడుస్తూన్నాడు ధన్వంతరి.

రెండు కిలోమీటర్లు నిరాటంకంగా నడిచి వెళ్ళారు. మరో రెండు కిలోమీటర్లు నడిస్తే చిలకలగూడెం చేరిపోవచ్చు. పొదల మాటునుంచే తనవాళ్ళని అనుసరించి వెళ్తున్నాడు ధన్వంతరి.

మరో కిలోమీటరు నడిచినా ధన్వంతరి యెదురు చూసిన ప్రమాదమేదీ యెదురుకాలేదు.

అయితే మరి కొద్దిక్షణాల్లోనే అతనూహించిన ప్రమాదం తమముందుకొచ్చింది. ఇరవైమంది సాయుధులైన ఆటవికులు ఒక్కసారిగా డాక్టర్ల బృందాన్ని చుట్టుముట్టారు.

వాళ్ళని ప్రతిఘటించవద్దని, ధన్వంతరి ముందుగానే తన వాళ్ళకు చెప్పి వుంచాడు. వాళ్ళమీద తిరగబడ్డా నష్టపోయేది తామేనని వాళ్ళకు తెలుసు.

అమాయకంగా ఆటవికులవైపే చూస్తూ, "మీరెవరు? ఎందుకిలా ముట్టడించారు? మేము డాక్టర్లం. చిలకలగూడెం వైద్యం చేయడానికి వెళ్తున్నాం" అన్నారు.

ఆటవికులు బరిశెలు పట్టా కత్తులు పట్టుకొని యువ

కింకరుల్లా నిలబడి వున్నారు.

"మా వెనకవాలి రాండి, ఎదిరిస్తే సంపేత్తాం" అన్నారు ఆటవికులు.

డాక్టర్ల బృందం వాళ్ళని అనుసరించారు.

దూరంగా పొదలచాటునుంచి ఎవరికీ కనిపించకుండా ధన్వంతరి వాళ్ళని అనుసరిస్తూన్నాడు.

ముందుగానే సగంమంది డాక్టర్లని, పారామెడికల్ స్టాఫ్ని అడ్డతోవన చిలకలగూడెం పంపించటం మంచి దయిందనుకున్నాడు. ప్రమాదం ముందు ఊహించినదే కావటంవల్ల పదిమంది డాక్టర్లను, అయిదుగురు స్టాఫ్ మెంబర్స్ని చికిత్స నిమిత్తం పంపించాడు ధన్వంతరి.

ఈపాటికి అక్కడ వ్యాధి తీవ్రతను చాలావరకు అరికట్టగలిగి వుంటారు డాక్టర్లు.

అయిదు నిమిషాల ప్రయాణం తర్వాత ఆటవికులం నల్లటి గంతల్ని పైకితీసి డాక్టర్ల బృందం కళ్ళకు కట్టారు. మళ్ళీ ప్రయాణం సాగింది.

మరో ఇరవై నిమిషాల తర్వాత ఆటవికులు నిలిచి పోయారు. చుట్టూ పరీక్షగా చూశారు. ఎవరూ గమనించటంలేదని నిర్ధారణ చేసుకున్నాక, గుహాకు అడ్డంగా వున్న బండరాతిని తొలగించారు.

బిలం బయటపడింది.

ఆటవికులు సగంమంది ముందువైపు, సగం వెనకవైపు మధ్య డాక్టర్ల బృందాన్ని కవర్ చేస్తూ బిలంగుండా లోనికి తీసుకువెళ్ళారు.

ధన్వంతరి తనూ బిలద్వారం చేరుకుని, కన్ను మూసి తెరిచేలోపల లోపలికి ప్రవేశించి మూలగా దాక్కున్నాడు.

లోపల దేదీప్యమానంగా వెలుగుతున్న అధునాతన కట్టడాన్ని చూసి ధన్వంతరి ఆశ్చర్యపోయాడు. సొరంగంలోంచి లోపల భవనాన్ని నిర్మించటం చాలా కష్టసాధ్యమైన పని!

ఆటవికులు డాక్టర్ల బృందాన్ని ఓ పెద్ద నిడుపాటి హాల్లోకి తీసుకువెళ్లారు. ధన్వంతరి చాలా కామ్‌గా వాళ్ళని వెంబడిస్తూ తనూ హాలు దగ్గరకు చేరాడు.

లోపల గుంపుగా వున్న డాక్టర్లు, పారామెడికల్ స్టాఫ్ కనిపించారతనికి.

ధన్వంతరి వాళ్ళలో నాథ్‌ను, విఠల్‌ని, సురేఖను, సంజీవిని గుర్తుపట్టాడు. తక్కిన డాక్టర్లను అతను ఎరగడు.

ఆటవికులు ఇనపగేట్లు కొద్దిగా తెరిచి తాము తీసుకొచ్చిన పదిమంది డాక్టర్లని, అయిదుగురు పిహెచ్‌సి సిబ్బందిని లోపలికి దాదాపు గెంటుతున్నట్టుగా తోసి మళ్ళీ గేట్లు వేసేశారు.

ధన్వంతరి ఆ బృందంలో వున్న డిఎమ్‌హెచ్‌వోని గుర్తుపట్టాడు. ఓ పక్కగా అటు తిరిగి వున్నందున వెంటనే గుర్తుపట్టలేదు మొదట.

అంటే, మొదటవచ్చిన డాక్టర బృందాన్ని, డిఎమ్‌హెచ్‌వోను కూడా ఇక్కడికే తీసుకువచ్చారన్నమాట! ఇప్పుడు మూడో బేచ్‌నికూడా ఇక్కడికే తెచ్చారు.

దీని వెనకవున్న హస్తం ఎవరిది? ఎందుకు డాక్టర్లనిలా బంధిస్తున్నాడు?

ధన్వంతరి - విఠల్, నాథ్, సురేఖ మొదలైన వాళ్ళందరి ముఖాలు బాగా వాడిపోయి నీరసంగా వుండటాన్ని గమనించాడు. తిండిలేక నకనకలాడుతున్నట్టుగా

కనిపించారు.

డిఎస్పీ హెచ్‌వోతో బాటు తక్కిన డాక్టర్లంతా కొత్తగా వచ్చిన డాక్టరువైపు సానుభూతిగా, ఆప్యాయంగా చూశారు. వాళ్ళందరు గతంలో ఒకరికొకరు బాగా తెలిసినవాళ్ళే! కుశల ప్రశ్నలు వేసుకుంటున్నారు.

ధన్వంతరి చుట్టూ పరిశీలనగా చూస్తూన్నాడు. అంత వరకు వాళ్ళని వెంటనంటి వున్న ఆటవికులు లోపలి గది లోకి వెళ్ళి పదినిమిషాల తర్వాత బయటికొచ్చి బిల ద్వారంవైపు వేగంగా నడుచుకుంటూ వెళ్ళిపోయారు.

ధన్వంతరి వాళ్ళు వెళ్ళొచ్చిన గదివైపు నడిచాడు మెల్లగా. లోపలంతా లైట్ల వెలుగు. తను పొరపాటున యెవరికంట పడినా మరుక్షణం తన శరీరంనుంచి ప్రాణాలు వేరయిపోతాయని అతనికి తెలుసు.

అందుకే చాలా కాషస్‌గా ప్రవర్తిస్తున్నాడు అతని కుడిచేయి కోటుజేబులోని రివాల్వర్ మీద బిగుసుకుని వుంది. ప్రమాదం యే రూపంలో విరుచుకుపడుతుందో అనూహ్యం!

అక్కడ ధన్వంతరికి మూసి వున్న తలుపులుమాత్రమే కనిపించాయి.

ధన్వంతరికి అలాంటి తలుపులున్న గదులు అదే వరసలో మరో రెండు కనిపించాయి.

వాటిని చూడాలంటే ఈ గది ముందునించే వెళ్ళాలి! తన ఊహే నిజమైతే, ఆ గదిలో ఈ గూడుపుఠాని చేస్తూన్న వ్యక్తిగాని, అతనికి సంబంధించిన వాళ్ళుగాని వుండాలి!

ధన్వంతరి మొండిధైర్యంతో అటు వెళ్ళాడు. తలుపులు

మూసే వున్నాయి. లోపల ఎవరున్నారో, యేమున్నాయో తెలీదు.

ఆ గదికి ఆవలగా వున్న గదులవైపు నడిచాడు ధన్వంతరి. తలుపులు నెట్టాడు, తెరుచుకోలేదు. రెండో గది తలుపులుకూడా నెట్టాడు అవీ తెరుచుకోలేదు.

లోపల్నుంచి గడియ పెట్టి ఉన్నాయేమోనని చూశాడు కాని అవి బయట్నుంచి గడియపెట్టుకుని లాక్ చేసుకునే పద్ధతిలో వున్నాయి.

గదిచుట్టూ పైభాగంలో వెంటిలేటర్సు వుండటం గమనించాడు' సారంగంలో కట్టిన గదులకి మళ్ళీ పై భాగంలో వెంటిలేటర్సేమిటి?

చిన్నగా నవ్వుకున్నాడు ధన్వంతరి.

ఓ పక్కనున్న వెంటిలేటర్ని గోడమీదుగా పైకెగ బాకి లోపలికి తొంగిచూశాడు.

ధన్వంతరికి ఆశ్చర్యంతో నోట మాటరాలేదు.

## 12

అది ఒక లాబరేటరీ!

దాదాపు ముప్ఫయిమంది యువకులు తమముందు మైక్రోస్కోపులు పెట్టుకుని ఏకదీక్షతో గాజు పలకలను (స్లైడ్సు) మైక్రోస్కోపు కింద పెట్టుకుని తీవ్రంగా పరిశీలిస్తున్నారు.

ఒక స్లైడ్ తర్వాత మరొకటిగా చాలా స్లైడ్సు వాళ్ళముందు గుట్టగా పేర్చబడిన బండిల్స్‌లోనుంచి తీసి పరీక్ష చేశాక పెన్సిల్‌తో దానిమీద నంబరు వేసుకుని వాటిని పక్కన పెడ్తున్నా...

కొన్నిటిమీద పాజిటివ్ (+) అని, మరి కొన్నిటి మీద నెగటివ్ (—) అని రాసుకుంటున్నారు. పరీ

క్షించటం ముగిసిన వెంటనే పొడవాటి బైండు పుస్తకాల్లో నంబరు రాసుకని పరిశోధన ఫలితాన్ని రిజిష్టర్ చేస్తున్నారు.

ధన్వంతరి చాలా సేపు ఆశ్చర్యంనుంచి తేరుకోలేక పోయాడు.

ఏమిటీ సెక్షన్? ఇంత రహస్యంగా, ఈ మారుమూల అడవిప్రాంతంలో సొరంగంలో వెలసిన ఈ లాబరేటరీ ఏమిటి? ఎవరు దీన్ని నడుపుతున్నారు!?

ఈ యువకులెవరు? వీళ్ళు చేస్తూన్న ఈ పరీక్షలు దేని గురించి? గూడేల్లో వ్యాపిస్తూన్న విషజ్వరానికి, చావులకి, వీళ్ళ పరిశోధనలకి ఎలాంటి సంబంధముంది?

ఎక్కడో లింక్ వున్నట్లనిపిస్తోంది ధన్వంతరికి.

యువకులందరూ పాతికేళ్ళలోపు వయసువారే. బాగా చదువుకున్న వాళ్ళలాగే వున్నారు. బహుశా సైన్సు గ్రాడ్యుయేట్స్, పోస్టు గ్రాడ్యుయేట్స్ అయ్యుంటారు.

మెల్లగా వెంటిలేటర్నించి కిందికి దిగి పక్క గది దగ్గరకు వెళ్ళాడు. అక్కడకూడా వెంటిలేటర్సున్నాయి.

ఓ వెంటిలేటర్ని సెలక్టు చేసుకున్నాడు. పైకెక్కి గది లోపలికి తొంగిచూశాడు.

మరో లాబరేటరీ! రసాయనిక ప్రయోగశాల.

దాదాపు పన్నెండు అడుగుల పొడవు, నాలుగడుగుల వెడల్పు వున్న బల్లలమీద బీకర్లు, పరీక్షనాళికలు, సీసాల్లో రసాయన పదార్థాలు—అంగుళం ఖాళీలేకుండా బల్లలు నిండిపోతున్నాయి.

దాదాపు ముప్ఫయిమంది యువకులు తెల్ల ఏప్రన్స్ వేసుకని, నిల్చుని పరీక్షనాళికల్లోని రసాయనాలను

దీపపు కాంతికి అభిముఖంగా పెట్టి పరీక్షిస్తూన్నారు.

ఎప్పటికప్పుడు రీడింగ్సు, ఫైండింగ్సు పాడవాటి లోక పుస్తకంలో రాసుకుంటున్నారు.

ఆ శోధనా నాళికల్లోని రసాయనాలేమిటి? వాళ్ళక్కడ చేస్తున్న ప్రయోగాలేమిటి?

ధన్వంతరి మస్తిష్కం ఆలోచనలతో వేడెక్కిపోయింది.

ఏవో కొన్ని సమాజ విద్రోహ శక్తులకి ఉపయోగపడే పరిశోధనలయి వుంటాయి. ప్రపంచ కళ్యాణానికి కాక వినాశనానికి దోహదం చేసే పరిశోధనలయివుంటాయి.

అందుకే.... అందుకే...ఇంత మారుమూల ప్రాంతంలో సారంగంలో జరుగుతున్నాయి ఈ ప్రయోగాలు. ఖచ్చితంగా లోకవినాశనానికి ఉద్దేశింపబడ్డ పరిశోధనలే ఇవి!

అయితే, అదేమిటి?

అదేమిటో తను తెలుసుకోవాలి.

ఇంతమంది డాక్టర్లని ఇక్కడ బంధించి వీళ్ళేం సాధించబోతున్నారో తను పరిశోధించి తెల్సుకోవాలి. వీళ్ళతో ముఖాముఖి పోట్లాడవలసివచ్చినా తను వెనుకంజ వెయ్యడు.

ధన్వంతరి పిడికిళ్ళు బిగుసుకున్నాయి. అతని దవడ కండరం బిగుసుకుంది. దృఢనిశ్చయంతో అతని రక్తం వేడెక్కి పొంగి పొరలింది.

వెంటిలేటర్ నుంచి కిందికి దిగాడు. మొదటి గది దగ్గరకొచ్చాడు. ఇందాకా ఆటవికులు ఆ గదిలోకి వెళ్ళి పదినిమిషాల్లో బయటికొచ్చి మళ్ళీ బిలం మార్గంగుండా అడవిలోకి వెళ్ళిపోవటం తను చూశాడు.

ఆ గదికికూడా వెంటిలేటర్స్ వుండటం గమనించాడు ధన్వంతరి.

మెల్లగా పైకి ఎగ్రబాకి లోనికి తొంగిచూశాడు.

లోపల రెండేరెండు టేబిల్సు వున్నాయి. ఓ టేబిల్ ముందు చాలా అందంగా వున్న యువతి కూచుని వుంది.

ఆమె వయసు ఇరవై ఇరవై రెండుకన్నా మించి వుండదు. గులాబి రంగు శరీరం. చక్కటి అవయవ సౌష్టవం. శాంకంగా బింకంగా వుంది. చూడగానే ఇనపకచ్చాడాలో బిగించుకున్న మహార్షులనికూడా ఉద్రేకంతో రెచ్చగొట్టేలా వున్నాయి అవయవాల ఎత్తు పల్లాలు.

ఆమె ఏకదీక్షతో తన ముందున్న టి.వి. స్క్రీన్ మీద రీడింగ్స్ నోట్ చేస్తోంది.

ఎలక్ట్రానిక్ తరంగాలు పీప్ ....పీప్ ....మంటూ చిన్న శబ్దంతో టి.వి. తెరమీద అలా మెరిసి ఇలా మాయమవుతున్నాయి.

ఆ స్ప్లిట్ సెకండ్‌లోనే ఆమె ఫైండింగ్స్ నోట్ చేస్తోంది కొన్నిసార్లు నంబర్సు మరికొన్నిసార్లు ఇంగ్లీషు అల్ఫబెట్స్ మరోసారి చుక్కలు, గీతలు—ఇలా రకరకాలుగా షార్టుహేండ్ స్క్రిప్టులా కనిపిస్తూన్నాయి తెరమీద.

ఆమె చూపు నిశ్చలంగా తెరవైపే వుంది. ఆమె చేతులు యాంత్రికంగా పుస్తకంలో ఏదో రాస్తూనే వున్నాయి. ఆమె కళ్ళుమాత్రం తెరమీదనే లగ్నమై వున్నాయి.

రెండో టేబిల్ ముందు ఓ నలభై ఏళ్ళ మగాడు కూచుని వున్నాడు. అతని గడ్డం మీసాలు ఓ క్రమపద్ధతి

లేకుండా పెరిగిపోయున్నాయి.

ప్యాంటు, షర్టు వేసుకున్నాడు. పొడుగు చేతుల షర్టును మోచేతులవరకు మడచుకున్నాడు. బాగా చదువుకున్న వాడిలాగానే వున్నాడు.

అతని ముందున్న టేబిల్ మీద వైర్లెస్ అపరేటస్ వుంది. ఓపక్క మైక్రోఫోన్, ఏంప్లిఫయర్ వంటి సాధనాలున్నాయి. ఎడమపక్క టెలెక్స్ సాధనముంది. దానిలో నిర్విరామంగా యేవో సంకేతాలు టకటక మంటూ టైప్ అయిపోతున్నాయి.

ధన్వంతరికి మస్తిష్కంలో ఫ్లాష్ వెలిగింది.

ఆ వ్యక్తి మిస్టర్ ఎక్స్‌గా డాక్టర్ల బృందానికి పరిచితుడు.

అతను చేస్తూన్న పనేమిటో చూచాయగా గ్రహించాడు ధన్వంతరి. ఎక్కడ్నుంచో అతనికి రహస్య సంకేతాలు అందుతున్నాయి. అతను వాటిని రిసీవ్ చేసుకుని డీకోడ్ చేసుకుంటున్నాడు. అలాగే తను పంపించాల్సిన సంకేతాల్ని కూడా కోడ్ భాషలో పంపుతున్నాడు.

ఇంతకీ ఆ సంకేతాలేమిటి? ఎక్కడ్నుంచి వస్తున్నాయి? మళ్ళీ ఎక్కడికి పంపుతున్నాడు?

ధన్వంతరి కళ్ళు చిట్లించి టి.వి. తెరమీద దృష్టి కేంద్రీకరించాడు. అతనికేమీ అర్థంకాలేదు. అయితే మధ్య మధ్యలో కెమిస్ట్రీ ఈక్వేషన్స్ మాత్రం ఇంతలో అంతలో మాయం కావటం గమనించాడు.

రసాయనిక ప్రయోగాల్లో అలాంటి ఈక్వేషన్స్ ఉపయోగిస్తారు. జరుగుతున్న ప్రయోగాలుకూడా రసాయనిక ప్రయోగాలే కాబట్టి వాటికి సంబంధించిన ఇన్ఫర్మేషన్ కోడింగ్ అండ్ డీకోడింగ్ జరుగుతోందక్కడ.

మిస్టర్ ఎక్స్ ముందున్న వైర్లెస్ ఆపరేటస్ నికూడా పరిశీలనగా చూశాడు ధన్వంతరి. ఏమీ అర్థంకాలేదు. డీకోడ్ చెయ్యాలి! చేస్తే అర్థంకావటం కష్టంకాదు. అయితే వాటిని ముందుగా వివరంగా కాగితంమీద నోట్ చెయ్యాలి!

మెదడులో కొంతవరకు రికార్డు చేయవచ్చునుగాని, చాలా వేగంగా మారిపోతున్నాయి రీడింగ్స్ ఒకదాని వెంట మరొకటి సీరియాటిమ్‌గా జరిగిపోతున్నాయి. కాగితం, కలం లేకుండా డీకోడ్ చెయ్యటం కష్టమే!

ధన్వంతరి చెవులకి షార్ప్‌గా యేదో శబ్దం వినిపించింది తల తిప్పి చూశాడు.

లోపలకు బిలం మార్గంగుండా ఎవరో వస్తూన్నారు.

వాళ్ళు తనని చూసే ప్రమాదం లేకపోలేదు. కాని.. తను తప్పించుకోవటాని కేమాత్రం వీలులేదు. తప్పించుకునే ప్రయత్నం చేస్తే వాళ్ళ కళ్ళముందు పడిపోతాడు. దిగకుండా అక్కడే గోడకి అంటిపెట్టుకుని వుండటమే శ్రేయస్కరం! వాళ్ళ కళ్ళలో పడకుండా దాక్కోవటానికి ఏభై శాతం అవకాశాలున్నాయి!

ఛాన్సెస్ ఫిఫ్టీ ఫిఫ్టీ! అలాంటప్పుడు ఏదైనా ఒకటే. దిగకూడదని నిర్ణయించుకున్నాడు ధన్వంతరి.

ఆటవికులు బాగా దగ్గరగా వచ్చేశారు.

## 13

"మీరు కూడా ఎలా వీళ్ళకు దొరికిపోయారు? మమ్మల్ని బంధించిన విషయం మీకెవరికీ కనీసం అనుమానం కూడా రాలేదా?" అడిగాడు నాథ్.

ధన్వంతరి బృందంలోని డాక్టరు నిర్లిప్తంగా నవ్వి, "ఉద్యోగ ధర్మం! చిలకల గూడెంలో అవుట్ బ్రేక

యింది ఎపిడెమిక్. డిఎమ్ఎచ్వోగారు మాకు ఫోన్లో మెసేజ్ పంపారు. వెంటనే బయల్దేరి వచ్చాం...."

అంటుండగా డిఎమ్హెచ్ఓ కల్పించుకొని, "నేను ఇరవైమందిని రమ్మని ఫోన్ చేశానే...." అన్నాడు. ధన్వంతరి బృందంలోని డాక్టర్ ఆయన్ని మెల్లగా భుజంమీద గిచ్చాడు.

డిఎమ్హెచ్ఓ షార్ప్గా రియాక్టయ్యాడు.

ఆ డాక్టర్ చెప్పాడు, "మీరు చెప్పినది కరెక్టే సర్, కాని, ఎమర్జన్సీ కేసు లుండటంవల్ల పదిమంది మాత్రమే ప్రస్తుతానికి రాకలిగాం."

మరో పదిమంది కూడా తమతోనే వచ్చారని. ధన్వంతరి సలహా మేరకు రహస్యంగా చిలకలగూడెం వెళ్ళి ట్రీట్మెంటు మొదలుపెట్టారని. మిస్టర్ ఎక్స్కి ఆ విషయం తెలిస్తే, చిలకలగూడెంలోని రోగుల ప్రాణాలు దక్కవనీ ఆ డాక్టరు డిఎమ్హెచ్ఓతో నిజాన్ని చెప్పకుండా మరుగుపరచాడు.

అందుకే భుజంమీద సంకేతసూచకంగా గిల్లాడు. డిఎమ్హెచ్ఓ అర్థం చేసుకొని మళ్ళీ రెట్టించలేదు.

అక్కడ వాళ్ళు మాట్లాడుకున్న మాటలన్నీ మిస్టర్ ఎక్స్కి స్పష్టంగా వినిపించే యేర్పాటు వుంటుందని అక్కడి డాక్టర్లందరికీ తెలుసు! తాము పొరపాటున నిజాలు మాట్లాడుకోకూడదని వాళ్ళకి తెలుసు.

డిఎమ్హెచ్ఓ చెవిలో రహస్యంగా యేదో చెప్పాడా డాక్టరు. అతని పేరు రవీంద్ర.

రవీంద్ర చెప్పిన విషయం వినగానే డిఎమ్హెచ్ఓ మనసు ఆనందంతో గంతులు వేసింది. అయితే ఆయన తన ఆనందాన్ని ముఖంలో ప్రతిఫలించకుండా జాగ్రత్త తీసు

కున్నాడు. తమ హావభావాల్ని, ఎక్కడ్నుంచో మిస్టర్ ఎక్స్ గమనిస్తూనే వుంటాడని, ఇంత ఆధునాతనంగా కట్టిన బిల్డింగ్‌లో టి.వి. షార్ట్ సర్క్యూట్ అమర్చకుండా వుండడని ఆయనకు తెలుసు.

అందుకే సాధ్యమైనంతవరకు తమ మనసులో చెల రేగుతున్న సంక్షోభాన్ని బయటపడకుండా అందరు జాగ్రత్తపడుతున్నారు.

డిఎమ్‌హెచ్ఓ సంతృప్తిగా తలూపాడు.

## 14

ఆటవికులు సరిగ్గా తను వెంటిలేటర్ దగ్గర చిక్కుకు పోయిన గదిలోపలకు వెళ్ళారు.

డాక్టర్ ధన్వంతరి సరిగ్గా అదే సరయిన అదనుగా చటుక్కున దిగిపోయి క్రిస్టడగా వున్న మారుమూల ప్రాంతంలో దాక్కుని ఆటవికులు వెళ్ళేవరకు యెదురు చూస్తూ నించున్నాడు.

ఓ అయిదునిమిషాల తర్వాత ఆటవికులు బిలద్వారం గుండా బయటకు వెళ్ళిపోయారు.

ధన్వంతరి తర్వాతేం చెయ్యాలో వేగంగా ఆలో చించుకుని ఓ నిర్ణయానికొచ్చాడు.

ముందు వాళ్ళు చేస్తున్న ప్రయోగాలేమిటో చూడాలి! మైక్రోస్కోపుల్లో పరీక్షిస్తున్న స్లైడ్స్ యేమిటో, పరిశీలించాలి. వాటిద్వారా తనకి కొన్ని ఆధారాలు దొరకొచ్చు. అయితే వాళ్ళు అంతమంది ప్రయోగశాలల్లో ఉండగా తను లోపలికి ప్రవేశించటం దుస్సాధ్యం!

ధన్వంతరి వాచీ చూసుకున్నాడు.

రాత్రి ఎనిమిది గంటలు!

కనీసం భోజనాలకయినా ఆ యువకులు లేవకుండా వుంటారా? అదే తనకి సరైన సమయం!

అయితే యిప్పట్లో వాళ్ళు లేచే సూచనలు కనిపించటంలేదు.

ధన్వంతరి యిలా ఆలోచిస్తూండగానే హాలుకి చేర్చి వున్న మరో గదిలో కలకల ధ్వనులు వినిపించాయి. ఒక్కసారి అనేకమంది మాట్లాడుకుంటున్న సవ్వడి అది.

ప్లేట్లు, గ్లాసులు చప్పుళ్ళవుతున్నాయి. నవ్వుతూ, తుళ్ళుతూ, మాట్లాడుకుంటున్న శబ్దాలు స్పష్టంగా వినిపించాయి.

ధన్వంతరి ఆ చప్పుళ్ళను సరిగ్గానే అంచనా వేశాడు. వాళ్ళు భోజనాలకి వెళ్తున్నారు.

హాలుకి చేర్చివున్న గదులు వంటశాల, డైనింగ్ హాలు కావచ్చునని అర్థం చేసుకున్నాడు.

ఇదే సరయిన అదను!

ధన్వంతరి తను మొదట చూసిన మైక్రోస్కోపుల గదికి వెళ్ళాడు.

గదితలుపులు నెట్టాడు, తెరుచుకోలేదు.

ఆ పక్కనుంచి వాళ్ళందరు డైనింగ్ హాల్లోకి వెళ్ళి వుంటారు. రెండోవైపు ద్వారంగుండా ప్రయత్నించాలి. అవి తెరిచేవుండొచ్చు.

ధన్వంతరి అంచనా తప్పలేదు.

గది రెండోవైపు తలుపులు దగ్గరగా మూసి వున్నాయి.... నెట్టాడు. చిన్న శబ్దంతో తెరుచుకొన్నాయి.

ధన్వంతరి చాలా వేగంగా తన పని మొదలు పెట్టాడు. వాళ్ళు భోజనాలు ముగించుకొని మళ్ళీ యే క్షణంలో

సైనా రావచ్చు! యీ లోపల తన పనిని ముగించు కోవాలి!

టేబిల్సుమీద వరసగా పేర్చివున్న మైక్రోస్కోపు లను సమీపించాడు.

స్లైడ్స్‌ని పరీక్షించాడు.

అవి 'స్టెయినింగ్' చేయుబడిన గాజు పలకలు.

మైక్రోస్కోపు కిందపెట్టి, లెన్స్, లైటింగ్ అడ్జెస్టు చేసి పరీక్షించాడు ధన్వంతరి.

దానిక్రింద స్ప్రింగులా వున్న 'బాక్టీరియా' (వ్యాధి కలిగించే సూక్ష్మక్రిములు) కనిపించాయి.

ధన్వంతరి కళ్ళు ఆశ్చర్యంతో పెద్దవయ్యాయి.

మరికొన్ని స్లైడ్సు పరీక్షించి చూశాడు. ఒకదాని కన్నా మరొకటి సూక్ష్మజీవుల సంఖ్యలో గణనీయమైన పెరుగుదల కనిపించింది.

ధన్వంతరి మెదడులో ఫ్లాష్ వెలిగింది.

అంటే.... ఈ సూక్ష్మజీవులు....విషజ్వరాన్ని కలిగిస్తూన్న 'వైరస్' అన్నమాట. వీటిని మైక్రోస్కోప్ కింద పరీక్ష చేసిన క్రిమి వివిధ దశల్ని రికార్డు చేస్తు న్నారు.

ఎందుకు?

జవాబు తట్టింది. కాని దాన్ని ఇంకా ఎనలైజ్ చేసు కోవాలి. సరైన కారణాన్ని సహేతుకంగా సాక్ష్యాధా రాలతో నిరూపించగలగాలి. అప్పుడు దానికి తిరుగులేని జవాబు దొరుకుతుంది.

తక్కువ మైక్రోస్కోప్‌లు కూడా చకచక చెక్ చేశాడు ధన్వంతరి. అవన్నీ 'స్టెయిన్' చేయబడ్డ గాజు పలకలే!

ధన్వంతరి రెండో గదిలోకి వెళ్ళాడు.

అక్కడి యువకులు కూడా భోజనాలకి వెళ్ళినట్టు న్నారు. స్టూల్స్ ఖాళీగా వున్నాయి.

బల్లమీద బీకర్లు. పరీక్షనాళికలు, గంట జాడీలు (బెల్ జార్స్), రసాయనాల సీసాలు, పేర్చబడి ఉన్నాయి.

పరీక్షనాళికల్ని ట్యూబ్ లైట్సుకి అభిముఖంగా పెట్టి, అంతక్రితం ఆ యువశాస్త్రజ్ఞాలు పరీక్షించిన విధంగా పరీక్షించి చూశాడు.

ధన్వంతరి కళ్ళు దిగ్భ్రాంతితో పెద్దవయ్యాయి.

పరీక్షనాళికలో సజీవంగా వున్న బాక్టీరియా కనిపిం చింది. పరీక్షనాళికల లోపలి గోడలకి, అంటుకొని పెరుగుతున్న తెల్లటి పదార్థం కనిపించింది. అది బూజులా ఉంది! ధన్వంతరికి పరిస్థితి చాలవరకు అర్థమయ్యింది. ఒక్కొక్కటే అనుమాన తెరలు తొలగిపోతున్నట్టుగా అనిపించింది.

లోక పుస్తకాలని తెరిచి చూశాడు.

అందులో 'ఫంగస్' పెరుగుతున్న వివిధ తేదీలకింద వివరాలు ఇవ్వబడ్డాయి.

మరికొన్ని రిజిష్టర్లలో 'వాక్సిన్ ప్రిపరేషన్ ఫార్ములా' గురించి పాయింట్లు ఒకదానికింద మరొకటి తేదీలవారీగా రాయబడి వున్నాయి.

ధన్వంతరి భ్రుకుటి ముడిపడింది. చకచక ఆ ఫార్ములా కాగితాల్ని చించేసి కోటుజేబులోను పర్సు లోపలి భాగంలోను భద్రపరిచాడు. అదేవిధంగా 'ఫంగస్' గురించి రాసిన వివరాల్నికూడా రిజిష్టర్లనుంచి కాగితాలు చించేసి భద్రపరిచాడు.

సరిగ్గా అప్పుడే "హేండ్సప్!" అంటూ ఓ సింహ గర్జన ద్వారం వైపునుంచి వినిపించి, అదిరిపడ్డాడు ధన్వంతరి.

గుమ్మం వైపు చూసి చేష్టలుడిగినట్టు నిల్చుండి పోయాడు.

## 15

అక్కడ రివాల్వర్ ధన్వంతరి గుండెకు గురిచూసి నిల్చున్నాడు మిష్టర్ ఎక్స్.

అతని కళ్ళు విషాన్ని కక్కుతున్నాయి. ఎర్రగా రక్తపు జీరలతో భయంకరంగా వున్నాయి.

"వెల్ కం మిష్టర్ కిరణ్! వెల్ కం!" అన్నాడతను రివాల్వర్ ని ఎగరేసి మళ్ళీ చేతుల్లో పట్టుకుని.

"కిరణ్ ఎవరు? అయామ్ ధన్వంతరి, డాక్టర్ ధన్వంతరి!" అన్నాడు ధన్వంతరి.

"ధన్వంతరి వేషంలో వచ్చిన డిటెక్టివ్ కిరణ్, డోంట్ మూవ్! జేబులోనుంచి చెయ్యి తీసెయ్యి లేకుంటే నిర్దాక్షిణ్యంగా కాల్చిపారేస్తాను" అన్నాడు మిష్టర్ ఎక్స్.

ధన్వంతరిగా నటించిన డిటెక్టివ్ కిరణ్ రెండు చేతులు పైకెత్తి, మిష్టర్ ఎక్స్ వంక నవ్వుతూ చూసి, "వెల్, మిష్టర్ ఎక్స్! నన్ను బాగా తెలిసిన సన్నిహితులే నేను ధన్వంతరినని పొరబడ్డారు. కాని నువ్వు నన్ను కిరణ్ గా గుర్తించావు. హేట్సాఫ్ టుయూ!" అన్నాడు.

మిష్టర్ ఎక్స్ అట్టహాసంగా నవ్వాడు.

"నువ్వీ లాబ్ లోకి ప్రవేశించినప్పట్నుంచి నీ చర్యల్ని ప్రతిక్షణం, ప్రతి మూవ్ మెంట్ ని నా రూంనించి క్లోజ్ డ్ సర్క్యూట్ టి.వి.లో చూస్తూనే వున్నాను....

కమాన్ నువ్వు రిజిష్టర్‌నించి చించిపారేసిన ఆ కాగితాలు నాకు వెంటనే వాపసివ్వు" మిష్టర్ ఎక్స్ ఎడమ చేతిని ముందుకు సాచాడు.

కిరణ్ జేబులో చెయ్యి పెట్టబోతుండగా "నో, నేనే తీసుకుంటాను. చేతులు పైకెత్తే నిల్చుని వుండు" అంటూ మిష్టర్ ఎక్స్ అతన్ని సమీపించి, ముందుగా కోటు జేబునుంచి రివాల్వర్ పైకితీసి తన జేబులో వేసుకు న్నాడు. ఆ తర్వాత కిరణ్ దుస్తుల్లో దాచిన కాగితా లన్నీ ఒకటొకటిగా స్వాధీనం చేసుకున్నాడు.

కిరణ్ మౌనంగా మిష్టర్ ఎక్స్ వంకనే పరీక్షగా చూస్తూన్నాడు.

మిష్టర్ ఎక్స్ రివాల్వర్ మొన అతని గుండెలకు ఆనించి అతని దుస్తుల్లో ఫార్ములా కాగితాలన్నీ పూర్తిగా స్వాధీనం చేసుకుని, మరింక కాగితాలేవీ లేవని నిర్ధారణ చేసుకుని దూరంగా జరిగాడు.

"నా సామ్రాజ్యంలోకి అడుగు పెట్టిన శత్రువులెవరూ ఇంతదాకా ప్రాణాలతో బయటపడలేదు. నిన్నీ పాటికే చంపేసి వుండేవాడిని. కాని, నీ గురించి, నీ మేధాశక్తి గురించి చాలా విన్నాను. ప్రత్యక్షంగా చూడగోరి ఇంత వరకు ఉపేక్షించాను.

"నీకు నా ప్రయోగశాలలో ఏం జరుగుతున్నదో అర్థ మయిపోయిందని గ్రహించాను. ఇక తాత్సారం చెయ్యకూడదనే నీముందు ప్రత్యక్షమయ్యాను. ఇక నిన్ను ఉపేక్షించకూడదు" మిష్టర్ ఎక్స్ వేలు ట్రిగ్గర్ మీద బిగుసుకుంది.

"మిష్టర్ ఎక్స్, ఏం కోరి నువ్వీ భయంకరమైన ప్రయోగాలకి సిద్ధపడ్డావు? ఎందుకు ఇంత ఘోర

మారణకాండకు సిద్ధమయ్యావు? ఎందుకింత భయంకరమైన సూక్ష్మజీవిని నీ ప్రయోగశాలలో పెంచి పోషిస్తున్నావు? అణుబాంబుతో సమానంగా ప్రపంచాన్ని దారుణ మారణహోమం చేయుశక్తిగల ఈ సూక్ష్మజీవుల్ని ప్రపంచంమీద వదిలెయ్యాలనే ఘోరమైన ఆలోచన నీకెలా పుట్టింది?" ఆవేశంగా అడిగాడు కిరణ్.

మిస్టర్ ఎక్స్ అపహాస్యంగా నవ్వాడు.

"మిస్టర్ కిరణ్, నేను సూక్ష్మజీవుల్ని పెంచటంలేదు. ఓ గొప్ప ఏంటిబయాటిక్‌ని, మరో గొప్ప 'వాక్సిన్'ని నా ప్రయోగశాలలో సృష్టిస్తున్నాను. అయినా నీకిదంతా చెప్పినా అర్థంకాదులే...." అని ఇంకా యేదో అనబోతుండగా కిరణ్ అడ్డుతగిలాడు.

"నాకంతా తెలుసు మిస్టర్ ఎక్స్! నేను సైన్సు గురించి, ప్రయోగాల గురించి తెలియని మూర్ఖుడిననుకోకు! నీ నోటితోనే చెప్పించాలని అలా ట్రిక్ ప్లే చేశాను. చెప్పమంటావా నువ్వు చేస్తున్న పనేమిటో?

"విను: నువ్వొకరకమైన భయంకరమైన క్రిమిని మానవ శరీరంలోకి పంపిస్తున్నావు. ఆ క్రిమి శరీరంలోని ఉష్ణోగ్రతకి, అనుకూల పరిస్థితులకి వందలాది, వేలాది క్రిములుగా విడిపోయి భయంకరమైన విషజ్వరాన్ని కలిగిస్తోంది. క్షణాలమీద ప్రాణాలని బలిగొంటున్నది. శత్రువుల్ని మారణాయుధాలు ఉపయోగించవవసరం లేకుండా ప్రాణాలుతీసే బ్రహ్మాస్త్రం—ఈ క్రిమి.

"శరీరంలో ఈ క్రిమి వివిధ దశలని, దాని విశ్వరూపాన్ని—విషజ్వరం సోకిన మనిషినుంచి సేకరించిన రక్తంబొట్టుని స్లయిడ్‌మీద కలెక్ట్ చేసి దాన్ని స్టెయినింగ్ చేసి లాబరేటరీలో మైక్రోస్కోపుల సాయంతో

పరీక్షిస్తున్నావు.

"మరోపక్క ఈ క్రిమి నెదుర్కోవటానికి ముందు జాగ్రత్త చర్యగా క్రిమిసోకిన మానవ శరీరంనుంచే ఇమ్యూనిటీ (వ్యాధి నిరోధక శక్తి)ని పెంపొందింపచేసే 'వాక్సిన్' కనిపెట్టి దానికి రసాయనిక ప్రయోగాలు చేస్తున్నావు.

"అంతేకాదు. ఈ వ్యాధినుంచి రక్షించటానికి ఈ క్రిములనుంచే 'ఏంటీబయాటిక్'ని తయారుచేస్తున్నావు పరీక్షనాళికల్లో 'ఫంగస్'లాంటి తెల్లటి పదార్థం ఆ ఏంటిబయాటిక్ ప్రథమస్థితి.

"ఎప్పటికప్పుడు ఇక్కడ నువ్వు సాధించిన ఫలితాల్నీ, ప్రయోగ వివరాల్ని కోడ్ భాషలో యెప్పటికప్పుడు మెసేజ్ పంపుతున్నావు. అక్కడినుంచి వస్తున్న సూచనల్ని డీకోడ్ చేసుకుంటున్నావు.

"ఎప్పుడైతే డాక్టర్లు చికిత్స చేయటానికి రంగప్రవేశం చేశారో నీ ఆటలు సాగవని భయపడ్డావు. ఎప్పటికప్పుడు ఎలాగ్ అయిన కేసుల్ని 'వాళ్ళు' ట్రీట్ చేస్తుంటే నీ ప్రయోగాలకి తీవ్ర అంతరాయం యేర్పడింది.

"అందుకే వాళ్ళను వెనక్కి పంపెయ్యమని డాక్టర్ జయదేవ్‌ని బెదిరిస్తూ లేఖలు రాశావు. అతను లక్ష్య పెట్టకపోగానే వెంటనే అడ్డు తొలగించుకున్నావు.

"డిఎమ్‌హెచ్‌వో రంగంలోకి దిగకుండా వుండటానికి తప్పుడు టెలిగ్రాంలు పంపి, జయదేవ్ పంపిన టెలిగ్రాంలు బట్వాడా కాకుండానే ముందుగా వాటిని ట్రాప్ చేయించావు. అయినా డిఎమ్‌హెచ్‌వో రానే వచ్చాడు. తక్కిన డాక్టర్లను బంధించిన చోటనే నీ

ప్రాకారంలో బంధించావు.

"చిలకల గూడెంలో నీ ప్రయోగం మొదలు పెట్టావు. అందరికీ ఇంజెక్ట్ చేయనక్కర్లేని శ్రమ అది! ఒకరికి సోకితే చాలు, అతన్నుంచి కొన్ని వేలమందికి క్షణాల్లో వ్యాప్తి చెందే ఎయిర్ బోర్న్ డిసీస్ (గాలి ద్వారా వ్యాపించే వ్యాధి) అది. అందుకే 'ఎపిడిమిక్' రూపంలో విజృంభించింది.

"అయితే ఒక్క ప్రశ్న అడుగుతాను. ఇదంతా యెందుకు చేస్తున్నావు?" ముగించాడు కిరణ్.

మిస్టర్ ఎక్స్ నిర్లక్ష్యంగా నవ్వి, "ఇన్ని తెల్సుకున్న వాడివి అవి కూడా తెల్సుకోలేక పోయావా?" అన్నాడు.

కిరణ్ మందహాసం చేసి, "ఆ మాత్రం గ్రహించలేని వాడిగా నన్ను భావించకు. ఈ దేశాన్ని వేర్పాటు వాదంతో ముక్క ముక్కలు చేసి మన దేశప్రజల ఐకమత్యాన్ని, భిన్నత్వంలో ఏకత్వాన్ని భగ్నం చేయాలని తలపన్నిన శత్రుదేశం నీకు కొన్ని కోట్ల విలువగల విదేశీ కరెన్సీనిస్తోంది.

"ఎప్పటికప్పుడు నీ ఫైండింగ్స్‌ని కనుక్కొని, అవసరమయిన సలహాలని కోడ్ భాషలో పంపుతోంది. నువ్వు, నీ లేడీ అసిస్టెంట్ దాన్ని డీకోడ్ చేస్తున్నారు. యామై రైట్?" అన్నాడు.

మిస్టర్ ఎక్స్ నిర్ఘాంతపోయాడు. తను ఊహించిన దానికన్నా చాలా తెలివైనవాడు ఈ డిటెక్టివ్. కాసంత పోటీ సే, డొంకంతా కదిలేశాడు. ఇక ఉపేక్షిస్తే లాభంలేదు.

"మిస్టర్ కిరణ్, ఇప్పటికే చాలా జాప్యం జరిగి

పోయింది. ఇక భగవంతుడ్ని తల్చుకో" రివాల్వర్ ఫర్మ్‌గా పట్టుకుని నవ్వాడు మిస్టర్ ఎక్స్.

ఆ నవ్వు తనని సవాల్ చేస్తున్నట్టు భావించాడు కిరణ్.

మిస్టర్ ఎక్స్ రివాల్వర్ సేఫ్టీ కాచ్ తప్పించాడు. మరుక్షణం బుల్లెట్ సూటిగా కిరణ్ గుండెల్లోంచి దూసుకుపోయి వుండేది!

అయితే మిస్టర్ ఎక్స్ ఊహించని విధంగా కిరణ్ షూ అడుగునున్న సోల్ నుంచి సర్రుమంటూ ఓ పదునైన చాకులాంటి ఆయుధం మిస్టర్ ఎక్స్ గుండెల్లో దూరి అతని గుండెనూ, ఊపిరితిత్తుల్నీ సర సర మంటూ కోసేసింది.

మిస్టర్ ఎక్స్ అమాంతం నేలకూలిపోయాడు.

"కిరణ్ కదిలేటంతలో "హేండ్సప్ మిస్టర్, డోంట్ మూవ్!" అంటూ సన్నటి కంఠం కంచులా మోగింది.

కిరణ్ ఉలిక్కిపడి ద్వారంవైపు చూశాడు. లేడీ అసిస్టెంటు!

ఆమె చేతిలో నల్లగా నిగనిగలాడుతున్న రివాల్వర్ కాలసర్పంలా కాటెయ్యటానికి సిద్ధంగా వుంది!

## 16

కిరణ్ మెరుపువేగంతో వంగి సాక్స్‌లో దాచిన రివాల్వర్‌ని అందుకుని అంతకంటే వేగంగా ఆమెకు గురి చూసి కాల్చాడు.

ఆమె ఈ పరిస్థితి ఎదుర్కోటానికి సిద్ధంగా లేదు. ఒక్కసారిగా ఆమె విరుచుకుపడిపోయింది.

కిరణ్ ఆమెమీదినుంచి బయటకు గెంతి తక్కిన రెండు

రూములవైపు పరుగెత్తాడు.

అప్పటికింకా డైనింగ్ హాల్లో నుంచి సైంటిస్టులు బయటకి రాలేదు. మిస్టర్ ఎక్స్ యెంత ప్రమాదకరమయిన మనిషో అతను నియమించిన శాస్త్రజ్ఞులు కూడా అలాంటి ప్రమాదకారులే!

వాళ్ళని వదిలితే దేశ వినాశనానికే వాళ్ళ ప్రతిభని, సామర్థ్యాన్ని వెచ్చిస్తారు.

అప్పటికప్పుడే ఓ నిర్ణయానికొచ్చాడు కిరణ్.

మిస్టర్ ఎక్స్ గదిలోకి పరుగెత్తాడు. ఇంతక్రితం ఆ గదిలో ఓ పక్కగా 'ఎక్స్ప్లోజివ్స్' అన్న పేరుతో వున్న కర్టన్ చూశాడు తను.

వెంటనే తన ఆలోచనని కార్యరూపంలో పెట్టాడు కిరణ్.

కర్టన్ తెరిచి అందులోనుంచి గ్రెనేడ్స్ హేండ్ బాంబ్స్ బయటికి తీశాడు. వాటితో బాటు కనెక్టింగ్ రోప్ కూడా తీసుకున్నాడు.

లాబరేటరీస్ రెంటిలోను, వైర్లెస్ అపరేటస్ వున్న గదిలోను బాంబులు అమర్చాడు. వాటితో బాటు కనెక్టింగ్ రోప్ కలుపుకుంటూ వచ్చాడు.

ఆ తర్వాత డైనింగ్ హాల్లోని శాస్త్రజ్ఞులు బయటకి రాకుండా తలుపులు మూసెయ్యాలని ముందుకు పరుగెత్తాడు.

సరిగ్గా అప్పుడే యిద్దరు యువకులు బయటికి వస్తూ, కిరణ్ని చూసి గట్టిగా అరచి మిగతావాళ్ళకు సిగ్నల్ ఇవ్వబోయారు.

అంతే! కిరణ్ రివాల్వర్ నుంచి వరుసగా రెండు గుళ్ళు బయల్వెడలి వాళ్ళ గుండెల్లో నిద్రపోయాయి.

దబ్బున నేలమీద పడిపోయారు వాళ్ళు.

డైనింగ్ హాల్ తలుపు బయట్నుంచి తోస్తూండగా వాళ్ళందరూ గోలగా పైకి లేచి ముందుకు రాబోయారు. కాని అప్పటికే కిరణ్ బయట్నుంచి తలుపులు మూసి గడియపెట్టేశాడు.

ఆ హాలుకి అదొక్కటే ద్వారం కావటం చాలా మేలయ్యిందనుకున్నాడు కిరణ్.

ఆ మరుక్షణమే డాక్టర్లు బంధింపబడ్డ హాలు దగ్గరకు చేరుకున్నాడు కిరణ్. బయట తాళం పెట్టి వున్నది.

రివాల్వర్ గురిచూసి తాళం పేల్చేశాడు.

గడియతీసి డాక్టర్లవైపు చూసి, "కమ్ అవుట్ డాక్టర్స్! వెంటనే బిల్డింగుండా బయటకు పరుగెత్తండి" అన్నాడు పెద్దగా కిరణ్.

డిఎమ్‌హెచ్‌వోతోబాటు డాక్టర్లందరూ ఒక్క ఉదుటున బయటపడి వేగంగా బిలద్వారం వైపు దూసుకుపోయారు.

కిరణ్ చివరగా తనూ బయటికొచ్చి హేండ్ బాంబ్ విసిరేశాడు సొరంగంలోకి. బాంబు ధామ్మంటూ పేలింది.

రోప్ అంటుకుని సరసరమని కాలుకుంటూ గ్రెనేడ్స్‌ని తాకింది.

అంతే! బ్రహ్మాండమైన విస్ఫోటం!

కొద్ది క్షణాలవరకు ఆ ప్రాంతమంతా బాంబుల శబ్దాలతో అతి తీవ్రంగా కంపించిపోయింది.

—:అయిపోయింది:—

సీరియల్

వి.యస్.రావ్




(గత సంచిక తరువాయి)

"నర్మదా.... లే.... హార్లిక్స్ తాగడం మరిచిపోయావ్!" అన్నాడతను నవ్వుతూ.

నర్మద కళ్ళు మెల్లిగా విచ్చుకున్నాయి. చిరునవ్వుతో భర్తని చూసిందామె. కరుణాకర్ యెడం చెయ్యి ఆమె భుజాలకింద దూరింది. మెల్లిగా ఆమెని లేవనెత్తుతూ, ఆమె వీపుని తన ఛాతీమీద ఆన్చుకున్నాడతను. కుడిచేత్తో పట్టుకున్న హార్లిక్స్ లోటాను ఆమె నోటికి దగ్గరగా జరిపాడు.

"వద్దండీ...." నిద్రమత్తు ఆమె కంఠంలో జీరగా ధ్వనించింది.

కరుణాకర్ ఎడమ చెయ్యి ఆమె భుజాన్ని ప్రేమగా నొక్కింది. "వద్దంటే వదిలేది లేదు! బాబుకోసం

తాగాలి!" అన్నాడు నవ్వుతూ.

నర్మద అయిష్టంగా నోరు తెరిచింది. కరుణాకర్ ప్రేమగా లోటాని ఆమె నోటికి అందించాడు. సగం తాగి, ఆమె అతని చేతిని దూరంగా తోసింది.

"హార్లిక్స్ అదోలా వుంది.... నాకు చాలు. మీరు తాగండి.... అందామె...." అలసటగా.

కరుణాకర్ నవ్వుతూ తల అడ్డంగా ఆడించాడు. "కడుపులో వుంది నువ్వు; నేను కాదు! బాబు బలంగా వుండాలంటే నువ్వు హార్లిక్స్ తాగి ఆరోగ్యంగా వుండాలి! కనుక, తాగేయ్...." అంటూ లోటాను మళ్ళీ ఆమె నోటికి అందించాడు.

నర్మద రెండు గుక్కలు మింగింది. తలని వెనక్కి వాల్చి అతన్ని తన చేపల్లాంటి కళ్ళతో వోరగా చూసింది. "చాలండీ....హార్లిక్స్ యేదోలా వుంది...."

"కడుపులో వున్న మనిషికి అన్నీ అదోలాగే వుంటాయి, డార్లింగ్. తాగేయ్. అన్నంకూడా సరిగా తినలేదు నువ్వు" అంటూ కరుణాకర్ లోటాని మళ్ళీ ఆమె నోటికి అందించాడు.

నర్మద వోడిపోతూ, కళ్ళు మూసుకుని గ్లాసుని ఖాళీ చేసింది. లోటాను మంచం పక్కనే వున్న టీపాయ్ మీద పెట్టి, పైట అంచుతో ఆమె నోటిని తుడిచాడతను. ఆమె బుగ్గమీద సున్నితంగా పెదాలతో రాశాడు. మెల్లిగా ఆమెని మంచంమీద పడుకోబెట్టాడు.

వెల్లకిలా పడున్న నర్మద కళ్ళు మూసుకుంది, అలసటగా.

కరుణాకర్ ఆమె మొహంలోకి అనురాగంతో చూశాడు. ఫాన్ గాలికి చెదురుతున్న ఆమె ముంగురుల్ని

సవరించాడు. "హాయిగా నిద్రపో, డార్లింగ్!" తన భార్య ఇంక మెలకువరాని గాఢనిద్రలోకి జారుకుంటోందని తెలిసి కరుణాకర్ ప్రేమగా అన్నాడు.

ఆమె తలగడ పక్కనే బోర్లించి వున్న 'ప్లెయిన్ ట్రూత్ ఎబౌట్ చైల్డ్ రియరింగ్' పుస్తకాన్ని తీసి, మడిచి టీపాయ్‌మీద పెట్టాడు. పుట్టబోయే బిడ్డ పెంపకం గురించి, ఇప్పుడే నేర్చుకుంటోంది నర్మద! నవ్వుకుంటూ వెళ్ళి లైటు తీసేశాడతను.

తడువుకుంటూ వెళ్ళి, బల్లసొరుగులో దాచిన సిగరెట్ పాకెట్ నీ, లైటర్నీ తీసుకుని కిటికీ ముందుకు నడిచాడు.

నెల తప్పినప్పట్నుంచీ నర్మదకి సిగరెట్ వాసన పడటంలేదు. ఆమె మెలకువతో ఉంటే తను సిగరెట్ కాల్చేవాడు కాదు! నవ్వుకుంటూ కరుణాకర్ కిటికీ ముందున్న కుర్చీలో కూచున్నాడు. సిగరెట్ వెలిగించి, వెనక్కి వాలి తృప్తిగా కళ్ళుమూసుకున్నాడు....

* * *

చెవులు రిక్కించి, రాతి విగ్రహంలా పెరటి తలుపు వెనక నుంచున్న వ్యక్తి నీడలా కదిలాడు. పదడుగుల దూరంలో ఉన్న ప్రహారీ గోడను అవలీలగా దాటి చకచక నడుస్తూ గోడమూలకి చేరుకున్నాడు. నీడలా నించున్న తన అనుచరుణ్ని చిరునవ్వుతో చూశాడు.

"అయిందా?" అతనికోసం అక్కడ కాచుకున్న వ్యక్తి, జాకీ తగ్గు స్వరంతో ప్రశ్నించాడు.

"అనుకున్నదంతా, అనుకున్నట్టే అయింది!" పెరట్లోంచీ వచ్చిన వ్యక్తి, పోతరాజు సగర్వంగా అన్నాడు.

"ఇప్పుడు ఏం చేయాలి?" జాకీ, చిటికెన వేలు చెవిలో దోపుకుని తిప్పుతూ అడిగాడు.

"నాటకం మొదటి సీను పూర్తయింది. రెండో సీను నడిపించాలి! పద" అంటూ పోతరాజు ముందుకు కదిలాడు.

క్షణాల్లో ఇద్దరూ ఇంటి ముందు భాగం చేరు కున్నారు.

క్షణంలో ఇద్దరూ గండుపిల్లుల్లా ప్రహారీగోడ దాటి వరండా వైపు కదిలారు. శబ్దం చేయకుండా వరండా మెట్లెక్కి తలుపుముందు ఆగారు.

పోతరాజు చేతిలోని కత్తి పాంటు జేబులోకి మాయ మైంది. అతని చెయ్యి తలుపు పక్కగా గోడని తడి మింది. స్విచ్చి తబ్బెత్తుగా వేళ్ళకి తగిలింది. చూపుడు వేలు స్విచ్చిని నొక్కింది.

• • *

సిగరెట్ పీలుస్తూ ఆలోచనల్లో మునిగిపోయిన కరుణాకర్ ఉలిక్కిపడ్డాడు.

కాలింగ్ బెల్ ఆగకుండా మోగుతోంది! ఎవరు? ఇంత రాత్రివేళ తనకోసం యెవరొచ్చారు? తనని అంత అర్జెంటుగా కల్సుకోవాల్సిన క్లయింట్స్ కూడా ఎవరూ లేరు.

కుర్చీలోంచి అదరాబాదరా లేచాడతను. హాల్లోకి ప్రవేశించి, స్విచ్చినొక్కాడు. ఫ్లోరసెంట్ ట్యూబు వెలిగింది.

ఎవరో పిచ్చివాడులా వున్నాడు. ఆపకుండా కాలింగ్ బెల్ స్విచ్చి నొక్కుతూనే వున్నాడు. కరుణాకర్ విసుగ్గా గుమ్మంవైపు నడిచాడు.

"ఎవరు?" తలుపు తెరవకుండా అరిచాడతను. బెల్ ఆగింది.

"లాయరుగారూ, ఎమర్జెన్సీ! తలుపు తెరవండి!"

తలుపు అవతలనుంచీ యేదో అపరిచిత కంఠం అరిచింది, కంగారుగా.

అసంకల్పితంగా కరుణాకర్ వరండా లైటు స్విచ్చి నొక్కాడు. గొళ్ళెంలాగి, తలుపుని వోరగా తెరిచాడు, ఎదురుగా నిలబడ్డ అపరిచిత వ్యక్తిని ప్రశ్నార్థకంగా చూశాడు.

అతను పొడుగ్గా, బలిష్టంగా ఉన్నాడు. గుబురుగా పెరిగిన మీసాలు. గుబురుగా పెరిగిన కనుబొమల కింద మెరుస్తున్న చిన్న చిన్న కళ్ళు. ఎడమ బుగ్గమీద కుంకుమ గింజంత పులిపిరికాయ. తల ముందు భాగంలో సగందాకా వెంట్రుకలు లేవు. సగంనుంచీ పెరిగిన జుట్టు పల్చటి గిరిజాలుగా చెవుల వెనక వేళ్ళాడుతోంది. టైట్‌గా ఉన్న పాంటూ, షర్ట్‌లో వున్నాడతను.

"ఏమిటి? మీరెవరు?" కరుణాకర్ ప్రశ్నించాడు; పొడుగాటి వ్యక్తి పక్కనే పొట్టిగా నుంచున్న లావుపాటి వ్యక్తిని వోరగా చూస్తూ.

నూనె వోడుతున్న జుట్టు చిందరవందరగా వుంది. గెడ్డం, మీసాలూ పూర్తిగా తీసేయబడిన వెడల్పాటి మొహం. నేలపగుళ్ళలోంచీ మొలిచిన గడ్డిలా వెంట్రుకలు అతని చెవుల్లోంచీ బైటికి పొడుచుకొచ్చాయి. అతని పాదాలు అసహనంగా కదులుతున్నాయి.

"లాయరుగారూ, మీ అసిస్టెంట్ గీత ఆపదలో వుంది...." పొడుగాటి వ్యక్తి బొంగురు కంఠం అంది.

"వాట్?" కరుణాకర్ ఆశ్చర్యంతో అరిచాడు. అతని వేళ్ళసందుల్లో చీ సిగరెట్ పీక జారి కిందపడింది. పొడుగాటి వ్యక్తి బూటుకాలు ముందుకుసాగి, సిగరెట్ పీకని నొక్కింది.

"నేను పార్క్ రోడ్డమ్మట వస్తున్నా, వీధిచివరున్న ఒక ఇంట్లోంచీ ఒక యువతి అరుస్తూ బైటికి పరుగెట్టుకొచ్చింది. తటాలున ఆగి, చూశాను. ఇద్దరు యువకులు ఆమెని తరుముతున్నారు. నన్ను చూసి, ఆమె అరిచింది. మీ అడ్రసు చెప్పి, తొందరగా మిమ్మల్ని తీసుకురమ్మంది. తన పేరు గీత అనీ, మీ అసిస్టెంటనీ చెప్పింది...."

"ఆమెకేమయ్యింది?" కరుణాకర్ కంగారుగా అడిగాడు.

"ఏమయ్యిందో నాకు తెలీదు. ఆ ఇద్దరూ ఆమెని మళ్ళా ఆ ఇంట్లోకి లాక్కెళ్ళారు. ఒంటరి ఆడదాన్ని మగాళ్ళు లాక్కెళ్తే యేమవుతుందో మీకు తెలుసు. నేను పరుగెట్టాను. అదృష్ట కొద్దీ ఇతని టాక్సీ దొరికింది" పోతరాజు ముగించాడు.

కరుణాకర్ నిశ్చలంగా నిలబడి, అయోమయంగా చూశాడు. గీత! తన శిష్యురాలు. ఆమెకి.....ఆమెకి యేమయ్యింది?

"త్వరగా తెమలండి. నా టాక్సీలో అక్కడ దించి, నేను వెళ్ళిపోతాను!" పొట్టిగారిన్న జాకీ హెచ్చరించాడు.

"ఒక్క క్షణం ఆగండి. పోలీసులకి ఫోన్ చేస్తాను. తరువాత వెళ్దాం" అంటూ కరుణాకర్ వెనుదిరిగాడు. హాల్లోకి వేయడానికి యెత్తిన అతని పాదం మళ్ళా వరండాలోనే ఆగింది. పోతరాజు చెయ్యి అతని బనియన్ వెనకభాగాన్ని పట్టుకొని, వెనక్కి లాగింది. అతన్ని తన వేపు తిప్పుకొని పోతరాజు, చిరునవ్వుతో చూశాడు.

"అంత వ్యవధి లేదు, లాయర్! నువ్వు తొందరగా రావాలి!" అన్నాడతడు ఏకవచనంలో నిర్లక్ష్యంగా.

తన బనియన్ని పట్టుకున్న అతని చేతిని ఒకసారి చూసి, కరుణాకర్ తన చూపుల్ని అతని మొహంమీదికి తిప్పాడు. "వదులు! ఏమిటి నీ ఉద్దేశం?"

"షటప్! పోలీసులూ, ఫోన్లూ అనకుండా, తక్షణం బయల్దేరు! కమాన్!" పోతురాజు అతన్ని లాగుతూ అన్నాడు.

కరుణాకర్ వెనక్కి తగ్గుతూ, ఆశ్చర్యంగా, అనుమానంగా చూశాడు. గీతకి అపాయం జరిగిందన్న ఆతురత కాకుండా మరేదో భావం పొడుగాటి వ్యక్తి మొహంలో ప్రస్ఫుటమవుతోంది.

"ఆల్ రైట్ ....వదులు! గుడ్డలు మార్చుకుని ..."

"షటప్! గుడ్డలు మార్చి మస్తాబు కానవసరం లేదు లాయర్" అన్నాడతను ఎగతాళిగా. అతని కుడిచెయ్యి పాంటు జేబులోకి వెళ్ళింది. మరుక్షణం తెల్లటి కత్తితో ప్రత్యక్షమైంది. లైటు కాంతి కత్తిమీదపడి తళుక్కుమంది.

కరుణాకర్ గాబరాగా చూశాడు ఏమిటిదంతా? ప్రాక్టికల్ జోకా? గీతకి యేమీ జరగనట్టుంది. ఎవరు వీళ్ళు? ఎందుకిలా ప్రవర్తిస్తున్నారు?

"లాయర్, మర్యాదగా మాతో రా! తిక్క వేషాలేస్తే మొహాన్ని చెక్కేస్తాను!" అన్నాడు పొడుగాటి వ్యక్తి కర్కశంగా. తల ఎగరేస్తూ తన అనుచరుడికి యేదో సైగచేశాడు. అతను ముందుకు కదిలాడు. హాల్లోకి అడుగుపెట్టి, స్విచ్చిలు నొక్కేశాడు. హాల్లో వరండాలో వెలుగుతున్న లైట్లు ఆరిపోయాయి. తలుపు దగ్గరగా మూసిన చప్పుడైంది.

"మీ రెవరో, యెందుకొచ్చారో నాకు తెలీదు. మీకు

డబ్బు కావాలంటే ఇచ్చేస్తాను, పట్టుకుపోండి"
కరుణాకర్ కోపం దిగమింగుతూ అన్నాడు.

"నోరు మూసుకొని కదులు!" అంటూ తను కరుణాకర్ని వరండాలోంచీ గేటువైపు బరబరా ఈడ్చాడు. "లాయర్, ఈసారి నోరు తెరిస్తే, నీ చెవి తెగి, రోడ్డోపడి దొర్లుతుంది!"

కరుణాకర్ వొళ్ళు జలదరించింది. అతని మాటలు బెదిరింపుల్లా లేవు. వెనక నడుస్తున్న ఆ వ్యక్తి తనని నిర్లక్ష్యంగా ముందుకి తీసుకెళ్తున్నాడు. కరుణాకర్ గుండె దప్పులా మోగుతోంది. జరుగుతోందంతా యేదో కలలా వుంది. సక్రమంగా ఆలోచించాలని ప్రయత్నిస్తున్న కరుణాకర్ని పోతిరాజా. మలుపులో, చీకట్లో ఆగిన కారు దగ్గరగా తోసుకెళ్ళాడు.

జాకీ ముందుకి పరుగెత్తి కారు డోర్ తెరిచాడు.

మెడచుట్టూ వేళ్ళు బిగించి, పోతిరాజా కరుణాకర్ మెడని వంచి, విసురుగా కార్లోకి తోశాడు. మెరుపులా కార్లో దూరి, అతని పక్కనే కూచుని, డోర్ మూశాడు. అతని చెయ్యి ఇంకా కరుణాకర్ మెడని బిగించి పట్టుకొనే వుంది. కరుణాకర్ విదిలించుకోబోయాడు. పోతిరాజా వేళ్ళు పట్టకారుల్లా అతని మెడ నరాలమీద బిగుసుకున్నాయి.

"లాయర్, కుక్కిన పేనులా పడుండు!" అన్నాడతను కటువుగా. కారు స్టార్టయింది. ఒక్క ఉదుటున ముందుకు దూసుకెళ్ళింది.

వీళ్ళిద్దరూ యెవరు? తనని యెక్కడికి తీసుకెళ్తున్నారు? ఆలోచిస్తూంటే గీతకి యే అపాయమూ సంభవించలేదనిపిస్తోంది. ఆ ఆలోచన తనకి కొంత ఊరట

కలిగిస్తోంది.

"మిస్టర్, మీ రెవరో పిచ్చిగా ప్రవర్తిస్తున్నారు. దీని పర్యవసానం...." కరుణాకర్ మాట మధ్యలో తెగిపోయింది. చీకట్లోంచి దూసుకొచ్చిన పిడికిలి అతని పొట్టలో గునపంలా దిగింది. లోపల్నుంచి తన్నుకొస్తున్న బాధ మూలుగుగా అతని కంఠాన్ని చీల్చింది.

"ఈసారి నోరు తెరిస్తే ముందరి పళ్ళన్నీ గొంతుకలో దూరిపోతాయి, లాయర్!" తనని బంధించిన వ్యక్తి మాటలు కఠోరంగా కరుణాకర్ చెవిలో దూరాయి.

అప్రయత్నంగా అతను రెండు చేతుల్తో పొట్టని నొక్కుకున్నాడు. బిగించిన పిడికిలీ, చాకుపిడీ తన పొట్ట మీద గుచ్చుకున్నాయనిపిస్తోందతనికి. తెగించిన కసాయి చేతుల్లో తను ఇరుక్కున్నాడు. తలకిందికి వాల్చి, ఆలోచించడంమాని, వొగరుస్తూ కూచున్నాడు కరుణాకర్. ఏదో భయం అతని హృదయంచుట్టూ, ఉక్కు పిడికిలిలా బిగుసుకుంటోంది....

• • •

సడన్ బ్రేకుతో కారు ఆగించి. డోర్ తెరవబడింది. కరుణాకర్ బలంగా కిందికి లాగబడ్డాడు. తూలిపడ బోతున్న అతన్ని పోతరాజు బనియన్ పట్టుకొని లేవ నెత్తాడు.

కరుణాకర్ ఆందోళనగా చుట్టూ చూసాడు.

చుట్టూ చీకటి. చలిగాలి రివ్వున వీస్తోంది. కీచురాళ్ళు విసుగూ విరామంలేకుండా అరుస్తూ చీకటి వాతావర ణానికి నేపథ్య సంగీతం అందిస్తున్నాయి.

కారు డ్రైవ్ చేసిన వ్యక్తి తమ దగ్గరగా వస్తు న్నాడు. కరుణాకర్ తనని పట్టుకున్న వ్యక్తిని చూశాడు.

"మిస్టర్ — మీకు ఏం కావాలి ....?"

జవాబుగా పోతరాజు చెయ్యి అతని మొహంపైపు పిడుగులా దూసుకొచ్చింది. ఎడమ చెంప పగిలినట్టనిపించింది కరుణాకర్ కి.

అతనిలోని ఆశ్చర్యం, భయం కోపంగా మారుతున్నాయి. సభ్యతా, సంస్కారం కలిగిన తనను ఎవడో మొరటు వ్యక్తి అకారణంగా హింసించి అవమానిస్తున్నాడు. చీకట్లో అతని పిడికిళ్ళు బిగుసుకున్నాయి. పెదవుల సందులోంచీ యేదో వెచ్చగా కారుతోంది. నాలుకతో తడువుకున్నాడతను. రక్తం! బుగ్గ బూరెలా పొంగుతూ మంట పెడుతోంది. చెవికింద యేదో వాచినట్టనిపిస్తోంది.

బిగించిన కరుణాకర్ పిడికిళ్ళు పైకిలేవబోయాయి. వెనకనుంచీ యెవరో అతని రెండు చేతుల్నీ బలంగా పట్టుకున్నారు. మెలితిప్పి, వెనక్కి విరుస్తున్నారు.

"ఇది నీ కోర్టు కాదు, లాయర్! ప్రశ్నలు అడక్కు" అంటూ పోతరాజు అతన్ని ముందుకి లాగాడు. అతని రెండు చేతుల్నీ కలిపి, వెనకభాగంలో ఒకే చేత్తో బిగించి పట్టుకున్న జాకీ కిచకిచ నవ్వుతూ తోసుకుంటూ నడవసాగాడు.

కాసేపట్లో తలుపు తోసుకొని చీకటికి పుట్టిల్లులా వున్న హాల్లోకి ప్రవేశించారు ముగ్గురూ.

చెరోవైపున నడుస్తూ, పోతరాజు, జాకీ కరుణాకర్ని మెట్లమ్మట పైకి తీసుకెళ్ళారు.

మెట్లు మాయమయ్యాయి. పది అడుగుల దూరం నడిచాక, ఒక తలుపుముందు ఆగారు.

కరుణాకర్ మెడచుట్టూ, పోతరాజు వేళ్ళు ఇనప

తీగల్లా బిగుసుకున్నాయి. అటుపక్కనున్న డ్రైవర్ అతని చేతుల్ని వదిలేసాడు.

మరుక్షణం కరుణాకర్ బలంగా ముందుకి తోయబడ్డాడు.

ముందుకు వాలిన అతని తల యేదో తలుపుకి తాకింది. అసంకల్పితంగా అతను రెండు చేతుల్నీ ముందుకి చాచాడు. వెనక్కి కదులుతున్న రెండు తలుపుల్ని అతని రెండు అరచేతులూ ఆనుకున్నాయి. విసురుగా గదిలోకి పడిపోయాడతను. తల నేలకి తాకింది. కళ్ళు బైర్లు కమ్ముతున్నాయి.

మెల్లిగా తల విదిల్చాడతను. తలుపు మూస్తున్న శబ్దం. పైకి లేవడానికి ప్రయత్నిస్తున్న కరుణాకర్ రెక్కల్ని రెండు చేతులు వెనకనుంచి పట్టుకుని, అతన్ని అవలీలగా పైకి లాగాయి.

తల విదిల్చి, కళ్ళు చిట్లిస్తూ చూశాడతను.

గదిలో లైటు వెలుగుతోంది. గదిమధ్యలో వున్న మంచంమీద;మంచంమీద అచేతనంగా అనాచ్ఛాదితంగా పడున్న ఆకారంమీద అతని చూపులు నిలిచాయి. ఎవరు? గీతా? ఒకసారి కళ్ళుమూసి, తెరిచి ఆందోళనతో చూశాడతను.

పోతరాజు రెయ్యి అతన్ని కంట్రోల్ చేస్తోంది. కరుణాకర్ని మంచం దగ్గరగా తోశాడతను. కరుణాకర్ తూలిపడ్డాడు. అతని చేతులు మంచం ఫ్రేముని పట్టుకుని, దెబ్బతగలకుండా ఆపాయి.

"లాయర్ సాబ్, మనం ఆలస్యంగా వచ్చాం!" పోతరాజు ఎగతాళిగా నవ్వుతూ అన్నాడు.

కరుణాకర్ మాట్లాడలేదు. తల తిప్పలేదు.

మెల్లిగా పైకి లేచాడు. అతని చూపులు మంచంమీద నగ్నంగా పడుకున్న ఆకారంమీదే తాపడం అయి పోయాయి.

చక్కగా, నాజూకుగా, దుస్తులు ధరించి, సభ్యతగా, చలాకీగా తనకి కనిపించే గీత—నగ్నంగా, అచేతనంగా మంచంమీద పడుంది. ఆమె దుస్తులు చిరిగి, మంచంపక్కనే పడున్నాయి. ఎర్రటి గీతల్తో నిండిన ఆమె ఛాతీ, కనిపించీ కనిపించకుండా కదుల్తోంది.

కరుణాకర్ సర్వాన్నీ మరిచిపోయి ఆమెనే చూస్తూ వుండిపోయాడు. అతని పెదవులు ఎండిపోతూ అదురుతున్నాయి.

ఎవరో నలిపిపారేసిన తీగలా గీత మంచంమీద పడుకుంది. దుప్పటిమీద అక్కడక్కడ రక్తం మరకలు.

కరుణాకర్ శరీరం గజగజ వణకడం ప్రారంభించింది, అతని చూపులు ఆమె మొహం మీదికి జరిగాయి.

పొడుగాటి జుట్టు చెల్లాచెదురుగా వుంది. చిట్లిపోయిన పెదవులమీద రక్తం గడ్డకట్టింది. బుగ్గలమీద గాట్లు కత్తితో గీసిన గీతల్లా వున్నాయి. గీత! గీతకి నిజంగా అపాయం సంభవించింది!

కరుణాకర్ భయంతో అరవబోయాడు. పోతరాజు అరచెయ్యి పెనంలా అతని మొహమ్మీద చప్పుడు చేస్తూ పడింది. అతని కేక లోపలే అణిగిపోయింది, పెదవి చిట్లి, మండపాగింది. నీళ్ళతో నిండుతున్న అతని కళ్ళు మండుతున్నాయి.

"నోరు తెరవకు!" పోతరాజు హుంకరించాడు.

అతని సైగతో జాకీ కరుణాకర్ చేతుల్ని వెనకనుంచీ

విరిచి పట్టుకున్నాడు. పోతరాజు చెయ్యి అతని మొహం మీంచి దూరంగా జరిగింది. జేబులోంచి కత్తిని తీసి, మంచంమీద ఆమె శరీరం పక్కనే పెట్టాడతను. తల పైకెత్తి కరుణాకర్ని చూశాడతడు.

"నీ అసిస్టెంటు అందాన్ని కళ్ళారా చూడు. కళ్ళకి పండగ చేసుకో!" అన్నాడతను వెటకారంగా.

కరుణాకర్, ఆగ్రహంతో పళ్ళు కొరికాడు. "యూ బ్రూట్! యూ...."

పోతరాజు పిడికిలి రోకలిలా కరుణాకర్ పొట్టలో గుచ్చుకుంది.

అతను వోగుయస్తూ కిందికి వొంగిపోయాడు. వెనక నుంచి జాకీ అతన్ని నిటారుగా లాగాడు. చేతుల్ని విడిపించుకోడానికి కరుణాకర్ గింజుకున్నాడు. జాకీ చేతులు అడకత్తెరలా బిగుసుకున్నాయి. వాళ్ళ పశుబలం ముందు తన మానవబలం చాలడంలేదు. కరుణాకర్ బరువుగా నిట్టూర్చాడు.

పోతరాజు చెయ్యి మళ్ళీ పాంటు జేబులోకి వెళ్ళింది. పల్చటి గ్లవ్స్ తీసి, తీరుబడిగా రెండు చేతులకీ తగిలించుకున్నాడతను.

మంచం పక్కనే పడున్న గీత వానిటీబాగ్ లోంచి తెల్లటి సిల్కు జేబురుమాల్ని తీసి, ఆమె మొహంమీద కప్పాడతను. జరగబోయే దారుణం కరుణాకర్ కళ్ళకి కట్టినట్టు కనిపిస్తోంది.

"నో!" అసంకల్పితంగా, బిగ్గరగా అరిచాడతను.

పోతరాజు అతనిముందు నిలబడి, అతని మొహంలోకి నవ్వుతూ చూశాడు. అతని నడుంచుట్టూ రెండు చేతుల్నీ నిపోచ్చి, జాకీ చేతుల్లో యిరుక్కున్న రెండు చేతుల్నీ

విడిపించి, ముందుకి లాక్కొచ్చాడు.

"ఒక చేత్తో వకీలుగారి వంకీలజుట్టుని గట్టిగా పట్టుకో. ఆయన చేతుల్లో కొంచెం పనుంది. రెండో చేత్తో ఆయన నడుముని గొలుసులా బంధించు!" పోతరాజు నవ్వుతూ తన అనుచరుణ్ని ఆజ్ఞాపించాడు.

జాకీ చెయ్యి కరుణాకర్ జుట్టుని కర్కశంగా పట్టుకుంది. అతని ఎడమ చెయ్యి పాములా నడుంచుట్టూ అల్లుకుంది. అతని భల్లూకం పట్టులో పక్కటెముకలు విరిగిపోతాయనిపిస్తోంది కరుణాకర్‌కి. ఊపిరి పీల్చుకోడం కష్టమవుతోంది.

పోతరాజు కరుణాకర్ రెండు మణికట్లనీ ఒక చేత్తో బిగించి, గీత తల దగ్గరగా పడున్న తలగడని ఆమె మొహంమీద జాగ్రత్తగా పెట్టాడు.

"నో! వద్దు!" కరుణాకర్ మళ్ళీ అరిచాడు. తటాలున అతని తల వెనక్కి లాగబడింది. మెడ విరిగినట్టనిపిస్తోందతనికి. పళ్ళు బిగిస్తూ బాధని దిగమింగే ప్రయత్నం చేశాడు. తలమీద చర్మం వూడివచ్చేలా వుంది.

పోతరాజు చేతులు, అతన్ని మరికొంచెం ముందుకి లాగాయి. బలమయిన వేళ్ళు అతని వేళ్ళని విడదీస్తూ పట్టుకున్నాయి. పోతరాజు, మంచం అటువైపు జరిగి తలవైపు నించున్నాడు. విడదీసి పట్టుకున్న కరుణాకర్ అరచేతుల్ని గీత మొహంమీద, తలగడమీద వుంచాడు. ఆ అరచేతుల వెనుకభాగాలమీద గ్లవ్స్‌లో దాక్కున్న తన అరచేతుల్తో నొక్కడం ప్రారంభించాడు.

"ప్లీస్ ....వద్దు....ఆమెని .... చంపొద్దు....వద్దు....!" కరుణాకర్ దీనంగా అరవసాగేడు. రెండు కంఠాలు యెగతాళిగా నవ్వుతూ అతని అరుపులతో శ్రుతి కలి

పాయి.

తన చేతుల్ని దూరంగా లాగడానికి విశ్వప్రయత్నం చేస్తూ కరుణాకర్ గీత శరీరాన్ని ఓరగా చూశాడు. అంత సేపూ నిశ్చలంగాపడున్న గీత శరీరంలో కదలిక ప్రారంభ మైంది. పచ్చగా మెరుస్తున్న ఆమె చేతులూ, కాళ్ళూ మెలికలు తిరగడం ప్రారంభించాయి. ఊపిరి అందని ఆమె శరీరం తల నరకబడిన పాములా మెలికలు తిరుగు తోంది.

పొంగిపొర్లుతున్న కన్నీళ్ళు, ఆమె పడుతోన్న నరక యాతన కనిపించకుండా కరుణాకర్ కళ్ళముందు తెర పట్టాయి. బొంగురు కంఠంతో అతను నిస్సహాయంగా రోదిస్తూ వుండిపోయాడు.

కాసేపట్లో అతని చేతులు తలగడమీద అటూ ఇటూ కదిలించబడుతున్నాయి. మంచం ఫ్రేమునీ, పరుపునీ తడుపుతున్నాయి. రెప్పలు గట్టిగా మూసి తెరిచాడతను. కన్నీటి తెర కరిగిపోయింది. అశ్రువులు వెచ్చగా అతని బుగ్గలమీద జారుతున్నాయి.

అతను తనని హింసిస్తున్న షాతరాజునీ, తననీ మరిచి పోయాడు. ఆత్రంగా గీత శరీరాన్ని చూశాడు. గీత శరీ రంలో చలనం లేదు.

కరుణాకర్ ఆత్రంగా ఆమె మొహంలోకి చూశాడు. ఆమె మొహంలో యేదో లోపించింది. ఆమెని చంపిన తలగడా, జేబురుమాలూ ఆమె తలపక్కనే పడున్నాయి. ఆమె ఛాతీ కదలడంలేదు.

గీత మరణించింది. గీత హత్య చేయబడింది! తన శిష్యు రాలు తన చేతుల్లో హత్య చేయబడింది! ఎందుకు? ఏమిటి? అదంతా యెందుకు జరుగుతోందో. యెందుకు

జరిగించబడుతోందో ఊహించలేనంతగా అతని మెదడు మొద్దుబారిపోయింది.

అతని చేతులు రెండూ వెనక్కి విరచబడ్డాయి. యెవరో, యెవరికో, యేదో చెప్తున్నారు. అతని కడుపులో యేదో రంగులరాట్నం తిరగడం ప్రారంభించింది. వాంతి అయ్యేలా వుంది.

అతని జుట్టుని పట్టుకున్న వేళ్ళు యింకా బిగుసుకున్నాయి. అతని శరీరం సగానికి, ముందుకి వంచబడింది. గీత మొహానికి అడుగు దూరంలో తన మొహం వుంది.

పోతరాజు నిర్లిప్తంగా వున్న గీత రెండు చేతుల్నీ తన చేతుల్లో పట్టుకున్నాడు. అతని వేళ్ళమధ్య యిరుక్కున్న గీత వేళ్ళు కాడల్లా వున్నాయి. గోరింటాకుతో మెరుస్తున్న గోళ్ళు వాడి కత్తుల్లా వున్నాయి.

కరుణాకర్ ఆ ఎర్రటి గోళ్ళనే రెప్పవేయకుండా చూస్తున్నాడు.

ఏం జరుగుతుందో అతను ఊహించేలోగా, పోతరాజు చేతులు అటూలున పైకి లేచాయి. ముందుకి వంచబడిన కరుణాకర్ మొహంమీద గీత గోళ్ళు గుచ్చుకున్నాయి. పోతరాజు బలంగా నొక్కుతూ అటూలున గీత చేతుల్ని కిందికి లాగాడు. వాడికోరల్లా ఆమె గోళ్ళు కరుణాకర్ బుగ్గల్ని చీరేస్తూ కిందికి జారాయి.

అప్రయత్నంగా కరుణాకర్ కెవ్వుమన్నాడు.

గీత గోళ్ళు తయారుచేసిన నాగేటిచాళ్ళలో రక్తం ఉబుకుతూ కాలువలుగా సాగింది. కారుతున్న కన్నీళ్ళు రక్తాన్ని పల్చగా చేస్తున్నాయి.

గీత చేతుల్ని వదిలేసి పోతరాజు కొంచెం పక్కకి జరిగాడు. స్వహస్తాలతో చెక్కిన శిల్పాన్ని చూస్తున్న శిల్పిలా కరుణాకర్ మొహాన్ని సంతృప్తికరంగా చూశాడు.

అతని చెయ్యి పిడికిలిగా మారి, నల్లత్రాచు పడగలా కదిలింది. అసహాయంగా కిందికి వాలివున్న కరుణాకర్ కణతమీద సమ్మెటలా వాలింది. అతని తల తటాలున పక్కకి కదిలింది.

కరుణాకర్ వెంట్రుకల్ని, పిడికిలితో బిగించి పట్టుకున్న జాకీ కంగారుగా చూశాడు.

పోతరాజు అతన్ని గర్వంగా నవ్వుతూ చూశాడు. జాకీ వేళ్ళు వదులయ్యాయి. కరుణాకర్ తల కిందికి వేళ్ళాడుతోంది. పోతరాజు అతని చెవికింద వేళ్ళు ఆనించి, పరీక్షించాడు. నవ్వుతూ జాకీని చూశాడు.

“అరగంటలో మేలుకుంటాడు!” అంటూ కరుణాకర్ శరీరాన్ని గీతమీద పడేలా, మంచంపైకి తోశాడు. జాకీ చేతులు నలుపుకుంటూ, వోరగా గీత శరీరాన్ని చూస్తున్నాడు.

పోతరాజు ముందుకి వంగాడు. మంచంమీద పడున్న కత్తిని జేబులో పడేసుకున్నాడు. పక్కవాటంగా పడున్న కరుణాకర్ బనియన్ ముందుభాగాన్ని ఫర్రున చించాడు. అచేతనంగా పడున్న అతని చేతిని, అచేతనంగా వున్న గీత ఛాతీమీద అడ్డంగా వుంచాడు.

తను యేర్పాటుచేసిన సీన్ని తృప్తికరంగా చూశాడు. నవ్వుతూ జాకీని చూశాడు. “వాడి అండర్ వేర్ని లాగి కిందపడేయ్. ఆ గీత నగలుగానీ వదిలేయ్ ఏ వస్తువునీ ముట్టుకోకుండా కిందికి దిగిరా! ఈ గదిలో జరిగిన రేప్

అండ్ మర్డర్ గురించి పోలీసులకి రిపోర్టు ఇద్దాం. తెలిసిన నేరాల గురించి పోలీసులకి తెలియజేయడం పౌరుల కర్తవ్యం!" అన్నాడు నవ్వుతూ.

జాకీ పళ్ళు యికిలిస్తూ తన పనికి ఉపక్రమించాడు.

*  *  *

చిందరవందరగా వున్న క్రాఫు, ఎర్రటి కళ్ళు, మాసిన గడ్డం బాగా నలిగి మట్టికొట్టుకుపోయిన పైజామా లాల్చీ. కరుణాకర్ బోనులో నిలబడి కోర్టుహాలుని కలయజూశాడు.

హాలు జనంతో క్రిక్కిరిసి వుంది. ప్రజలు, ప్రెస్ రిపోర్టర్లు, లాయర్లు. తన మిత్రులైన ఒకరిద్దరు అడ్వో కేట్లు మొహాల్లో తిప్పించి, యెక్కడా తనపట్ల సాను భూతి కనిపించడంలేదు.

కరుణాకర్ చూపులు పక్కకి తిరిగాయి.

జడ్జి గోస్వామి గంభీరంగా కూచున్నాడు. మొహం మీద యే భావమూ కనిపించనివ్వకుండా ప్రయత్నిస్తు న్నట్టుంది అతని వాలకం. యెన్నో ట్రయల్స్‌లో, యెన్నో సార్లు తన వాదనని మెచ్చుకున్న జడ్జి గోస్వామి ఈ క్షణంలో తన గురించి యేమనుకుంటున్నాడు? కరుణాకర్ కళ్ళు మెల్లిగా జ్యూరీ సభ్యులవైపు తిరిగాయి. ముగ్గురు మహిళలు. ముగ్గురు పురుషులు.

"మిస్టర్ కరుణాకర్ ..."

పబ్లిక్ ప్రాసిక్యూటర్ కంఠం గంభీరంగా ధ్వనిం చింది. కరుణాకర్ మెల్లిగా తల తిప్పి అతన్ని చూశాడు.

ఇంట్లో, దొడ్లో చాలాసేపు ఉరకలు పెడుతూ తప్పిం చుకుతిరిగి, చివరికి తన కత్తికిందికి చిక్కిన కుందేలుని

చూస్తున్న వంటవాడి చూపుల్లా, వున్నాయి తనని చూస్తున్న గజాననరావు చూపులు.

ఏదో సంతృప్తి అతని ముఖాన్ని కొత్త చర్మంలా అంటిపెట్టుకునివుంది. ఇతర్ల కేసుల్లో ప్రతిసారీ తనని ఓడించిన అడ్వొకేట్ కరుణాకర్, ఇప్పుడు సొంత కేసులో తన చేతికి రెక్కలు తెగిన పావురంలా దొరికిపోయాడని అతను అనుకుంటున్నాడా?....

“మిస్టర్ కరుణాకర్, ఈ నెల మూడో తేదీ రాత్రి మీరు మీ భార్య శ్రీమతి నర్మదకి విషం కలిపిన హార్లిక్స్ తాగించి, హత్య చేశారు. అదే రాత్రి పార్కురోడ్డులోని 114 నంబరు యింట్లో, మీదగ్గర అప్రెంటీస్ చేస్తున్న కుమారి గీతను మానభంగం చేసి, దారుణంగా హత మార్చారు. ఈ మూడు నేరాలూ మీరు చేసినట్టు ఒప్పుకుంటున్నారా?” పబ్లిక్ ప్రాసిక్యూటర్ గజాననరావు కంఠం కోర్టుహాల్లోని చెవిటివాడికూడా వినిపించేలా ఖంగుమంది.

కరుణాకర్ నిప్పుకణాల్లా వున్న కళ్ళతో అతన్ని తదేకంగా చూశాడు. అతని చేతులు పిడికిళ్ళుగా బిగుసుకున్నాయి. పెదవులు వణుకుతున్నాయి. అతని చూపుల్ని గమనిస్తున్న గజాననరావు జడ్జివైపు సాభిప్రాయంగా చూశాడు.

“మిస్టర్ కరుణాకర్, ప్రశ్నకి సమాధానం ఇవ్వండి!” జడ్జి గోస్వామి హెచ్చరించాడు.

కరుణాకర్ తల మెల్లగా జడ్జివైపు తిరిగింది. నిరపరాధుల తరఫున వాదిస్తూ, గతంలో విజయవంతంగా, సగర్వంగా జడ్జివైపు చూసిన తను, బోనెక్కి నిందితుడుగా, నిస్సహాయంగా చూడాల్సి వచ్చింది. కరుణాకర్ మళ్ళీ

పబ్లిక్ ప్రాసిక్యూటర్ వేపు చూశాడు. ప్రాసిక్యూటర్ కళ్ళు అతన్ని సవాలు చేస్తున్నాయి.

"నేను ఏ నేరమూ చేయలేదు...." కరుణాకర్ కంఠం భావావేశంతో వణికింది. తన మాటలు ప్రాసిక్యూటర్ మీద యెలాంటి ముద్ర వేశాయో, అతని చిరునవ్వులో కనుక్కోలేకపోయాడు కరుణాకర్.

"కరుణాకర్ నువ్వు న్యాయశాస్త్రం చదువుకున్న అడ్వొకేట్ వి. నిజం చెప్తానని ఓత్ తీసుకున్నావ్. స్పీక్ ది ట్రూత్!" ప్రాసిక్యూటర్ గజాననరావు గంభీరంగా అరిచాడు.

నిజం! తను చెప్పే నిజం అబద్ధంలా ధ్వనిస్తుంది. నిజాన్ని మింగి జీర్ణం చేసుకునేలా అబద్ధం బలిసింది. తను పలికే ప్రతి మాటకీ మరో అర్థాన్ని అందించే విచిత్ర పరిస్థితులు తెలివిగా కల్పించబడ్డాయి....

"అబద్ధమాడాల్సిన అవసరం నాకు లేదు!" కరుణాకర్ బరువుగా నిట్టూర్చాడు.

గజాననరావు నవ్వులో వెటకారం ధ్వనించింది. అతను తీక్షణంగా కరుణాకర్ ని చూశాడు.

"మూడో తారీఖు రాత్రి నీ భార్య నర్మదకి హార్లిక్స్ యెవరు కలిపిచ్చారు?"

"నేనే."

"అప్పుడు టైమ్ ఎంతయింది?" గజాననరావు ప్రశ్నించాడు.

"పదకొండు."

"ఆ వేళ దాకా ఆమె మేలుకునే వుందా?"

"లేదు."

"నిద్రపోతున్న గర్భిణీ స్త్రీని లేపి, రాత్రి పదకొండు

గంటలప్పుడు హార్లిక్స్ ఇవ్వాల్సిన అవసరం?"

"గీతే ఆమె హార్లిక్స్ తాగాలి. డాక్టర్ సలహా."

"ఐసీ....ఆమె మెలకువగా వున్నప్పుడే యిచ్చివుండొచ్చుగా?"

"ఏదో పనిలోవుండి మరచిపోయాను. ఆమే మరిచిపోయింది."

"మరిచిపోయినట్టు నటిస్తూ, ఆమె బాగా నిద్రపోయాక, లేపి, నిద్రమత్తులో వున్న ఆమెకి విషం కలిపిన హార్లిక్స్ తాగించావు. అవునా?"

కరుణాకర్ అతన్ని రౌద్రంగా చూశాడు. వేడిగా నిట్టూర్చాడు.

"అంత పాడు పని చేయాల్సిన అవసరం నాకు లేదు...."

గజాననరావు ఎగతాళిగా నవ్వాడు. "అవసరం వుందో లేదో త్వరలో తేలుతుంది! కరుణాకర్, గీత అంటే నీకు అభిమానం వుండేది. అవునా?"

"ఔను."

"ఆమెను నువ్వు ప్రేమించావు అవునా?"

"ప్రేమించాను. కానీ, మీరు ధ్వనిస్తున్న అర్థంలో కాదు!"

ప్రాసిక్యూటర్ గజాననరావు చిన్నగా నవ్వాడు. "నీ భార్య గర్భవతి అయ్యాక, మూడు నెలలుగా మీ ఇద్దరిమధ్యా డాక్టర్ ప్రసన్న లైంగిక సంబంధాన్ని నిషేధించింది. అవునా?"

"నర్మద ఆరోగ్య పరిస్థితి దృష్ట్యా ఆమె అలా నిర్ణయించింది."

"దగ్గరున్న భార్య శారీరకంగా దూరమైనప్పుడు,

ఏ వయసులో వున్న మగాడికి మరో ఆడదానిమీద, వ్యక్తిత్వం రోజంతా తన ఇంటి పెట్టుకుని వుండే మగో అందగత్తె అయిన స్త్రీమీద కోరిక సహజంగా పుడుతుంది....” గజాననరావు చెప్పుకుపోతున్నాడు.

“మీలాంటి వాళ్ళకి అలాంటి కోరిక పుట్టొచ్చు. నాలో పుట్టలేదు! నాలో అలాంటి బలహీనత లేదు!” కరుణాకర్ గర్జించాడు.

ప్రాసిక్యూటర్ చిన్నగా నవ్వాడు. “అలాంటి బలహీనత నీలో బలంగా వుందని త్వరలో తేటతెల్లమవుతుంది! ఆల్ రైట్....మూడో తారీఖు రాత్రి పార్కు రోడ్డులోని 114 నెంబరు ఇంటికి వెళ్ళావు....”

“నేను వెళ్ళలేదు. తీసుకుపోబడ్డాను!” కరుణాకర్ అడ్డొస్తూ అన్నాడు.

“ఎవరు తీసుకెళ్ళారు?”

“ఎవరో నాకు తెలీదు. ఇద్దరు వ్యక్తులు కత్తి చూపిస్తూ నన్ను లాక్కెళ్ళారు....”

“ఇద్దరు వ్యక్తులు.... వాళ్ళు ఎలావున్నారు?”

“ఒకతను పొడుగ్గా లావుగా వున్నాడు. రెండో అతను పొట్టిగా లావుగా వున్నాడు.”

గజాననరావు చిన్నగా నవ్వాడు. “అలాంటి వ్యక్తులు ఈ నగరంలో సవాలక్షమంది వున్నారు! ఆల్ రైట్, ఆ ఇంట్లోకి రప్పించుకున్న మిస్ గీతను అనుభవించే ప్రయత్నం చేశావు. ఆమె తిరగబడింది. ఒళ్ళు తెలీని కామంతో ఆమెని రేప్ చేశావు. నీ అపరాధం బైటపడుతుందన్న భయంలో ఆమెని చంపేశావు. దీనంతా దారి మళ్ళించడానికి ఒక లావుపాటి పొడుగు వ్యక్తినీ, లావుపాటి పొట్టి వ్యక్తినీ సృష్టించావు. అవునా?”

కరుణాకర్ ప్రాసిక్యూటర్ని తీక్షణంగా చూశాడు. "లేదు. లేదు. లేదు!"

గజాననరావు నిర్లక్ష్యంగా నవ్వుతూ జడ్జివైపు తిరిగాడు.

"మిస్టర్ జస్టిస్, ప్రాసిక్యూషన్ తరఫున మొదటి సాక్షిగా పోలీస్ ఇన్‌స్పెక్టర్ సుధాకర్‌ని పిలవడానికి అనుమతించమని కోరుతున్నా" అన్నాడు గంభీరంగా.

జడ్జి గోస్వామి తల పంకించాడు. "మిస్టర్ కరుణాకర్, కోర్టు నిబంధనలు మీకు తెలుసు. మీ కేసుని మీరే డిఫెండ్ చేసుకోవచ్చు. మీకు ఇష్టంలేకపోతే, కోర్టు మీ తరఫున లాయర్ని నియమిస్తుంది...."

"నో థాంక్స్, మిస్టర్ జస్టిస్," కరుణాకర్ మెల్లగా అన్నాడు.

జడ్జి గోస్వామి మళ్ళీ తలపంకించాడు. "ప్రాసిక్యూటర్, మీ సాక్షిని పిలవండి" అన్నాడు.

• • •

పోలీస్ ఇన్‌స్పెక్టర్ సుధాకర్ బోనెక్కి ప్రమాణం చేశాడు. పబ్లిక్ ప్రాసిక్యూటర్ అతన్ని చిరునవ్వుతో చూశాడు.

"మిస్టర్ సుధాకర్, మీ ఉద్యోగం?" ప్రశ్నించాడతను.

"ఇన్‌స్పెక్టర్ ఆఫ్ పోలీస్" సుధాకర్ సగర్వంగా అన్నాడు.

"మూడో తారీఖు రాత్రి మీరు డ్యూటీలో వున్నారా?"

"ఉన్నాను."

"ముద్దాయి కరుణాకర్‌ని మీరే కస్టడీలోకి తీసు

కున్నారా?"

"అవునండి."

"ఆ రోజు ఏం జరిగిందో కోర్టువారికి వివరిస్తారా?" ప్రాసిక్యూటర్ అన్నాడు.

ఇన్‌స్పెక్టర్ సుధాకర్ దగ్గి గొంతు సవరించుకున్నాడు. "ఆ రాత్రి నేను స్టేషన్‌లో వున్నాను. పన్నెండుగంటలా నాలుగు నిమిషాలకి టెలిఫోన్ మోగిందండి. నంబర్ 114, పార్క్ రోడ్‌లో యేదో హత్య జరుగుతున్నట్టుందని ఎవరో ఫిర్యాదు చేశారు...."

"ఎవరు?" ప్రాసిక్యూటర్ అడ్డొస్తూ ప్రశ్నించాడు.

"ఎవరో తెలీదండి. పురుష కంఠం. ఎవరని ప్రశ్నించాను. జవాబు చెప్పకుండా డిస్కనెక్టు చేశాడా వ్యక్తి. టెలిఫోన్ ఎక్స్ఛేంజికి ఫోన్ చేశాను. ఆ ఫోన్ కాల్ బస్టాండులో వున్న టెలిఫోన్ బూత్ లోంచీ వచ్చిందని కనుక్కున్నాను. అలాంటి ఫోన్ కాల్ ప్రాక్టికల్ జోక్ అని ఖచ్చితంగా తేలేదాకా, సీరియస్‌గానే తీసుకోడం మంచిది. అంచేత బలగంతో పార్కురోడ్డులోని ఆ ఇంటికి హుటాహుటిని వెళ్ళాను.

"ముందు తలుపు లోపల్నుంచీ, బిగించబడి వుంది. అక్కడ యిద్దరు సాయుధ పోలీసుల్ని కాపలా వుంచి వెనకవైపుకి దూసుకెళ్ళాను. వెనక తలుపు తెరుచుకొని, పారిపోడానికి ప్రయత్నిస్తున్న కరుణాకర్‌ని ప్రశ్నించాను. ఎవరో ఇద్దరు వ్యక్తులు తనని తీసుకువచ్చారనీ మానభంగం చేయబడి, స్పృహతప్పివున్న తన అసిస్టెంట్ గీతను తనచేతుల్తో హత్యచేశారనీ వెర్రిగా వాగాడు.

"గీరుకుపోయిన బుగ్గలూ, చిరిగిన బనియన్, అతని

కంగారూ వాలో అనుమానం పుట్టించాయి. అతన్ని తీసుకుని, మేడమీదున్న గదిలోకి వెళ్ళాను. గదిలో ఒక యువతి నగ్నంగా, నిర్జీవంగా పడుంది....."

"ఒక్క క్షణం...." అంటూ ప్రాసిక్యూటర్ గజానన రావు బల్లమీదున్న కవర్లోంచి ఒక ఫోటో లాగాడు. ఇన్‌స్పెక్టర్ సుధాకర్ కి అందించాడు. "ఈ ఫోటో చూడండి. ఆ అమ్మాయి దేనా?"

"ఆ అమ్మాయిదే" ఇన్‌స్పెక్టర్ సుధాకర్ ఫోటోని ప్రాసిక్యూటర్ కి అందించాడు.

ప్రాసిక్యూటర్ దాన్ని జడ్జి గోస్వామికి అందజేశాడు. "మిస్టర్ జస్టిస్, ఈ ఫోటోని పీపుల్స్ ఎగ్జిబిట్ నంబర్-1 గా స్వీకరించమని కోరుతున్నా" అన్నాడు.

హత్య చేయబడిన గీత ఫోటోని జడ్జి గోస్వామి కళ్ళద్దాలగుండా విచారంతో చూశాడు. కాసేపట్లో ఫోటో జ్యూరీ సభ్యులకి అందజేయబడింది. ఫోటో చూస్తున్న వాళ్ళ మొహాల్లోని భావాలు చదువుతూ ప్రాసిక్యూటర్ కాసేపు మౌనంగా వుండిపోయాడు. ఫోటో మార్క్ చేయబడి, రికార్డులోకి తీసుకోబడింది.

"ఇన్‌స్పెక్టర్, తరవాత?"

"గదిలోని శవం తన అసిస్టెంట్ గీతది అన్నాడతడు. చూడగానే ఆమె రేప్ చేయబడిందని అర్థమైంది. చీరా పెట్టీకోట్, చిరిగిపోయిన జాకెట్టూ, తెగిపోయిన బ్రాసియర్, నేలమీద కుప్పగా పడున్నాయి. నీలంరంగు అండర్ వేర్ వాటి పక్కనే పడుంది".

"ఆ అండర్ వేర్ ఎవరిదో కనుక్కున్నారా!" ప్రాసిక్యూటర్ అడ్డు తగిలాడు.

"తనదే అని కరుణాకర్ ఒప్పుకున్నాడు."

మీ అభిమాన డిటెక్టివ్ రచయిత

మల్లాది వెంకటకృష్ణమూర్తి

చాలా కాలం తర్వాత రాసిన డిటెక్టివ్ నవల

'మిష్టర్ వి'

వెల: రూ. 30/-

జులై 1 న విడుదల అయింది.

కట్నం కోసం పెళ్ళికాని పిల్లల్ని వివాహం చేసుకుని ఆ కట్నం డబ్బుతో వుడాయించే దుర్మార్గుడికోసం వెదికి, వేటాడి డిటెక్టివ్ పని చేసే ఓ సాహసిక యువతి కథ ఇది.

డిటెక్టివ్ నవలల్లో వుండే థ్రిల్స్, ఇన్వెస్టిగేషన్, సస్పెన్స్ వయొలెన్స్ 'మిష్టర్ వి' లో పుష్కలంగా వుంటాయి.

డిటెక్టివ్ పాఠకులకి

'మిష్టర్ వి'

చక్కటి విందు.

శ్రీ మహాలక్ష్మి బుక్ ఎంటర్ప్రైజెస్

మ్యూజియం రోడ్ : : విజయవాడ - 2.

"వెరీగుడ్. చెప్పండి!"

"శవం తల దగ్గరగా తెల్లటి సిల్కు రుమాలుంది. అంచుమీద క.క. అన్న ఇంగ్లీషు అక్షరాలున్నాయి ఎర్ర రంగులో. అదీ తనదే అనీ, తనే గీతకి ప్రెజెంట్ చేసాడనీ కరుణాకర్ అన్నాడు. అతన్ని అదుపులోకి తీసుకున్నాను."

"తరవాత?"

"మామూలు పోలీస్ ప్రొసీజర్ ఫాలో అయ్యాను. డాక్టర్నీ, వేలిముద్రల నిపుణుడ్నీ, పోలీస్ ఫోటోగ్రాఫర్నీ పిలిపించాను. కూలంకషంగా ఇన్వెస్టిగేషన్ సాగించాను. రేప్ అండ్ మర్డర్ నేరంమీద అరెస్టు చేసిన కరుణాకర్ ని తీసుకొని ఉదయం ఆరింటికి స్టేషన్ చేరుకున్నాను. అదృష్టవశాత్తూ పరిశోధన చకచకా సాగింది. రామానుజం గారు పొద్దుటే శవాన్ని చూసి, ఆమె తమ కుమార్తె, గీత అని పోల్చాడు. శవాన్ని పోస్టుమార్టమ్ కి పంపించాను. చార్జిషీట్ ఫైల్ చేసే సన్నాహంలో వున్న నాకు మరో చావు కబురు అందింది...."

"ఇన్స్పెక్టర్ సుధాకర్, ఆ విషయానికీ, మనం ఇప్పుడు చర్చిస్తున్న విషయానికీ సంబంధం వుందా?"

"ఉంది. రేప్ అండ్ మర్డర్ మీద అరెస్టయిన కరుణాకర్ భార్య శ్రీమతి నర్మద అనుమానాస్పదమైన పరిస్థితుల్లో మరణించింది. ఆమె మరణం గురించి రిపోర్ట్."

"ఎవరు రిపోర్టు చేశారు?"

"కరుణాకర్ పక్కింట్లో వున్న నిరంజనంగారు ఫోన్ చేశారండి. పొద్దుటే పాలవాడు వెళ్ళాడు. పిలిచాడు. ఎవరూ రాలేదు. తలుపు కొద్దిగా తెరిచివుంది. అతను

## "ముఖచిత్ర వ్యాఖ్యల పోటీ"

ఈ నెల "సప్లిమెంట్" ముఖచిత్రాలు (అట్టమీది బొమ్మ, అట్టచివరి బొమ్మ) పరిశీలించండి. రెండు ముఖచిత్రాలకు సంబంధం వుండేటట్లుగా ఒక్క-మాటలో గాని, చిన్న వాక్యంలో గాని, పోస్టుకార్డుపై వ్రాసి, ఈ నెల 6 వ తేదీలోపు మాకు చేరే టట్లు పంపండి.

'హోమ్ డెలివరీ' సభ్యులు తమ పూర్తి చిరునామాతో పాటు, తమ నెంబర్ కూడా వ్రాయాలి.

మాకు వచ్చిన వ్యాఖ్యలలో అత్యుత్తమమైన వ్యాఖ్యకు ఏడాది పాటు పత్రిక లేదా సప్లమెంట్ బహుమతిగా పంపుతాము.

## "హోమ్ డెలివరీ"

'హోమ్ డెలివరీ' సభ్యులకు 'అపరాధ పరిశోధన' పత్రిక మరియు సప్లిమెంట్ కాపీలు వాటి అసలు ధరకే అందజేయబడతాయి. అంతేకాదు - వారికి పత్రికలను ప్రతి నెలా 'రిజిష్టరు పోస్టు'లో పంపుతాము.

ప్రతి 6 నెలలకు ఒకసారి అంటే - జనవరి మరియు జూలై నెలల పత్రికలు మాత్రం V. P. ద్వారా పంపబడతాయి— దానికి మీరు అర్ధ సంవత్సర చందా రు. 84/-లు చెల్లించవలసి వుంటుంది. పోస్టు ఖర్చులన్నీ మేమే భరిస్తాము. పత్రికల ఖరీదుకు మించి మీరు పైసా చెల్లించ నవసరంలేదు.

'హోమ్ డెలివరీ' వల్ల పత్రికలు మీకు మరింత త్వరితంగా, గ్యారంటీగా అందుతాయి. పోస్టులో పోయే సమస్య ఎంత మాత్రం లేదు. ఇంకా నెలనెలా V. P. ద్వారా తెప్పించుకునే సౌకర్యంకూడా వుంది.

మరి - మీరు చేయవలసిందల్లా వెంటనే రు. 10/-లు పంపి శాశ్వతంగా 'హోమ్ డెలివరీ' సభ్యులుగా చేరటమే.

పూర్తి వివరాలకై 'అపన' చూడండి.

లోపల కెళ్ళాడు. హాలు కుడివైపున వున్న పడగ్గది తలు పులు పూర్తిగా తెరచి వున్నాయి. మంచంమీద కరుణాకర్ భార్య వెల్లకిలా పడుంది. ఆమె పెదవుల మీద ఈగలు వాలుతున్నాయి. పాలవాడికి అనుమానం వేసింది. పరు గెట్టుకెళ్ళి పక్కింటి నిరంజనంగారికి చెప్పాడు. ఆయన వెళ్ళి చూసి, అనుమానంమీద మాకు ఫోన్ చేశాడు...."

"మీరేం చేశారు?" ప్రాసిక్యూటర్ ప్రశ్నించాడు.

"ఎందుకైనా మంచిదని డాక్టర్ని, ఫింగర్ ప్రింట్స్ ఎక్స్పర్ట్ని, ఫొటోగ్రాఫర్ని తీసికెళ్ళాను. నేను అనుమా నించినట్టే జరిగింది...."

"మీరు యేమిటి అనుమానించారు?"

"గీతలాగే ఆమె కూడా హత్య చేయబడి వుండొచ్చను కున్నాను...."

"ఒక్క క్షణం!" జడ్జి గోస్వామి అడ్డొస్తూ అన్నాడు. ఇన్స్పెక్టర్ సుధాకర్, పబ్లిక్ ప్రాసిక్యూటర్ గజానన రావూ తలలు తిప్పి చూశారు.

"మిస్టర్ కరుణాకర్. మీరు, అబ్జెక్ట్ చేయొచ్చు. చేస్తున్నారా?" జడ్జి గోస్వామి ప్రశ్నించాడు.

కరుణాకర్ ఎర్రగావున్న కళ్ళని జడ్జి గోస్వామివైపు తిప్పాడు. అతని పెదవులు మెల్లిగా కదిలాయి. "నో అబ్జెక్షన్. మిస్టర్ జస్టిస్...."

జడ్జి గోస్వామి సానుభూతితో తల పంకించాడు. ప్రాసిక్యూటర్ని చూశాడు. "కానివ్వండి."

"నా అనుమానం నిజమే అని తేలింది. నర్మద విష ప్రయోగం మూలంగా మరణించింది... "

"ఈ ఫొటో చూడండి. ఇది శ్రీమతి నర్మదేనా?" ప్రాసిక్యూటర్ ఒక ఫోటోని అందిస్తూ ప్రశ్నించాడు.

ప్రతి మనిషికీ ఒక తోడున్నప్పుడు
తను ఒంటరిగా ఉండేది......
ఒంటరిగా వున్న ప్రతి మనిషికీ
తానే తోడుగా ఉండేది....
మౌనం ఒక్కటే !
సమస్యలు దండెత్తివస్తే పోరాటం
మౌనంగానే సాగాలి.
మేధ సాగించిన 'మౌనపోరాటం'లో
విజయం ఎవరిదో నిర్ణయించాల్సింది మీరే!

ప్రేమ కథా రచయిత్రి

## యద్దనపూడి సులోచనరాణి

అత్యద్భుత కథనం

## మౌనపోరాటం

వెల. రూ. 20/-

చదవండి! ఆలోచించండి!
పోస్టులో కావాలంటే రూ 10/- ఎమ్.వో
చేయండి. మిగతా రూ. 10/- లకి వి.పి.
పెట్టి పంపిస్తాము.

**ఆంధ్రప్రదేశ్ బుక్ డిస్ట్రిబ్యూటర్స్,**
3237, రాష్ట్రపతిరోడ్, సికింద్రాబాద్ - 500 003.

"అవునండి. నర్మదదే" అన్నాడు ఇన్‌స్పెక్టర్ ఫోటోని తిరిగి ఇచ్చేస్తూ.

"మిస్టర్ జస్టిస్, ఈ ఫోటోని 'పీపుల్స్ ఎగ్జిబిట్'గా గుర్తించి స్వీకరించమని కోరుతున్నా" జడ్జి గోస్వామికి ఫోటో అందిస్తూ అన్నాడు గజాననరావు.

రెండు నిమిషాల్లో ఫోటోని జడ్జి, జ్యూరీసభ్యులూ చూశారు.

"ఇన్‌స్పెక్టర్ సుధాకర్, తరవాతేం జరిగింది?"

"శవాన్ని పోస్టుమార్టమ్‌కి పంపించాను. కరుణాకర్‌ని ప్రశ్నించాను. అతను తనకేమీ తెలీదన్నాడు. అతని సమాధానాలు నాకు తృప్తినివ్వలేదు. సాక్ష్యాలన్నీ అతనే భార్యకి విషం తాగించాడని గొంతులెత్తి అరుస్తున్నాయి. ఛార్జిషీట్ ఫైల్ చేశాను" ఇన్‌స్పెక్టర్ సగర్వంగా ముగించాడు.

"దట్సాల్ ఇన్‌స్పెక్టర్!" అంటూ గజాననరావు కరుణాకర్‌ని వెటకారంగా చూశాడు. "యూ మే క్రాస్ ఎగ్జామిన్ ది విట్నెస్."

కరుణాకర్ అతన్ని క్షణకాలం చూశాడు. "అవసరం లేదు...."

"డాక్టర్ సంజీవరావుగార్ని విట్నెస్ బాక్స్‌లోకి రమ్మంటున్నా!" ప్రాసిక్యూటర్ గంభీరంగా అన్నాడు.

ఫుల్ సూటులో వున్న డాక్టర్ సంజీవరావు బోనెక్కాడు. జేబురుమాలు తీసి, చెమటతో మెరుస్తున్న బట్టతలని ఒకసారి అద్దుకున్నాడు. కళ్ళద్దాల్ని తీసి, తుడిచి, మళ్ళీ తగిలించాడు. చిరునవ్వుతో ప్రాసిక్యూటర్ని చూశాడు. (ఇంకా వుంది)

